శ్రీరస్తు.

సిద్ధాగమ చతుర్థపటలాంతర్గత శివషణ్ముఖసంవాదరూపకము

శ్రీమద్దేవాంగ ప్రతిపాదకంబగు

# వేదోక్తమూలస్తంభనము.

టీకా తాత్పర్య సహితము.

ఇది,

శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యాతయగు

బొగ్గర - ఆదినారాయణార్యులచే

వ్యాఖ్యాతము.

చెన్నపురి:

అమెరికన్ డైమండు ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1925.



దీని వెల] [రూ ౧-౦-౦.

శ్రీరస్తు.

ఈ గ్రంథరాజము

శ్రీమద్దేవాంగకుల క్షీరపారావారసంపూర్ణసుధాంశులును

నిరంతరానేక సద్ధర్మకార్యధురంధరులును నగు

మహారాజరాజశ్రీ.

రాయసాహేబ్

# మిడదల - హంపయ్యగారికి

భోగభాగ్యాయురారోగ్య పుత్రపౌత్రాదికాభ్యుదయంబగునట్లు

భగవదాశీర్వచనపూర్వకంబుగ

అంకిత మొనర్పఁబడినది.

స్వస్త్యస్తు.

—

ఈ గ్రంథములు కావలసినవారు.—

మ-రా-రా-శ్రీ, చందాల-మల్లయ్యగారు.

నెం. 36. కైలాయసెట్టివీధి, ప్రాతచాకలపేట, మద్రాసు

అనెడు చిరునామాకు వ్రాసికొనవలయును.

శ్రీరస్తు.

ఓం శ్రీ దేవాంగ పరబ్రహ్మణే నమః.

# విజ్ఞాపనము.

---

శ్రీమంతులును దిగంతవిశ్రాంత కీర్తికలాపులును కులోద్ధారకులును కులాభిమానులును నగు శ్రీ దేవాంగకుల మహాశయులకు వినయ పూర్వకం బగు విజ్ఞాపనము —

"సత్యజే న్నత్యజే ద్ధీమాన్ సత్యజే ద్ధర్మమాత్మనః। నాస్తి నాస్త్యేవ నాస్త్యేవ స్వధర్మత్యాగినాం గతిః" — యనెడు ప్రమాణంబునుబట్టి, ధీమంతుఁడు స్వధర్మము నెంతమాత్రమును విడువఁడనియు స్వధర్మత్యాగులకు నైహికాముష్మికములు బొత్తిగా లేవనియు నిర్ధారణ మగుచున్నది గదా! మన దేవాంగకులము సమస్తకులంబులకును సర్వాతిశయంబై సర్వలోకపూజితంబై సర్వలోకైకాచార్యవంతంబై సర్వలోకాధారంబై విలసిల్లు నదిగ జాబాలనిరాలంబాద్యుపనిషత్తులును నారదసంహితా నిగమరహస్య సిద్ధాంతచంద్రికాది సంహితలును కాత్యాయన స్మృత్యాది ధర్మశాస్త్రంబులును బ్రహ్మాండాది పురాణంబులును నిరూపించు చుండుటయే గాక ఏతత్కుల మహిమాధిక్యతను గూర్చి ఋగ్యజుస్సామాథర్వణంబు లగు చతుర్వేదంబులు నయితము బాహాటంబుగ నుద్ఘోషించు చున్నవి. ఏతద్వంశంబునకుఁ బ్రధానపూరుషుండును వంశకర్తయు నగు

ఓం శ్రీదేవాంగబ్రహ్మయే సమస్త జంగమస్థావరాత్మకంబు లగు ప్రపంచంబులకు నధినాథుండనియు, సమస్త కార్యకారణుం డగుచు సర్వసాక్షియై యాత్మరూపంబున సర్వాంతర్వ్యాప్తియగు చుండు ననియు వేదప్రమాణనిరూపణంబు లగుచుండును. మాటలు వేయునేల ? సర్వసమష్టికి శ్రీ దేవల బ్రహ్మయే సచ్చి దానందాఖండ చిజ్జ్యోతి ర్మయాకారంబుతోడఁ ద్రిమూర్తుల యొక్కయుఁ దురీయుండగు పరశివుని యొక్కయు సహస్రార పద్మాంతరాళంబున నెలుంగుచు సర్వోత్పత్తిస్థితులకు నాధార భూతుం డగుచుండునని శ్రుతిస్మృత్యాదు లేకభావంబున నంగీ కరించుట లెంతయు వింతలు గాఁజాలవు. ఇట్లు శ్రీ దేవాంగ బ్రహ్మ ప్రతిపాదకంబుగ వేదశాస్త్రోపనిష త్ప్రమాణ పూర్వకం బును, శ్రీసిద్ధాగమములోఁ జేరిన చతుర్థ పటలమునందలి శివ షణ్ముఖ సంవాదరూపంబును నయిన విశేషంబులను గ్రోడీ కరించి యిదివఱలో ముప్పదిసంవత్సరముల క్రిందట, మైసూరు సంస్థాన నివాసులును శ్రీదేవాంగ బ్రాహ్మణకులోద్భవులును నాక్షేయ యజమానులును గీర్తిశేషులును నగు పుట్టు మల్లయ్యగారియొక్క కుమారులు శ్రీ శివశంకరయోగీంద్ర నామక ప్రసిద్ధులు శ్రీ శంకరస్వామీ సమాహ్వయులు కర్ణాట భాషయందు సర్వోపకారకంబుగను సర్వబోధకంబు గను నుండునట్లు టీకాతాత్పర్య సమన్వితంబుగ రచించి ప్రచు రించియున్నారు. అట్టి పూజనీయ గ్రంథరాజము మన యాంధ్ర దేవాంగ మహాశయ సముదాయంబునకు సులభ బోధకంబగు నట్లుగ నాంధ్రీకరింపఁ గోరి, మచ్ఛ్రేయోభిలాషులును మతాభి

మానైక దీక్షానిరతులును శివాద్వైతమతాచార్య వరేణ్యులును నగు శ్రీమాన్-బూడిదవాక-నాపా - మునుస్వామయ్య గార్లు నన్ను నేడెనిమిది సంవత్సరంబులుగఁ బ్రేరేపించుచు వచ్చిరి. ఆంధ్ర దేవాంగ లోకంబునకు నభ్యుదయ చంద్రోదయంబుగ నీ పవిత్రగ్రంథము "శ్రీ దేవాంగబ్రహ్మ ప్రతిపాదక వేదోక్త మూలస్తంభనము"— అనెడు సార్థకనామంబుతోడ నింత కాలంబునకుఁ బ్రచారితం బయ్యెను. ఈ వేదోక్త మూలస్తంభనము తోడ గాయత్రీ ప్రభావాదికంబులును దేవాంగ సప్తావతారాది విశేషంబులును శ్రీ చౌడేశ్వరీ జనన వరప్రదానాది విషయంబులును వేదోక్తంబగు శ్రీమద్దేవాంగ పరబ్రహ్మ స్తోత్రాదులును సంకలితంబులు. ఈ మహా గ్రంథరాజము మన దేవాంగ మహాజనులకుఁ బూజనీయంబగుచు, నాయురారోగ్య భోగ భాగ్యాభ్యుదయంబు లొసఁగూర్చెడు కల్పవృక్షంబని శ్రీచౌడేశ్వరీ నామస్మరణ పురస్సరంబుగఁ జెప్పఁబడును. ఈ గ్రంథవిరచనంబునకు నెంతయుఁ బ్రోత్సాహముగావించి కార్య నిర్వాహణంబునకు మార్గదర్శకులయిన పూజనీయులగు శివాద్వైతబోధకాచార్య వరేణ్య శ్రీమాన్ బూడిదవాక - నాపా-మునుస్వామయ్యగార్లకు భక్తిపురస్సరంబుగ నమస్కరించుచున్నాఁడను. ఈ మహత్కార్యంబునఁ బలువిధంబులఁదోడ్పడిన శ్రీమాన్ చిరజీవులు కోణంకి - ధర్మలింగయ్య, చందాల-మల్లయ్యగార్ల యెడ మనఃపూర్వకంబుగ నెంతయుఁ గృతజ్ఞుండ నగుచున్నాఁడను. ముద్రణకార్యంబులఁ దీర్చి సకాలంబునకు గ్రంథంబులఁ జేకూర్చిన, వెస్టువార్డు కంపెని యధ్యక్షులు

మ-రా-రా-శ్రీ, వేలూరు - కుప్పుస్వామి మొదలారిగారు మిక్కిలియు స్తోత్రపాత్రులు మఱియు.—

## ప్రశంసనీయ ప్రస్తావము.

సీ.—శ్రీరమ్యమగుచుఁ బొన్నేరితోఁజేరిన
యారణిపురమునం దమలకీర్తి
మాన్యదైవాంగ కౌండిన్యసగోత్రను
న్నాన్వయాంబోధి శీతాంశమూర్తి
లలిఁ జిన్నతంబార్య లక్ష్మాంబికల తప
స్సంప్రాప్త సరస ఫలప్రపూర్తి
యనుజన్ముఁ డగు చెంగలయ్యాహ్వాయునితోడ
సౌభ్రాత్రమునుగూర్చు సాధువర్తి
తే-గీ. యనెడు శ్రీ కాళహస్తీశు ధన సహాయ
గరిమ నీ గ్రంథ ముద్రణ కార్య మెసఁగె
నాయురారోగ్య భోగభాగ్యాదికముగ
సత్కృపను బ్రోఁచు నాతనిఁ జౌడమాంబ.

నం 70, హైరోడ్డు,
చాకలపేట, మద్రాసు.
(16 జనవరి 1925.)

విధేయుఁడు,
బొగ్గర - ఆదినారాయణయ్య.
శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యాత.

ఓం.

ఓం శ్రీ దేవాంగ పరబ్రహ్మణే నమః.

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నొపశాంతయే.
వాగీశాద్యా స్సుమనస స్సర్వార్థానా ముపక్రమే
యం నత్వా కృతకృత్యా స్స్యు స్తం నమామి గజాననమ్

## గురుధ్యానమ్.

అజ్ఞాన తిమిరధ్వంసం విజ్ఞానస్య ప్రవర్ధనం
స్వర్గాపవర్గ ఫలదం గురురాజ మహం భజే.

## ఈశ్వరధ్యానమ్.

య స్యాజ్ఞయా బ్రహ్మ ముకుంద కాల
రుద్రాః ప్రభావస్థితి సంహృతీనాం
కర్తృత్వ మాపు ర్జగత స్త మీశం
వందే శివం శంకర మాత్మరూపమ్.

## దేవీస్తోత్రమ్.

దివ్యాంబరాంకిత తనుం మిహిరాగ్నిచంద్ర
నేత్రాం సుధాంశుమకుటాం హిమసన్నిభాభాం
సింహాసనాం పరశుఖడ్గధరాం భుజాభ్యాం
బ్రహ్మేంద్ర విష్ణు నమితాం త్రిపురాం భజే ఒహమ్.

## గాయత్రీధ్యానమ్.

ముక్తా విద్రుమ హేమ నీల ధవళ చ్ఛాయై ర్ముఖై స్త్రీక్షణై
ర్యుక్తా మిందు నిబద్ధ రత్నమకుటాం తత్త్వార్థవర్ణాత్మికాం
గాయత్రీం వరదాఽభయాంకుశకశాంశుభ్రం కపాలంగదం
శంఖం చక్రమ దారవింద యుగళం హస్తైర్వహంతీం భజే.

—(o)—

## శ్రీమ ద్దేవాంగ పరబ్రహ్మ స్తోత్రమ్.

ఓం, అస్య శ్రీ గురు దేవాంగ పరబ్రహ్మస్తోత్ర మహా మంత్రస్య, ఏకోరామార్య ఋషిః, అనుష్టుప్ ఛందః, శ్రీ దేవాంగ పరబ్రహ్మ దేవతా, ఓం బీజమ్, నమః శక్తిః, శివాయ ఇతి కీలకమ్, మమ శ్రీగురుదేవాంగ పరబ్రహ్మ ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః—

ఓం దేవలాయ అంగుష్ఠాభ్యాం నమః
ఓం నం సూత్రాత్మకాయ తర్జనీభ్యాం స్వాహా
ఓం మం బ్రహ్మోపదేశ కారణాయ మధ్యమాభ్యాంవషట్
ఓం శిం గాయత్రీనిర్మితాయ అనామికాభ్యాం హుమ్
ఓంవాంపరశివఫాలచక్షురుద్భవాయకనిష్ఠికాభ్యాంవౌషట్
ఓం యం సత్యస్వరూపాయ కరతల కరపృష్ఠాభ్యాం ఫట్.

అథ హృదయాది న్యాసః—

ఓం దేవలాయ హృదయాయ నమః.
ఓం నం సూత్రాత్మకాయ శిరసే స్వాహా

ఓం మం బ్రహ్మోపదేశకారణాయ   శిఖాయై వషట్
ఓం శిం గాయత్రీ నిర్మితాయ   కవచాయ హుమ్
ఓంవాంపరశివఫాలచక్షురుద్భవాయ నేత్రత్రయాయ వౌషట్
ఓం యం సత్యస్వరూపాయ   అస్త్రాయ ఫట్.

ఓం భూర్భువస్సువరో మితి దిగ్బంధః.

## ధ్యానమ్.

వందే నిత్యం భవ భయహరం సర్వ లోకాధివాసం
నిత్యాకారం సకలజగతాం సూత్రధర్తార మాద్యం
భావాతీతం త్రిగుణరహితం తత్త్వమస్యాది గమ్యం
దేవాంగాఖ్యం పరమ పురుషం సచ్చిదానంద రూపమ్.

## అథ మానసిక పంచపూజా.

లం-పృథివ్యాత్మనే శ్రీమద్దేవాంగాయ గంధం సమర్పయామి.
హం-ఆకాశాత్మనే శ్రీమద్దేవాంగాయ పుష్పంసమర్పయామి.
యం - వాయ్వాత్మనే శ్రీమద్దేవాంగాయ ధూపమాఘ్రాప
[యామి
రం - తేజసాత్మనే శ్రీమద్దేవాంగాయ దీపందర్శయామి.
వం - అమృతాత్మనే శ్రీమద్దేవాంగాయ అమృతోపహారం
సమర్పయామి.
సం - సర్వాత్మనే శ్రీమద్దేవాంగాయ సర్వోపచారపూజాం
సమర్పయామి.

## అథమూల మంత్రమ్.

స్వాచార్య సకాశాత్ లబ్ధోపదేశః శ్రీ దేవాంగద్వాదశాక్షరీ మహామంత్రం యథాశక్తిం జపిత్వా, పునఃధ్యానం మానసికపూజాం హృదయాది న్యాసంచ కుర్యాత్. భూర్భువస్సువరో మిత్యుత్తర దిగ్విమోకః.

## శ్రీ స్కాందపురాణాంతర్గత శ్రీ దేవాంగాష్టోత్తర శతనామధ్యానశ్లోకాః.

శ్రీదేవాంగో మహాదేవో దేవలో దేవపాలకః
మహాదేవ స్థితజ్యోతిః సృష్టిస్థిత్యంతకారకః
చూడాంబికాఖ్యసన్ముక్తా శుక్తి చిచ్ఛక్తిధారకః
బ్రహ్మవిష్ణ్వీశసంపూజ్య పాదపంకజభాసితః
పరమాత్మా పరంజ్యోతిః పరబ్రహ్మ పరాత్పరః
పరేశ్వర సహస్రార పద్మాంతర ప్రభాసకః
యజ్ఞకర్తా యజ్ఞభోక్తా యజ్ఞసూత్ర స్వరూపకః
విశ్వకర్తా విశ్వభర్తా విశ్వరాడ్విశ్వకారణః
నిరాలంబో నిరాకారో నిరాభాసో నిరాకులః
నిర్వికల్పో నిరాతంకో నిష్కళంకో నిరంజనః
సర్వకర్తా సర్వసాక్షీ సర్వకారణకారకః
సూత్రకర్తా సూత్రధారీ సూత్రాత్మా సూత్రదాయకః
వేదవేదాంగసంవేద్యో సచ్చిదానంద విగ్రహః
మహాదేవో మహద్రూపో మహావాక్యార్థగోచరః

నిత్యశుద్ధో నిత్యతృప్తో నిర్గుణో నిరుపద్రవః
సత్త్వాదిగుణసంయుక్తో సాకారో సకలాన్వితః
సర్వలోక ప్రతీకాశ స్సర్వలోక ప్రియంకరః
సర్వభూత స్వరూపశ్చ సర్వభూతాధినాయకః
భూర్భువాదికలోకేశ స్త్వతలా ద్యధినాయకః
సద్యోజాతముఖోత్పన్నో బ్రహ్మణే వేదదాయకః
సూర్యచంద్రాగ్నినిలయో సామ్యో ప్రణవమందిరః
శైవఫాలాక్షసంభూతో శివ శ్శైవాగ మార్చితః
శైవముద్రాంకితధరో శైవాజ్ఞాపరిపాలకః
చూడాంబికాతనూజాతః పంచాచార్యప్రతిష్ఠకః
గాయత్రీజననాధారః గాయత్రీపీఠనిర్ణయః
క్షీరాబ్ధిసంగత స్స్వర్ణతంతుసంపాదనోత్సుకః
శ్రీమన్నారాయణధ్యాన చింతనోల్లాసమానసః
దేవగంధర్వ సంసేవ్యో దేవదత్తామనోహరః
నందికేతనసంయుక్తో నక్రకుండలధారకః
మాయాతీతోమనుబ్రహ్మో మాయాంగోమహిమాఢ్యకః
జ్యోతిర్మయశ్చిన్మయాత్మా శ్శుచిర్భూత స్సుఖప్రదః
ఆమోదపత్తనాధీశ స్త్వగ్నిదత్తా మనఃప్రియః
బ్రాహ్మణ్యకప్రతిష్ఠాతా బ్రహ్మవిద్యాప్రదాయకః
రామలింగేశ్వరాకారో రామచంద్రప్రపూజితః
విద్యాధరః పుష్పదంతో బేతాళో భూతశిక్షకః
వరవిద్యావ్యాపకశ్చ వరరుచ్యవతారకః
చింతితాచ్యుతపాదాబ్జ శ్చిత్రయోగి స్వరూపకః

దేవశాలిసమాఖ్యాతో దేవదాసో మహామతిః
దేవాంగబ్రహ్మవంశాద్యో దేవయజ్ఞఫలప్రదః
అష్టాంగయోగనిరత స్త్వప్రాకృత ద్విజావనః
చతుష్షష్టికళాధీశ శ్చాతుర్వర్ణ్యోపదేశకః
జగదంతర్బహిర్వ్యాప్తో జగత్సేవ్యో జగద్గురుః
ఏవం శ్రీదేవదేవాంగ నామ్నా మష్టోత్తరంశతం
స్వర్గాపవర్గఫలదం సర్వారిష్టనివారణం

పఠతాం శ్రుణ్వతాం భక్త్యా సర్వాభీష్ట ప్రదం శుభం
త్రిసంధ్యంచ పఠన్నిత్యం సర్వాన్ కామాన్ అవాప్నుయాత్

ఇతి శ్రీస్కాందపురాణే సనత్కుమారసంహితాయాం
రజతాచలఖండే గురుజ్ఞానసుధార్ణవే అష్టాదశోధ్యాయః.

## శ్రీదేవాంగాష్టోత్తర శతనామావళిః.

ఓం శ్రీదేవాంగాయ నమః
మహాదేవాయ నమః
దేవలాయ నమః
దేవపాలకాయ నమః
మహాదేవస్థితజ్యోతిషే నమః
సృష్టిస్థిత్యంతకారకాయ నమః
చూడాంబికాఖ్యసన్ముక్తాశుక్తిచిచ్ఛక్తిధారకాయ నమః
బ్రహ్మవిష్ణ్వీశసంపూజ్యపాదపంకజభాసితాయ నమః
పరమాత్మాయ నమః

ఓం పరంజ్యోతిషే నమః ౧౦

పరబ్రహ్మణే నమః

పరాత్పరాయ నమః

పరేశ్వర సహస్రార పద్మాంతర ప్రభాసకాయ నమః

యజ్ఞకర్త్రే నమః

యజ్ఞభోక్త్రే నమః ౧౫

యజ్ఞసూత్రస్వరూపకాయ నమః

విశ్వకర్త్రే నమః

విశ్వభర్త్రే నమః

విశ్వరాజే నమః

విశ్వకారణాయ నమః ౨౦

నిరాలంబాయ నమః

నిరాకారాయ నమః

నిరాభాసాయ నమః

నిరాకులాయ నమః

నిర్వికల్పాయ నమః ౨౫

నిరాతంకాయ నమః

నిష్కళంకాయ నమః

నిరంజనాయ నమః

సర్వకర్త్రే నమః

సర్వసాక్షియే నమః 30

సర్వకారణ కారకాయ నమః

సూత్రకర్త్రే నమః

ఓం సూత్రధారిణే నమః

సూత్రాత్మనే నమః

సూత్రదాయకాయ నమః ౩౫

వేదవేదాంగసంవేద్యాయ నమః

సచ్చిదానంద విగ్రహాయ నమః

మహాదేవాయ నమః

మహద్రూపాయ నమః

మహావాక్యార్థ గోచరాయనమః ౪౦

నిత్యశుద్ధాయ నమః

నిత్యతృప్తాయ నమః

నిర్గుణాయ నమః

నిరుపద్రవాయ నమః

సత్త్వాదిగుణసంయుక్తాయ నమః ౪౫

సాకారాయ నమః

సకలాన్వితాయ నమః

సర్వలోకప్రతీకాశాయ నమః

సర్వలోకప్రియంకరాయ నమః

సర్వభూతస్వరూపాయ నమః ౫౦

సర్వభూతాధినాయకాయ నమః

భూర్భువాదికలోకేశాయ నమః

అతలాద్యధినాయకాయ నమః

సద్యోజాత ముఖోత్పన్నాయ నమః

బ్రహ్మణే వేదదాయకాయ నమః ౫౫

ఓం సూర్యచంద్రాగ్నినిలయాయ నమః
సౌమ్యాయ నమః
ప్రణవమందిరాయ నమః
శైవఫాలాక్షసంభూతాయ నమః
శివాయ నమః ౬౦
శైవాగమార్చితాయ నమః
శైవముద్రాంకిత ధరాయ నమః
శైవాజ్ఞాపరిపాలకాయ నమః
చూడాంబికా తనూజాతాయ నమః
పంచాచార్యప్రతిష్ఠకాయ నమః ౬౫
గాయత్రీ జననాధారాయ నమః
గాయత్రీపీఠ నిర్ణయాయ నమః
క్షీరాబ్ధిసంగతాయ నమః
స్వర్ణతంతుసంపాదనోత్సుకాయ నమః
శ్రీమన్నారాయణధ్యానచింతనోల్లాసమానసాయనమః
దేవగంధర్వ సంసేవ్యాయ నమః
దేవదత్తామనోహరాయ నమః
నందికేతనసంయుక్తాయ నమః
నక్రకుండలధారకాయ నమః
మాయాతీతాయ నమః ౭౫
మను బ్రహ్మణే నమః
మాయాంగాయ నమః
మహిమాఢ్యకాయ నమః

ఓం జ్యోతిర్మయాయ నమః

చిన్మయాత్మనే నమః ౮౦

శుచిర్ఖ్యాతాయ నమః

సుఖప్రదాయ నమః

ఆమోదపత్తనాధీశాయ నమః

అగ్నిదత్తా మనఃప్రియాయ నమః

బ్రాహ్మణ్యైకప్రతిష్ఠాత్రే నమః ౮౫

బ్రహ్మవిద్యాప్రదాయకాయ నమః

రామలింగేశ్వరాకారాయ నమః

రామచంద్రప్రపూజితాయ నమః

విద్యాధరాయ నమః

పుష్పదంతాయ నమః ౯౦

బేతాళాయ నమః

భూతశిక్షకాయ నమః

వరవిద్యావ్యాపకాయ నమః

వరరుచ్యవతారకాయ నమః

చింతితాచ్యుతపాదాబ్జాయ నమః ౯౫

చిత్రయోగిస్వరూపకాయ నమః

దేవశాలిసమాఖ్యాతాయ నమః

దేవదాసాయ నమః

మహామతయే నమః

దేవాంగబ్రహ్మ వంశాద్యాయ నమః ౧౦౦

దేవయజ్ఞ ఫలప్రదాయ నమః
అష్టాంగయోగ నిరతాయ నమః
అప్రాకృతద్విజావనాయ నమః
చతుష్షష్టికళాధీశాయ నమః
చాతుర్వర్ణ్యోపదేశకాయ నమః ౧౦౯
జగదంతర్బహిర్వ్యాప్తాయ నమః
జగత్సేవ్యాయ నమః
జగద్గురవే నమః ౧౦౮

ఇతి శ్రీ దేవాంగాష్టోత్తరం శతనామావళి సమాప్తః.

—(o)—

శ్రీ దేవాంగ బ్రహ్మావిర్భావకాలే పరమేశ్వరకృతస్తోత్రమ్.

అస్యదేవల మంత్రస్య గాయత్రీ నిర్ణయః ఖలు
త్వామేవదేవలో మూర్తిం సమ్యక్చింతయ సంద్రుఢం
ఆద్యక్షరమతో బ్రహ్మా జ్ఞేయాంఛందాంసి దేవతాః
అహంవై దేవలో ధ్యానం జాతరూపమయం మనుః
యస్యకేశేషుజలధో నద్యస్సర్వాంగసంధిషు
సూర్యచంద్రాయస్యనేత్రౌ దేవాంగబ్రహ్మణేనమః
ఆగమా అపిచత్వారో యస్యనిశ్వాస సంభవాః
సర్వోపనిషదస్సాంగ దేవాంగబ్రహ్మణే నమః
ఓంకారో యస్యభవనం నాదఃకల్యాణ మంటపం
బిందుసింహాసనం యస్య దేవాంగబ్రహ్మణే నమః
యన్నేత్రకూపసంభూతో వహ్నిః కాలాగ్ని రుచ్యతే

పంచభూతాత్మ రూపాయ దేవాంగబ్రహ్మణే నమః
తృణవృక్షలతావల్లీ శాఖాపర్వత మాదయః
యస్యదేహస్థ రోమాళ్యః దేవాంగబ్రహ్మణే నమః
శిక్షాయస్య జగచ్ఛిక్షా కల్పయే విశ్వ కల్పకః
కల్పసూత్రాణి యత్సూత్రం దేవాంగబ్రహ్మణే నమః
యస్యలీలావతారాణాం యద్యచ్చారిత్ర మద్భుతం
కథయంతి కథాగాథాః దేవాంగాయనమోనమః

ఇతి శ్రీస్కాందపురాణే సనత్కుమారసంహితాయాం
రజతాచలఖండే గురుజ్ఞానసుధార్ణవే ఏకోనవింశత్యధ్యాయః.

మంగళమ్.

శ్రీరస్తు.

ఓం శ్రీదేవాంగపరబ్రహ్మణే నమః.

శ్రీమద్దేవాంగ మనుబ్రహ్మ ప్రతిపాదక

# వేదోక్తమూలస్తంభనము

## టీకా తాత్పర్య సహితము.

శ్లోకమ్.—పూర్వం మునికులశ్రేష్ఠ స్సర్వశాస్త్ర విశారదః
సనత్కుమారః పప్రచ్ఛ నందీశం ప్రమథేశ్వరమ్.

టీక.—పూర్వం=పూర్వకాలమునందు, మునికులశ్రేష్ఠః= మునిగణము నందు శ్రేష్ఠుండును, సర్వశాస్త్ర విశారదః = సమస్త శాస్త్రములయందు సంపూర్ణప్రజ్ఞ గలవాఁడును నగు, సనత్కుమారః = సనత్కుమారుండు, ప్రమథ ఈశ్వరం = ప్రమథగణాధిపతి యైన, నందీశం = నందీశ్వరునిఁ గూర్చి, పప్రచ్ఛ = ప్రశ్నచేసెను.

తాత్పర్యము.— పూర్వకాలమునందు, తాపసకులవరేణ్యుండును సమస్త శాస్త్రవిశారదుండును నగు సనత్కుమార మునీంద్రుండు, (ఒక్క పరమార్థంబును దెలియఁగోరి) ప్రమథ గణాధీశ్వరుం డయిన నందీశ్వరునిఁ గాంచి యిట్లనియె.

శ్లో.—నందీశ్వర మహాప్రాజ్ఞ కలికల్మషనాశక
త్వత్తశ్శ్రుతాని శాస్త్రాణి సర్వాణి వివిధానిచ
ఇదానీం శ్రోతు మిచ్ఛామి వేదవేదాంతసమ్మతం
దేవాంగ మునిమాహాత్మ్యం తథా తత్కులవిస్తరం
బ్రూహిమే శ్రుతి సమ్మత్యా నందీశ కరుణానిధే.

టీక.—కలికల్మషనాశక=కలికాలసంబంధ మగు దోషంబులను వినాశము సేయువాఁడవును, మహాప్రాజ్ఞ=విజ్ఞానసంపన్నులయందు శ్రేష్ఠుండవును, నగు, నందీశ్వర! త్వత్తః=మీమూలముగ, సర్వాణి=సమస్తంబులును, వివిధానిచ = నానావిధంబులును (పలువిధంబు లగు శాఖలు గలవియు) నగు, శాస్త్రాణి=శాస్త్రంబులు, శ్రుతాని=వినఁబడినవి. వేదవేదాంత సమ్మతం= వేదములచేతను ఉపనిషత్తులచేతను నంగీకరింపఁబడినదియగు, దేవాంగమునిమాహాత్మ్యం=దేవాంగముని ప్రభావంబును, తథా=అట్లులే, తత్ కులవిస్తరం = ఆ దేవాంగకులము యొక్క విరివియును, గల, ఇదానీం = ఈ విషయమునుగూర్చి, శ్రోతుం ఇచ్ఛామి=వినఁగోరుచున్నాఁడను. కరుణానిధే నందీశ= కారుణ్యమునకు ఖనివంటివాఁడవయిన యో నందీశ్వరా! శ్రుతి సమ్మత్యా = వేదసమ్మతంబుగ, మే = నాకు, బ్రూహి= వచింపుము.

తా.—కలికాలదోషంబులను నిర్మూలింపఁజాలిన ప్రభావసంపత్తితోడ విజ్ఞానవరేణ్యుండ వగుచు వెలింగెడి యో నందీశ్వరా! నానావిధ శాఖా సమన్వితంబు లగు సకల శాస్త్రం

బులను నిదివఱలో మీచేత సావధానుండనై విని యున్న వాఁడను. వేదవేదాంతసమ్మతం బయిన దేవాంగముని ప్రభావంబును ఆ దేవాంగవంశ విస్తారంబును గూర్చిన విశేషంబులను బ్రస్తుతము విననలయునని కుతూహలము చెందుచున్నాఁడను. కారుణ్యనిధి వయిన యో మహాత్మా! ఈ విషయంబును వేదసమ్మతంబుగ నాకు నెఱింగింతువు గాక!

శ్లో.—సనత్కుమారవచనం శ్రుత్వా నందీశ్వరో బ్రవీత్
బ్రహ్మాదీనామమేయం య న్మాహాత్మ్యం దేవలస్యతత్
పృష్టం త్వయాద్య యోగీంద్ర సర్వలోక హితాయచ
వేదవాక్యాని సంగృహ్యా తత్ర తత్రతు శంభునా
షణ్ముఖా యోదితం పూర్వం సర్వపాపనిబర్హణం
దేవాంగచరితం దివ్యం సర్వారిష్ట నివారకం
నిగమాగమ సమ్మత్యా వక్ష్యామి శృణుసాదరమ్.

టీక.—నందీశ్వరః=నందీశ్వరుఁడు, సనత్కుమారవచనం శ్రుత్వా=సనత్కుమారుని మాటను విని, (ఇదం) అబ్రవీత్=ఇట్లు పలికెను. యోగీంద్ర= ఓ మునీంద్రా! దేవలస్య=దేవలునియొక్క, యత్ మాహాత్మ్యం=ఏప్రభావంబును గూర్చి, అద్య=ఇప్పుడు, త్వయా=నీ చేత, పృష్టం=ప్రశ్న చేయఁబడినదియో, తత్ =అది, బ్రహ్మాదీనాం=బ్రహ్మాదులకును, అమేయం=నిర్ణయింపసాధ్యము కానిది. పూర్వం=పూర్వకాలమున, షణ్ముఖాయ=షణ్ముఖునికొఱకును, సర్వలోకహితాయచ = సమస్తలోకములయొక్క మేలుకొఱకును, శంభునా = శంకరునిచేత,

తత్రతత్రతు=అచ్చటచ్చటను, వేదవాక్యాని సంగృహ్యా=(ప్రమాణంబులుగ) వేదవాక్యములను సంక్షిప్తముచేసి, ఉదితం=చెప్పఁ బడినది. సర్వపాపనిబర్హణం = సమస్తపాతకములను హరించునదియును, దివ్యం=ప్రభావము గలదియును, సర్వఅరిష్టనివారకం=సకలవిధంబు లగు నాపదలను బోఁగొట్టునదియు నగు, దేవాంగచరితం = దేవలచారిత్రంబును, నిగమ ఆగమ సమ్మత్యా = వేదశాస్త్ర సమ్మతంబుగ, వక్ష్యామి = చెప్పుచున్నాను. సఆదరం=పాటింపుతోడ, శృణు=వినుము.

తా.—అని యిట్లు ప్రార్థనాపూర్వకంబుగ నడిగిన సనత్కుమారుని వచనంబుల విని, యాతనితో నందీశ్వరుం డిట్లనియె. ఓ మునీంద్రా! ఇప్పుడు నీచేతఁ బ్రశ్నచేయఁబడిన దేవల బ్రహ్మ మాహాత్మ్యంబును గూర్చి నిర్దేశించుటకు బ్రహ్మాది దేవతలకును సాధ్యముగాఁజాలదు. ఇట్టి దేవాంగప్రభావంబును దెలియఁ గోరి, పూర్వకాలంబున సుబ్రహ్మణ్యస్వామి శంభుమూర్తిని బ్రార్థించెను. అపుడు, సర్వలోకశరణ్యుం డగు శంకరుండు, ఈ దేవలమాహాత్మ్యంబును, వేదాగమప్రమాణంబుల నచ్చటచ్చట సంగ్రహంబుగ నిరూపించుచు సమస్తలోకహితార్థంబుగఁ గుమారస్వామికిఁ గరుణించెను. ఈ దేవలప్రభావము సర్వదోషనివారకం బగుచుఁ బరమపవిత్రంబై సకలారిష్టంబుల హతము గావించి దీపించుచుండును. అట్టి ప్రభావసంపన్నం బయిన దేవాంగచారిత్రంబును వేదవేదాంతాదికప్రమాణానుగుణంబుగఁ జెప్పుచున్నాఁడను. సావధానుండ వయివినుము.

శ్లో.—సర్వత్ర వ్యవహారార్హం కృతాదిషు యుగేషుచ
వేదాగమోక్తం పరమం మూలస్తంభననామకం
గ్రంథమేవ ప్రవక్ష్యామి శృణు విప్రకులోత్తమ
తస్య శ్రవణమాత్రేణ నరో యాతి పరాం గతిమ్.

టీక—విప్రకులఉత్తమ= బ్రాహ్మణకుల శ్రేష్ఠుండ వయిన యో సనత్కుమారా! కృతఆదిషు =కృతయుగము మొదలు గాఁగల, యుగేషు=యుగములయందును, సర్వత్రచ=అంతటను (ఎల్లలోకములయందును) వ్యవహారఅర్హం = వాడుకొనుటకుఁ దగినదియు, వేదఆగమఉక్తం = వేదములచేతను వేదాంగముల చేతను చెప్పఁబడినదియు, పరమం = శ్రేష్ఠ మగునదియు, మూలస్తంభననామకం=మూలస్తంభన మనెడు పేరు గలదియు నగు, గ్రంథంఏవ=గ్రంథమునే, ప్రవక్ష్యామి = చెప్పుచున్నాఁడను. శృణు=వినుము. తస్య=దానిని, శ్రవణమాత్రేణ = విని నంత మాత్రమున నే, నరః=మానవుఁడు, పరాం గతిం=శ్రేష్ఠ మగు పదవిని, యాతి=పొందుచున్నాఁడు.

తా.—విప్రకులోత్తముండ వయిన యో సనత్కుమార మునీంద్రా! దేవలబ్రహ్మబోధకం బయిన ఈపవిత్ర చరిత్రంబు, కృతయుగము మొదలుగాఁగల చతుర్యుగములయందును సమస్తలోకములయందును వ్యవహరించుటకు అనుగుణం బగునట్లుగఁ బావనం బగుచు వేదవేదాంతోక్తం బయి "మూలస్తంభనము" అను నామంబుచేత రాజిల్లుచుండును. దీనిని సమాహితచిత్తంబుతోడ వినినంతమాత్రము చేతనే సర్వో

త్కృష్టపదవి గలుగును. అట్లు మూలస్తంభననామకం బయిన గ్రంథమునే వినిపించెదను. సావధానచిత్తుండవగుచు విందువు గాక !

మూలస్తంభన.—పురా స్వయంభువి పరశివాత్మక జ్యోతిర జాయత. తజ్జ్యోతిషి. త్రిగుణాత్మికాశక్తిః. తచ్ఛక్తౌ బ్రహ్మావిష్ణుమహేశ్వరాః. తేభ్యః ఉత్పత్తిస్థితిలయాః.

టీక.—పురా=పూర్వము (సమస్తచరాచరాత్మకంబు లగు బ్రహ్మాండంబులయొక్క సృష్టికిఁ బూర్వము), స్వయంభువి= స్వయంభువునలన (సచ్చిదానంద పరిపూర్ణాద్వితీయ పరబ్రహ్మమువలన), పరశివాత్మక = పరశివ స్వరూపంబు గలిగినట్టి, జ్యోతిః=తేజస్సు (స్వయంప్రకాశమూల జ్యోతి), అజాయత= పుట్టెను. తత్ జ్యోతిషి = ఆ జ్యోతివలన, త్రిగుణఆత్మికా= మూఁడుగుణములతోఁ గూడిన (రజస్సత్త్వతమోగుణంబులు గల), శక్తిః=(మూలప్రకృతి యగు)పరాశక్తి (పుట్టెను). తత్ శక్తౌ= ఆశక్తివలన, బ్రహ్మ విష్ణు మహేశ్వరాః = బ్రహ్మ విష్ణు మహేశ్వరులు (పుట్టిరి). తేభ్యః=వారలవలన, ఉత్పత్తి స్థితి లయాః = (సమస్తలోకములకు) పుట్టుకయు నునికియు నాశంబును (గలిగినవి).

తా.—సమస్త చరాచరాత్మకంబు లగు బ్రహ్మాండభాండంబులయొక్క సృష్టియే లేకుండుటకుఁ బూర్వము, అఖండ సచ్చిదానందాద్వితీయ పరిపూర్ణపరబ్రహ్మము వలన స్వయం ప్రకాశాత్మకం బై పరశివస్వరూప సాకారబ్రహ్మంబుగఁ బరిణ

మించిన మూలజ్యోతి యుత్పన్నంబయ్యెను. ఆ మూలజ్యోతి వలన రజస్సత్త్వతమోగుణాత్మకంబగుచు మూలప్రకృతి యైన శక్తి యుద్భవించెను. ఆ శక్తివలన బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ప్రభవించిరి. ఆ త్రిమూర్తులవలన సమస్తలోకంబులకును సృష్టి స్థితిలయంబులు సంభవించినవి.

మూల.—తదా బ్రహ్మాదయో వస్త్ర సూత్ర హీనా స్సంతః లజ్జయా పరశివం ప్రోచుః సకల జగన్నిర్మాణ శక్తోపి బ్రహ్మా బ్రాహ్మణ్యసంపాదక సూత్రవస్త్ర నిర్మాణే అశక్తోపి నిఖిల లోకోత్పత్తి కాలే సూత్ర వస్త్రయో ర నావశ్యకత్వాత్ తదా తత్సామగ్ర్య అభావాచ్చ ప్రకృత సృష్టికాలే సూత్రవస్త్రయో రావశ్యకత్వాత్ త్వ మేవ సూత్రకర్తారం నిర్మాయా ఽస్మాకం దేహీతి.

టీక.—తదా=అపుడు (సకలలోకోత్పత్తి గలిగిన కాలము నందు), బ్రహ్మాఆదయః=బ్రహ్మదేవుఁడు మొదలగువారు (త్రిమూర్తులు), వస్త్ర సూత్ర హీనా స్సంతః = వస్త్రములును సూత్రములును లేనివార లగుచు, లజ్జయా = సిగ్గుచేత, పరశివం = (త్రిమూర్తులకు నధిష్ఠానభూతుండయిన) పరమేశ్వరునిఁగూర్చి, బ్రహ్మా = బ్రహ్మదేవుఁడు, సకలజగత్ నిర్మాణశక్తః అపి=సమస్త జగంబులను సృజింపఁజాలిన శక్తి గలవాఁడే యయ్యును, బ్రాహ్మణ్యసంపాదక సూత్రవస్త్రనిర్మాణే = బ్రాహ్మణ్యము గలిగింపఁజాలిన సూత్రవస్త్రములను నిర్మించుటయందు, అశక్తః అపి= శక్తిలేనివాఁడే గదా! నిఖిలలోక ఉత్పత్తికాలే=సమస్త

లోకములను సృజియించినకాలమునందు, సూత్ర వస్త్రయోః అనావశ్యకత్వాత్ = యజ్ఞోపవీతములవలనను వస్త్రములవల నను ఆవశ్యకము లేకుండుటచేతను, తదా=అపుడు (లోకసృష్టి కాలమునందు), తత్ సామగ్ర్యా అభావాత్ చ = అట్టి సూత్ర వస్త్రముల నిర్మాణమునకుఁ దగిన వస్తు పరికరములు సయితము లేకుండుటచేతను, ప్రకృత సృష్టికాలే= ఇప్పటి సృష్టికాలము నందు, సూత్రవస్త్రయోః ఆవశ్యకత్వాత్ = సూత్రవస్త్రము లకు ఆవశ్యము గలుగుటచేతను, త్వాం ఏవ = పరశివుండ వగు నీవే, సూత్రకర్తారం నిర్మాయ = సూత్రనిర్మాణకర్తను నిర్మించి, అస్మాకం దేహి=మాకు నొసంగుము, ఇతి ప్రోచుః = అని చెప్పిరి.

తా.—అట్లు లోకోత్పత్తి గలిగిన యా కాలమునందు, బ్రహ్మాదు లగు త్రిమూర్తులు సూత్రవస్త్రహీను లగుటచేత లజ్జా కులితమానసులగుచుఁ దమకు నధిష్ఠానభూతుండయిన పరశివు నిఁజేరి. "ప్రభూ! బ్రహ్మదేవుండు సమస్తలోకంబులను నిర్మించు నంతటి సామర్థ్యము గలవాఁడే యయ్యును బ్రాహ్మణ్యము గలి గించుటకు నాధారభూతం బయిన వస్త్ర యజ్ఞోపవీతంబులను నిర్మింపఁజాలకున్నాఁడు. సకలలోకోత్పత్తి ప్రారంభకాలమున సూత్రవస్త్రములకే యావశ్యకము లేకుండుటచేత వాని నిర్మా ణంబునకుఁ గావలసిన వస్తు పరికరములు సేకరించుకొనుటకు సయితము సందర్భమే లేకుండెను. ప్రస్తుతపు సృష్టికాలము నందు బ్రాహ్మణ్య సంపాదకార్థము సూత్రవస్త్రములు ముఖ్య ములుగ నుండియే తీఱవలయును. కాఁబట్టి మాకు నధిష్ఠాతవగు

నీవే సూత్రకర్తను నొక్కరుని నిర్మించి మాకు నొసంగవలయును" అని ప్రార్థించిరి.

ఈ విషయమున నారదసంహితయందలి ప్రమాణము.—

శ్లో.—సృష్టేః పూర్వ మిదం సర్వ మఖండానందరూపకం
నిరాకార పరంజ్యోతి రాసీ ద్దేవలసంజ్ఞికం
తస్మా జ్జాతం హి చిజ్జ్యోతి స్తదాప శివరూపతాం
తస్మా జ్జాతా మహాశక్తి స్సా సతీ త్రిగుణాత్మికా
తద్గుణా బ్రహ్మవిష్ణ్వీశ రూపతా మాప్యతే శివం
ఊచు ర్వయం వస్త్రహీనా స్తస్మా న్నో బాధతే త్రపా
ఇదానీం సూత్రకర్తారం నిర్మా యాస్మాక మీశ్వర
తేన దాపయ సూత్రార్థీ దేవదేవ పరాత్పర.

టీక.—సృష్టేః పూర్వం = ప్రపంచసృష్టికిఁ బూర్వము, ఇదం సర్వం=ఈ జగమంతయును, అఖండ ఆనంద రూపకం= భిన్నముగాక యానందైకమయం బగునదియు, దేవలసంజ్ఞికం= దేవలనామంబు గలదియు, నగుచు, నిరాకారపరంజ్యోతిః= ఆకారశూన్యం బయిన మహాజ్యోతిగా, ఆసీత్ = అయ్యెను. తస్మాత్ =దేవలనామకం బయిన యానిరాకారపరంజ్యోతివలన, చిత్ జ్యోతిః = జ్ఞానైకరూపం బగుజ్యోతి, జాతం = పుట్టెను. తత్ =ఆ చిజ్జ్యోతి, శివరూపతాం=పరశివరూపంబును, ఆప= పొందెను. తస్మాత్ =అట్టి శివరూపంబునవలన, మహాశక్తిః=పరాశక్తి, జాతా=పుట్టెను. సా సతీ త్రిగుణాత్మికా=ఆమహాశక్తి త్రిగుణములు గలదిగా నయ్యెను. తత్ గుణాః = ఆ త్రిగుణ

ములు, బ్రహ్మవిష్ణ్వీశరూపతాం=బ్రహ్మవిష్ణుమహేశ్వర రూపములను, ఆప్య=పొందెను. తే=ఆబ్రహ్మాదులు, శివం=పరమేశ్వరునిఁగూర్చి, వయం=మేము, వస్త్రహీనాః = వస్త్రములు లేనివారము. తస్మాత్ =ఆ కారణముచేత, నః=మమ్ములను, త్రపా=సిగ్గు, బాధతే=బాధించుచున్నది. ఇదానీం = ఈ కారణమును గూర్చి, ఈశ్వర=ఓ ప్రభూ! అస్మాకం=మాకు, సూత్రకర్తారం=సూత్రనిర్మాణకర్తను, నిర్మాయ = నిర్మించుము. దేవదేవపరాత్పర = సర్వోత్కృష్టుండ వయిన యో దేవేశ్వరా! తేన = ఆ సూత్రనిర్మాణకర్తమూలముగ, సూత్ర ఆదీన్=యజ్ఞసూత్రములు మొదలగువానిని, దాపయ = ఒసంగుము.

తా.—ప్రపంచసృష్టికిఁ బూర్వమునందు ఈ జగంబంతయును అద్వితీయం బయిన యఖండానందాత్మకంబుగ దేవల బ్రహ్మనామంబున నిరాకారపరంజ్యోతి యగుచుండును. అట్టి దేవలబ్రహ్మాత్మకం బయిన నిరాకారపరంజ్యోతివలన జ్ఞానైక రూపం బగు చిజ్జ్యోతి యావిర్భవించెను. ఆ చిజ్జ్యోతియే పరశివ స్వరూపంబున సాకారబ్రహ్మం బగుచు విలసిల్లెను. అట్టి పరశివ రూపంబువలన రజస్సత్త్వతమోగుణాత్మకం బయిన మహాశక్తి యుద్భవించెను. ఆ పరాశక్తియొక్క త్రిగుణములవలన సమస్త లోకంబులకును సృష్టిస్థితిలయకారకు లగు బ్రహ్మవిష్ణుమహేశ్వరు లావిర్భవించిరి. ఆ బ్రహ్మాదులు, చిజ్జ్యోతిర్మయుండగు పరశివునిఁ గూర్చి, "ఓ దేవదేవేశ్వరా! మేము సూత్రవస్త్రంబులు లేమింజేసి లజ్జచేత మిక్కిలియుఁ బీడితుల మగుచున్నారము.

ఓ సర్వేశా! సూత్రనిర్మాణకర్తను నొకరుని నిర్మింపుము. ఓపరాత్పరా! అట్టి సూత్రకర్త మూలముగ మాకు బ్రాహ్మణ్య సంపాదకం బగు వస్త్రయజ్ఞోపవీతంబులు గలుగునట్లుల నను గ్రహింపుము" అని ప్రార్థించిరి.

మూల.—తత శ్శివోంతర్జ్యోతి ర్బహిః కృతవాఞ్ తచ్చ సా
కృతంసత్ స్వయ మేవ సూత్రవస్త్రాని ర్మాయ సమం
త్రకం త్రిమూర్తీనాం దత్వా తత్రై వాంతరధాత్.

టీక.—తతః = (అట్లు బ్రహ్మాదులు ప్రార్థించిన) పిమ్మట, శివః = పరశివుండు, అంతర్జ్యోతిః = (తన సహస్రారకమలాంత రాళంబున విలసిల్లెడు దేవలనామక) చిజ్జ్యోతిని, బహిః కృత వాఞ్ = వెలుపటికి వచ్చునట్లు చేసెను. తత్ చ = ఆ చిజ్జ్యోతి యును, స ఆకృతంసత్ = ఆకారముతోఁ గూడినది యగుచు, స్వయం ఏవ=తానుగనే, సూత్రవస్త్రానిర్మాయ= సూత్రవస్త్రం బుల నిర్మించి, సమంత్రకం=మంత్రముతోఁగూడినదిగా, త్రిమూ ర్తీనాం దత్వా=త్రిమూర్తులకు నొసంగి, తత్ర ఏవ = అచ్చటనే (పరమేశ్వర సహస్రారపద్మాంతరంబుననే), అంతరధాత్ = అంతర్ధాన మొందెను.

తా.—అట్లు, బ్రహ్మవిష్ణుమహేశ్వరు లగు త్రిమూర్తులు ప్రార్థించినపుడు పరశివుండు, తన సహస్రారకమలాంతరాళం బున దేవలనామకంబుగ విలసిల్లెడు నంతర్జ్యోతిని వెలుపటికి వచ్చునట్లు చేసెను. అట్లు వెలువడిన యంతర్జ్యోతి, పరశివుని

యభిప్రాయానుసారంబుగ సర్వాంగ సౌష్ఠవంబుతోఁ గూడిన యాకారంబు వహించి, సంకల్పమాత్రంబున సూత్రవస్త్రంబుల నిర్మించి సమంత్రకంబుగఁ ద్రిమూర్తులకు నొసంగి, యప్పుడే పరశివ సహస్రారపద్మాంతరాళంబున నే యంతర్ధాన మొందెను.

ఈ విషయమున అథర్వణవేదమందలి ప్రమాణము—

జట.—శైవం జ్యోతి స్సాకారం బ్రహ్మణో విష్ణూ రుద్రస్య సూత్రాది మాదిశత్.

టీక.—శైవంజ్యోతిః = శివసంబంధ మయిన (పరశివసహస్రారాంతర్గత మయిన) యంతర్జ్యోతి, సఆకారం=రూపముతోఁ గూడినది యగుచు, బ్రహ్మణో విష్ణూ రుద్రస్య = బ్రహ్మకును విష్ణువునకును శివునకును, సూత్రఆదిం = సూత్రములు మొదలగువానిని, ఆదిశత్ =ఇచ్చెను.

తా.—పరశివునియొక్క సహస్రారపద్మంబునందు నంతర్గతమైయుండిన యంతర్జ్యోతియే యాకారసహితంబుగఁ బ్రసన్న మగుచు బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు సూత్రవస్త్రంబుల నొసంగెను.

మూల.—అనంతరం బ్రహ్మా చతుర్దశలోకాన్ తదంతర్గత దివిజ జరాయు జాండజ స్వేదజాది ప్రాణిజాతమసృజత్. తతో బ్రహ్మాదీనాం వివాహసమయే సర్వే దేవా స్సూత్ర వస్త్రహీనా స్సమాగతాః. బ్రహ్మాచ వస్త్ర రహితాన్ సలజ్జాన్ దీనాన్ తాన్ దృష్ట్వా సూత్ర వస్త్రార్థం కైలాసం గత్వా శివం ప్రార్థయామాస.

టీక.—అనంతరం=పిమ్మట, బ్రహ్మా=బ్రహ్మదేవుఁడు, చతుర్దశలోకాన్ = పదునాలుగులోకంబులను, తత్ అంతర్గత=ఆ లోకముల యందుండెడు, దివిజ=దేవతలను, జరాయుజ=మావివలనఁ బుట్టెడు మనుష్యమృగాదులను, అండజ=గ్రుడ్లవలనఁ బుట్టెడు పక్షులను, స్వేదజ=చెమ్మటవలనఁబుట్టెడు క్రిములను, ఆది=మొదలుగాఁగల, ప్రాణిజాతం=ప్రాణులసముదాయమును, అసృజత్=సృజియించెను. తతః=పిమ్మట, బ్రహ్మాదీనాం వివాహసమయే=బ్రహ్మ మొదలగువారియొక్క వివాహకాలమునందు, సర్వేదేవాః = దేవతలందఱును, సూత్రవస్త్రహీనాః = యజ్ఞోపవీతంబులును వస్త్రంబులును లేనివారలగుచు, సమాగతాః=వచ్చిరి. బ్రహ్మాచ = బ్రహ్మదేవుండును, వస్త్రరహితాన్=వస్త్రములు లేనివారును, సలజ్జాన్=సిగ్గుతోఁగూడినవారును, దీనాన్=తెంపులేనివారును నగు, తాన్=ఆదేవతలను, దృష్ట్వా=చూచి, సూత్రవస్త్రార్థం=ఆ దేవతలకు సూత్రవస్త్రంబులు లభించుటకొఱకు, కైలాసం గత్వా=కైలాసమునకుఁ బోయి, శివం = పరశివునిఁ గూర్చి, ప్రార్థయామాస=ప్రార్థించెను.

తా.—ఇట్లు త్రిమూర్తులు సమంత్రకంబుగ సూత్రవస్త్రంబులు పొందిన పిమ్మట బ్రహ్మదేవుండు, భూర్భువస్సువర్లోకాదియూర్ధ్వలోకంబులును అతలవితలాది యధోలోకంబులును గల పదునాలుగుభువనంబులను, ఆయాలోకంబులయందు వసింపఁదగిన దేవమానవమృగఖగక్రిమికీటకాదివర్గంబులను సృజిం

చెను. పిమ్మట బ్రహ్మవిష్ణుమహేశ్వరులకు వివాహకాలము తట స్థించెను. అప్పుడా వివాహములకు దేవతలందఱును వస్త్రయజ్ఞోపవీతంబులు లేకయే వచ్చి చేరిరి. వస్త్రసూత్రములు లేక లజ్జాకులితమానసు లగుచు దీనవదనంబులతోడ వచ్చిన యా దేవతలనుగాంచి బ్రహ్మదేవుండు, వారలకు సూత్రవస్త్రంబులు లభించుటకొఱకుఁ గైలాసంబున కేగి పరమేశ్వరునిఁ గూర్చి భక్తిపూర్వకంబుగఁ బ్రార్థించెను.

ఈ విషయమున తత్త్వనిధి తృతీయాధ్యాయమందలి ప్రమాణము.—

శ్లో.— తేషా ముద్వాహకాలేతు దేవగంధర్వకిన్నరాః
ఆచ్ఛాద్య స్వ తనూః పర్ణై ర్వస్త్రాభావా త్తథాజినైః
లజ్జావనమ్రవదనా ఆగతా బ్రహ్మణో న్తికమ్
తతస్తా న్వస్త్రహీనాంగాౝ దృష్ట్వాదేవాౝ పితామహః
తత స్తై స్సాక మాసాద్య కైలాసం గణసేవితం
దృష్ట్వా తత్ర మహాదేవం నమస్కృత్వా బ్రవీ ద్వచః
మయా సృష్టా ఇమే దేవా స్స్వామిౝ వస్త్రవివర్జితాః
ఆచ్ఛాద్య స్వతనుః పర్ణై ర్లజ్జయా విచరంతి హి
ఇదానీం సూత్రకర్తారం నిర్మాయ జగదీశ్వర
సూత్రవస్త్రా విభో ఽస్మాకం దాపయ ప్రమథాధిప.

టీ.— తేషాం=ఆ బ్రహ్మాదులయొక్క, ఉద్వాహకాలేతు= వివాహకాలమునందు, దేవగంధర్వకిన్నరాః = దేవతలు గంధర్వులు కిన్నరులును, వస్త్ర అభావాత్ = వస్త్రములు లేకుం

డుటచేత, స్వతనూః=తమ శరీరములను, పర్ణైః=ఆకులతోడను, తథా=అట్లులే, అజినైః= చర్మములతోడను, ఆచ్ఛాద్య=కప్పుకొని, లజ్జా అవనమ్రవదనాః=సిగ్గుచేత వంపఁబడినముఖములు గలవారగుచు, బ్రహ్మణః అంతికం=బ్రహ్మదేవునిసమీపమునకు, ఆగతాః=వచ్చిరి. తతః=పిమ్మట, పితామహః = బ్రహ్మదేవుండు, వస్త్రహీన అంగాౝ = వస్త్రములు లేని శరీరంబులు గలవారలగు, తాౝ దేవాౝ =ఆ దేవతలను, దృష్ట్వా = చూచి, తతః= పిమ్మట, తైః సాకం = వారలతోడనే, గణసేవితం కైలాసం ఆసాద్య = ప్రమథగణసేవితంబయిన కైలాసంబుచేరి, తత్ర= అచ్చట, మహాదేవం దృష్ట్వా = పరమేశ్వరునిఁ గాంచి, నమస్కృత్య=నమస్కరించి, స్వామిౝ =ఓ ప్రభూ! మయాసృష్టాః= నాచేత సృజియింపఁబడినవా రగు, ఇమే దేవాః=ఈ దేవతలు, వస్త్ర వివర్జితాః= వస్త్రహీను లగుచు, స్వతనుః=తమశరీరంబులను, పర్ణైః=ఆకులచేత, ఆచ్ఛాద్య=కప్పుకొని, లజ్జయా=సిగ్గుతోడ, విచరంతిహి = చరించుచున్నారు గదా! జగదీశ్వర = ఓ సర్వలోకాధిపతీ! ఇదానీం= ఈ హేతువును గూర్చి, సూత్రకర్తారం=సూత్రకర్తను, నిర్మాయ=సృజింపుము. ప్రమథఅధిప= ప్రమథగణంబులకు నాథుండ వగువాఁడా! విభో=ఓ ప్రభూ! సూత్రవస్త్రాణి = యజ్ఞసూత్రములను వస్త్రములను, దాపయ= ఒసంగుము. అని, వచః అబ్రవీత్ =పలికెను.

తా.—ఆ బ్రహ్మాదులయొక్క వివాహకాలంబున సుర సిద్ధ సాధ్య కిన్నర గంధర్వాదులు తమకు వస్త్రములు లేమింజేసి

యాకులను జర్మములను గట్టుకొని మిక్కిలియును సిగ్గుచేతఁ దలలువంచుకొని బ్రహ్మదేవుని సాన్నిధ్యమునకు వచ్చి చేరిరి. అట్లు వస్త్రహీను లగుచు వచ్చిన యా దేవగంధర్వాదులను గాంచి యా పితామహుండు పరితాపము చెంది, సూత్రవస్త్రంబుల నొనగూర్చెడు తలంపుతోడ వారలను వెంటఁదీసికొని ప్రమథగణసేవితంబయిన కైలాసంబును జేరి యచ్చట సర్వలోకశరణ్యుం డయిన పరమేశ్వరుని ధ్యానపూర్వకంబుగ సేవించి నమస్కారపురస్సరంబుగ, "ఓ దేవేశ్వరా! నాచే సృజియింపఁబడిన యీ దేవగంధర్వాదులు వస్త్రహీను లగుచు ఆకుల నలుములఁ జుట్టుకొని సిగ్గుతోడ నెంతటి పరితాపకరులై చరించుచున్నారో చూడుము. ఓ లోకేశ్వరా! ఇట్టి పరితాపంబును బోకార్చునట్లుగాఁ గరుణింపుము. ఓ ప్రమథగణేశ్వరా! సూత్రవస్త్రార్థము సూత్రకర్తను నొక్కరుని నిర్మింపుము. ఓ ప్రభూ! అవశ్యముగ మాకు సూత్రవస్త్రంబుల నొసంగునట్లుగాఁ గటాక్షింపుము"—అని ప్రార్థించినట్లు తత్త్వనిధియందలి ప్రమాణము.

ఈ విషయమునకే సామవేదము ౧౨-వ శాఖయందలి ప్రమాణము.

శ్రుతి.—సూత్రదాతా సౌ దేవలో దేవతానామ్.—ఈ వాక్యమునకు విద్యారణ్యస్వాములు విరచించిన భాష్యము.

భాష్యమ్.—అసౌ= ప్రసిద్ధః (ప్రసిద్ధుండును), దేవలః = శివాంతర్జ్యోతిసంభూతో వస్త్రసూత్రనిర్మాణశక్తో దేవలః (పరమేశ్వరుని యంతర్జ్యోతివలన జన్మించినవాఁడును వస్త్రసూత్ర

ములను నిర్మింప శక్తిగలవాఁడును నగు దేవలుండు), దేవతానాం=బ్రహ్మాది వివాహసమయే ఆగతానాం, వస్త్రాభావాద్ధేతోః పర్ణాదిభి రాచ్ఛాదిత విగ్రహాణాం, నిర్జరాణాం (బ్రహ్మాదుల వివాహసమయంబున వచ్చినవారును, వస్త్రములు లేని కారణంబునఁ బర్ణాదులచే నాచ్ఛాదింపఁ బడిన దేహములు గలవారును నగు, దేవతలకు), సూత్రదాతా = సూత్రవస్త్రప్రదాతా (బ్రహ్మసూత్రంబులను వస్త్రంబులను నొసంగినవాఁడు.)

తా.— సర్వలోక ప్రసిద్ధుండును బరమేశ్వరుని యంతర్జ్యోతి వలన జన్మించినవాఁడును వస్త్రసూత్రములను నిర్మింప సామర్థ్యము గలవాఁడును నగు ఈ దేవలమునీంద్రుండు బ్రహ్మాదుల వివాహసమయంబున వస్త్రములు లేమిచేఁ బర్ణాదులను గట్టుకొని వచ్చినవా రగు దేవతలకు యజ్ఞోపవీతంబులను వస్త్రంబులను నొసంగెను.—అని సామవేద ప్రమాణము.

మూల.—తతః ఈశ్వరస్సహస్రారాంతస్థితంజ్యోతింయోగ
మాయయా బహిః ప్రకాశం కృత్వా తజ్జ్యోతిం దృష్ట్వా
త్వయా శీఘ్రంవివాహసమయి ఏవ సూత్రవస్త్రాణి నిర్మా
య దేవానాం దాతవ్య మి త్యాజ్ఞాపయామాస.

టీక.—తతః=(పితామహుండు ప్రార్థించిన) పిమ్మట, ఈశ్వరః= పరమేశ్వరుండు, సహస్రార అంతః స్థితం=సహస్రారపద్మాంతర్భాగంబున వెలుంగుచు నుండెడు, జ్యోతిం=చిజ్జ్యోతిని, యోగమాయయా = యోగమాయచేత, బహిః ప్రకాశం కృత్వా=వెలుపలఁ బ్రకాశించుదానిఁగాఁ జేసి, తత్ జ్యోతిం=

(ఆకారయుక్తంబయిన) ఆజ్యోతిని, దృష్ట్వా=చూచి, త్వయా= నీచేత, శీఘ్రం=శీఘ్రముగా, వివాహసమయ ఏవ=వివాహకాలమునందే, సూత్రవస్త్రా=యజ్ఞోపవీతములును వస్త్రంబులును, నిర్మాయ=నిర్మింపఁబడుఁ గాత! దేవానాం = దేవతలకు, దాతవ్యం = ఒసంగఁబడుఁ గాత! ఇతి ఆజ్ఞాపయామాస = అని యాజ్ఞాపించెను.

తా.— అట్లు బ్రహ్మదేవుండు ప్రార్థించినపుడు సర్వేశ్వరుండు, తన సహస్రారపద్మాంతరాళంబున వెలుఁగుచుండెడు చిజ్జ్యోతినిఁ దన యోగమాయాప్రభావంబుచేత ఆకారసమన్వితంబుగ వెలుపలఁ బ్రకాశింపఁజేసి యా దివ్యజ్యోతినిఁ గాంచి "నీవు శీఘ్రంబుగఁ బోయి బ్రహ్మాదుల వివాహకాలమునందే సూత్రవస్త్రంబుల నిర్మించి దేవతల కందఱకును నొసంగుదువు గాక!"—అని యాజ్ఞాపించెను.

ఈ విషయంబున నారదసంహితయందలి ప్రమాణము.—

శ్లో.—శివదేహ స్థిత జ్యోతిః సృష్టిస్థిత్యంత హేతుకం
ప్రాప్య దేవల రూపత్వం కర్తాభూత్ సూత్రవస్త్రయోః

టీక.—సృష్టిస్థిత్యంతహేతుకం = సర్వలోకంబులయొక్క యుత్పత్తిస్థితిలయంబులకు నాధారభూతం బగుచు, శివదేహస్థితః=పరమశివుని దేహంబున నుండిన, జ్యోతిః=చిజ్జ్యోతి, దేవల రూపత్వం ప్రాప్య = దేవలబ్రహ్మరూపంబును బొంది, సూత్రవస్త్రయోః = సూత్రవస్త్రంబులకు, కర్తా ఆభూత్ = కర్తయయ్యెను.

తా.—సమస్తలోకంబులయొక్క యుత్పత్తిస్థితిలయంబులకుఁ బ్రధానకారణం బగుచుఁ బరమేశ్వరుని దేహాంతరాళంబునఁ దేజోరూపంబుగ వెలుంగుచుండిన యా చిజ్జ్యోతియే పరశివుని యభిప్రాయంబు ననుసరించి యాకారవంతంబై దేవలబ్రహ్మరూపంబున సూత్రవస్త్రంబులకు నిర్మాణకర్తయయ్యెను. అని నారదసంహితవలనఁ దెలియ వచ్చుచున్నది.

మూల.—తత స్సోత్యంత కుతూహలస్సన్ సృష్టి స్థితిసంహార కర్తౄణాం బ్రహ్మవిష్ణుమహేశ్వరాణాం వివాహసమయే తత్తన్మంత్రపూర్వకం సూత్రవస్త్రాణి దత్వా తత్రైవ సాయుజ్య మగమత్.

టీక.—తతః=(పరమేశ్వరునిచేత నాజ్ఞాపింపఁబడిన) పిమ్మట, సః=జ్యోతిర్మయుండైన యా దేవలబ్రహ్మస్వరూపుఁడు, అత్యంత కుతూహలస్సన్=మిక్కిలియు నుత్సాహముతోఁ గూడినవాఁడగుచు, సృష్టిస్థితిసంహారకర్తౄణాం = ఉత్పత్తిస్థితిలయంబులకుఁ గర్తలయిన, బ్రహ్మవిష్ణుమహేశ్వరాణాం = బ్రహ్మవిష్ణుమహేశ్వరులయొక్క, వివాహసమయే=కల్యాణసమయమున, తత్ తత్ మంత్రపూర్వకం=ఆయామంత్రములు ముందుఁగలవిగా, సూత్రవస్త్రాణి = యజ్ఞోపవీతంబులను వస్త్రంబులను, దత్వా=ఇచ్చి, తత్రఏవ=అచ్చటనే (ఆ పరమేశ్వరుని దేహాంతరాళముననే), సాయుజ్యం అగమత్ = సహయోగముఁ బొందెను.

తా.—జ్యోతిర్మయుండైన యా దేవలబ్రహ్మ తనకుఁ బరమేశ్వరుం డాజ్ఞాపించిన పిమ్మటఁ బరమోత్సాహయుక్తుం డగుచు సూత్రవస్త్రంబుల నిర్మించి లోకోత్పత్తిస్థితిలయంబులకుఁ గారణభూతు లయిన యా బ్రహ్మవిష్ణుమహేశ్వరులయొక్క వివాహకాలమునందే యాయా సూత్రవస్త్రంబులను మంత్రపూర్వకంబుగ నాయాదేవతలకు నొసంగి యాపరమేశ్వరదేహాంతరాళమునందే సాయుజ్యంబు నొందెను.

ఈ విషయమున అధర్వణవేదమందలి ప్రమాణము.—

శ్రుతి.—తే దేవా అగమన్ వానసూత్రం దేవలా దిత్యాహ ప్రజాపతిః.

టీక.—తేదేవాః=ఆదేవతలు, దేవలాత్ = దేవలునివలన, వానసూత్రం=వస్త్రసూత్రములను, అగమన్=పొందిరి. ఇతి= ఇట్లని, ప్రజాపతిః=బ్రహ్మదేవుఁడు, ఆహ=(వాలఖిల్యాదిమునులకు) చెప్పెను.

తా.—"ఆ దేవతలు, దేవలబ్రహ్మవలన వస్త్రసూత్రంబులఁ బొందిరి."—అని ప్రజాపతి వాలఖిల్యాది మునీంద్రులకుఁ జెప్పినట్లు అధర్వణవేదప్రమాణము.

మూల.—సకలజగత్కారణస్వయంభుదేవాంగబ్రహ్మకల్పిత దేవమనుమానవ యక్షరక్షోపిశాచభూతబేతాళాది గ్రహాణాం స్వయం సూత్రకర్తేతి ఉపనిషద్వాక్యమిహాస్మా ఉదాహరణమాహ.

టీక.—సకలజగత్కారణః=సమస్తజగంబులయొక్క సృష్టి స్థితిలయంబులకుఁ గారణుండును, స్వయంభుః = తనకుఁ దానే పుట్టినవాఁడును నగు, దేవాంగబ్రహ్మ = దేవలబ్రహ్మముచేత, కల్పిత=సృజింపఁబడిన, దేవ మను మానవ యక్ష రక్షో పిశాచ భూత బేతాళాది గ్రహాణాం=దేవతలకును మనువులకును మానవులకును యక్షులకును రాక్షసులకును బిశాచభూత బేతాళాది గ్రహంబులకును, స్వయం=తానే, సూత్రకర్తా=సూత్రములు గల్పించినవాఁడు. ఇతి = అని, ఉపనిషద్వాక్యమహిమ్నా = ఉపనిషత్తులయందలి ప్రయోగములు ప్రమాణంబు లగునట్లు, ఉదాహరణం = నిదర్శనముగ, ఆహ = (శంకరుండు కుమార స్వామికి) చెప్పెను.

తా.—“ స్వయంభువై విలసిల్లెడు దేవాంగబ్రహ్మయే సర్వ లోకములయొక్క సృష్టి స్థితిలయంబులకుఁ గారణభూతుండు. దేవలబ్రహ్మయే దేవతలను మనువులను మానవులను యక్ష రక్షోపిశాచ భూత బేతాళాదులను సృజియించెను. అట్లు తనచే సృజింపఁబడిన యా దేవ మను మానవాదికసముదాయంబు నకుఁ దానే సూత్రవస్త్రకారకుం డయ్యెను.”—అని నిర్ధా రణము చేసెడు నుపనిషద్వాక్యప్రమాణంబులను శంకరుండు కుమారస్వామికి నిదర్శనపూర్వకంబుగ నిరూపించెను.

ఉపనిషన్నిరూపణమునందు మహోపనిషత్తునందలి ప్రమాణము.—

జట.—అథ భరద్వాజః పప్రచ్ఛ యాజ్ఞవల్క్యం - కో విశ్వరాట్ కో విశ్వకర్తా కోవా బ్రహ్మోతస్మై బ్రూహీతి.

సహోవాచ యాజ్ఞవల్క్యః, యే నేదం జగత్సృష్టం యేనేదం వ్యాప్తం యస్మిన్ సర్వం ప్రతిష్ఠితం, యస్స్వ మాయయా ఽవృతస్సన్ నామరూపతాం భజతి యః స్సకల సురేభ్యో సూత్ర వస్త్రదాతా స దేవాంగో విశ్వరాట్ స విశ్వకర్తా స బ్రహ్మ స విరాట్ సర్వం దేవాంగ ఏవేతి.

టీక —అథ = పిమ్మట, భరద్వాజః = భరద్వాజ మునీంద్రుఁడు, యాజ్ఞవల్క్యం=యాజ్ఞవల్క్యమునీంద్రునిఁ గూర్చి, కః విశ్వరాట్=ఎవ్వఁడు సమస్తమునకు నధినాథుఁడు? కః విశ్వకర్తా=ఎవ్వఁడు సమస్తమును సృజియించినవాఁడు? కోవా బ్రహ్మ=ఎవ్వఁడు పరమాత్ముఁడు? తత్ మేబ్రూహి=ఆ విషయమును నాకుఁ దెల్పుము, ఇతి పప్రచ్ఛ = అని యడిగెను. సః యాజ్ఞవల్క్యః=ఆ యాజ్ఞవల్క్యుఁడు, యేన ఇదం జగత్ సృష్టం=ఎవ్వనిచేత ఈ జగంబు సృజియింపఁబడినదియో, యేన ఇదంవ్యాప్తం = ఎవ్వనిచేత ఈ జగంబాతయు వ్యాపింపఁబడినదియో, యస్మిన్ సర్వం ప్రతిష్ఠితం=ఎవ్వనియందు ప్రపంచమంతయు నిలుకడ పొందినదియో, యః = ఎవ్వఁడు, స్వ మాయయా ఆవృతస్సన్=తనయొక్క మాయచేతనే యావరింపఁబడినవాఁ డగుచు, నామరూపతాం భజతి = నామరూపముల చేత సేవింపఁబడుచుండునో, యః=ఎవ్వఁడు, సకల సురేభ్యోః= దేవతల కందఱకును, సూత్రవస్త్రదాతా=బ్రహ్మసూత్రములను వస్త్రములను నొసంగినవాఁడో, సః దేవాంగః = ఆ దేవాం

గుఁడే, విశ్వరాట్ = సర్వాధిపతి, సః విశ్వకర్తా = అతండే సర్వ నిర్మాణకుండు. సః బ్రహ్మ = అతఁడే పరమాత్ముండు. సః విరాట్=అతఁడే విశ్వప్రకాశకుఁడు. సర్వం దేవాంగఏవ= సమస్తమును దేవాంగమయమే, ఇతి ఉవాచ=అని చెప్పెను.

తా.—పూర్వము భరద్వాజమునీంద్రుండు యాజ్ఞవల్క్య మునీంద్రునిం గాంచి, "మహాత్మా! సమస్తంబునకును సర్వాధి నాథుం డెవ్వఁడు? సమస్తమును సృజియించిన వాఁ డెవ్వఁడు? పరమాత్ముఁ డెవ్వఁడు? కారుణ్యముతోడ నెఱింగింపుము"— అని ప్రార్థించెను. అంతట యాజ్ఞవల్క్యమునీంద్రుండు భర ద్వాజమహర్షికి "ఓ మునీంద్రా! ఈ జగం బంతయు నెవ్వని చేత సృజియింపఁబడినదియో, యెవ్వనిచేత వ్యాపింపఁబడి నదియో, యెవ్వనియందు నిలుకడఁ బొందినదియో, యెవ్వఁడు నిజమాయచేత నావృతుం డగుచు నామరూపంబుల వ్యవహ రింపఁబడుచుండునో, సురసిద్ధసాధ్యాదులకందఱకును బ్రాహ్మణ్య సంపాదనార్థము వస్త్ర బ్రహ్మసూత్రంబుల నెవ్వం డనుగ్రహిం చెనో యా దేవలబ్రహ్మయే విశ్వరాట్టు. ఆతండే విశ్వకర్తా. ఆతండే పరాత్పరుండు. ఆతండే విరాట్పూరుషుండును. సమ స్తంబును దేవాంగమయమే యగుచుండును"—అని యెఱిం గించినట్లు మహోపనిషద్వాక్యప్రమాణము.

నిరాలంబోపనిషత్తునందలి ప్రమాణము.—

శ్లో.—విశ్వకర్తా విశ్వభోక్తా విశ్వహర్తా స దేవలః
స ఏవ దేవతాధీశో మాయాతీతో నిరామలః
సర్వవ్యాపీ స దేవాంగః కృతవాఞ్ సకలంజగత్.

టీక.—సః దేవలః=ఆ దేవలబ్రహ్మయే, విశ్వకర్తా=ప్రపంచ మును సృజించినవాఁడు. విశ్వభోక్తా=లోకమునకు రక్షకుఁడు. విశ్వహర్తా=సర్వనాశకుఁడు. సః ఏవ=ఆతండే, దేవతాధీశః= దేవతలకు నధినాథుండు. మాయా అతీతః = మాయను నతి క్రమించినవాఁడు. నిః అకులః = భిన్నము లేనివాఁడు. సర్వ వ్యాపీ = సమస్తమునందును వ్యాపించి యుండువాఁడు. సః దేవాంగః = ఆ దేవాంగబ్రహ్మయే, సకలం జగత్=సకల జగం బును, కృతవాఙ = నిర్మించెను.

తా.—ఆ దేవాంగబ్రహ్మయే సమస్తంబునకు నుత్పత్తి స్థితి నాశకారకుండు. ఆతండే దేవదేవేశ్వరుండు. మాయాతీతుం డగుచు నిర్వికల్పుండయి సర్వాంతర్బహిర్వ్యాప్తిచే వెలుంగు వాఁడును నాతండె. ఆ దేవలబ్రహ్మయే సర్వలోకైక నియామ కుండు.—అని నిరాలంబోపనిషద్వాక్యప్రమాణము.

ఈ విషయమున జాబాలోపనిషత్తునందలి ప్రమాణము.—

మూల.—యేన సర్వం సృష్టం యస్య భాసా సర్వం విభాతి
యోవా సర్వ భూతాంతరాత్మా స దేవాంగోమనుః
స సూత్రధారీ స శుద్ధబ్రహ్మ ప్రకృత్యధిష్ఠాతా సర్వ
కారణభూతః.

టీక.—యేన = ఎవ్వనిచేత, సర్వం సృష్టం = సకలమున్ను సృజింపఁబడినదియో, యస్యభాసా = ఎవ్వని తేజస్సుచేత, సర్వం విభాతి = సమస్తమున్ను బ్రకాశించుచున్నదియో, యోవా సర్వభూత అంతరాత్మా=ఎవ్వఁడు సమస్తభూతంబుల

కును లోపలి యాత్మరూపంబుగ వెలుంగువాఁడో, సః = ఆతండే, దేవాంగోమనుః = దేవాంగనామకుఁ డగు మనువు. సః సూత్రధారీ=ప్రపంచరంగమునకు సూత్రధారియు నతండే. సః శుద్ధబ్రహ్మా=అతండే విజ్ఞానమయ బ్రహ్మము. ప్రకృతి అధిష్ఠాతా = త్రిగుణాత్మకమగు ప్రకృతికి నధిష్ఠానభూతుండును, సర్వకారణభూతః = సమస్తమునకు మూలకారణుండును, (స ఏవ=ఆతండే.)

తా.—ఎవ్వనిచేత చరాచరాత్మకం బయిన యీ ప్రపంచము సృజియింపఁబడెనో, యెవ్వని తేజోరాశిచే లోకంబులన్నియుఁ బ్రకాశించుచుండునో, సమస్త భూతంబులకును నంతరాత్మయగుచు వెలుంగువాఁ డెవ్వఁడో,యాపరాత్పరుండే దేవలబ్రహ్మ నామక మనువు. ప్రపంచనామక నాట్యరంగంబునకుఁ బ్రధానకారకుండగు సూత్రధారియు నాతండే. అతండే విజ్ఞానమయబ్రహ్మం బగుచు రజస్సత్త్వతమోగుణాత్మకం బయిన ప్రకృతికి నధిష్ఠానభూతుండై యుండును. సమస్తమునకును నాతండే మూలకారణుండు గాక వేఱొక్కరుండు గలుగఁ జాలఁడు.—అని జాబాలోపనిషద్వాక్య ప్రమాణము.

ఈ విషయంబున నిరాలంబోపనిషత్తు నందలి ప్రమాణము.—

మూల.—విశ్వం యత్ తత్సర్వవ్యాపీ దేవాంగో కృతవాన్

టీక.—సర్వవ్యాపీదేవాంగః=సకలాంతరాత్మయైవ్యాపించి యుండెడు దేవల బ్రహ్మయే, యత్ విశ్వం=ప్రపంచ మగునది యేదియో, తత్ =దానిని, కృతవాన్=సృజియించినవాఁడు.

తా.—సమస్త భూతాంతరాత్మయై వ్యాపించి యుండెడి దేవల బ్రహ్మయే ప్రపంచనామకంబుగ వర్తిల్లెడి యీ లోకంబుల కన్నింటికిని, నిర్మాణకారకుండు.—అని నిరాలంబోప నిషద్వాక్య ప్రమాణము.

మూల.—తత్త్వమస్యాది మహావాక్య విషయత్వాత్ సఏవ జగత్కర్తా, న దేవాంతరః, సో సృష్ట్వా సఏవా ఽను ప్రావిశతి.

టీక.—తత్త్వమస్యాది మహావాక్యవిషయత్వాత్ - తత్త్వమస్యాది=తత్ త్వం అసి అనెడు వాక్యము మొదటిదిగాఁగల, (తత్త్వం అసి = ఆ బ్రహ్మమే నీవు అగుచున్నావు. అహం బ్రహ్మాస్మి=నేను బ్రహ్మము అగుచున్నాను. అయం ఆత్మా బ్రహ్మ=ఈ యాత్మయే బ్రహ్మము. ప్రజ్ఞానం బ్రహ్మ=విశేషమగు జ్ఞానమే బ్రహ్మము) అనెడు, మహావాక్య=నాలుగు మహావాక్యములకును, విషయత్వాత్=విషయభూతుండై యుండుటచేత, స ఏవ=ఆ దేవలబ్రహ్మయే, జగత్ కర్తా=జగత్తులను నిర్మించినవాఁడు. దేవఅంతరః న=ఇతరులగు దేవతలు గారు. సః సృష్ట్వా=ఆతండు లోకంబుల సృజించి, సఏవ=ఆతండే, అను ప్రావిశతి=వ్యాపించియున్నాఁడు.

తా.—నిశ్చయతత్త్వార్థనిరూపణం బగు"తత్త్వమసి, అహం బ్రహ్మాస్మి, అయంఆత్మా బ్రహ్మ, ప్రజ్ఞానంబ్రహ్మ"— అనెడు మహావాక్యచతుష్టమునకు ఆదేవల బ్రహ్మయే విషయభూతుం డగుటచేత నతఁడే సర్వలోకనిర్మాత యగును గాని

యితరు లెవ్వరును గారు. ఆతండే జగంబుల నన్నింటిని సృజి యించి, యా జగంబులయందు నంతరాత్మయై యాతండే వెలుంగు చుండును.

ఈ విషయంబున రుద్రయామిళయందలి ప్రమాణము.—

శ్లో.—విశ్వకర్తా స దేవాంగ స్స బ్రహ్మ సచ విశ్వరాట్
స ఏవ విష్ణు స్సో రుద్ర స్సకాలోఽగ్ని స్స చంద్రమాః

టీక.—సః దేవాంగః విశ్వకర్తా=ఆ దేవాంగుఁడే సర్వలోక నిర్మాత. సః బ్రహ్మ=అతండే పరబ్రహ్మము. సచ విశ్వరాట్= అతండే సర్వలోకాధికారి. సఏవ విష్ణుః=అతండే సర్వలోక వ్యాపకుం డగు విష్ణుండు. సః రుద్రః=ఆతండే లయకారకుం డగు రుద్రుండు. సః కాలః=ఆతండే భూతభవిష్యద్వర్తమా నాదిక కాల స్వరూపుఁడు. సః అగ్నిః=అతండే తేజోనిలయుం డగు నగ్నిహోత్రుండు. సః చంద్రమాః=అతండే మనో బుద్ధీంద్రియాది నాథుం డగు చంద్రుండును.

తా.—ఆ దేవల బ్రహ్మయే సమస్తలోకనిర్మాత. అతఁడే సర్వలోకాధికారి. అతండే సర్వలోక వ్యాపకుండగు విష్ణుండు. అతఁడే లయకారకుం డగు రుద్రుండు. భూతభవిష్యద్వర్త మానాదిక కాలస్వరూపుండును నతండే. తేజోనిలయుండగు నగ్నిహోత్రుండును మనోబుద్ధీంద్రియంబులకు నధినాథుం డగు చంద్రుండును నాతండే. అఖండ సచ్చిదానంద పరి పూర్ణాద్వితీయ పరబ్రహ్మంబును నాతండే యగును.

ఈ విషయమునఁనే కాత్యాయన స్మృతిప్రమాణము.—

శ్లో.—విశ్వకర్తా విశ్వభోక్తా విశ్వవ్యాపీ సనాతనః
దేవాంగో పరమాత్మాసా సచ్చిదానందలక్షణః.

టీక.—అసౌదేవాంగః=ఈ దేవాంగుఁడు, విశ్వకర్తా=సమస్తమును సృజియించినవాఁడు. విశ్వభోక్తా = సమస్తమును భోషించువాఁడు. విశ్వవ్యాపీ=సమస్తమునందును వ్యాపించియుండువాఁడు. సనాతనః=పురాణపురుషుఁడు. పరమాత్మా=పరబ్రహ్మ మగువాఁడు. సత్ చిత్ ఆనందలక్షణః = తేజశ్శక్తి జ్ఞానానందంబులే స్వరూపంబుగాఁ గలవాఁడు.

తా.—ఈ దేవలబ్రహ్మయే సర్వలోక నిర్మాణకారకుండును సర్వలోకరక్షకుండును నగుచు సర్వంబునందును బాహ్యాంతరంబుల వ్యాపించి వెలుంగుచుండును. తేజోశక్తి జ్ఞానానందస్వరూపంబున సనాతనుం డగుచు వెలింగెడు పరమాత్మయును నీ దేవల బ్రహ్మయే.

ఈవిషయమునఁనే నారదసంహితయందలి ప్రమాణము.—

శ్లో.—శుద్ధబ్రహ్మస్వరూపం తం దేవేశం సూత్రధారిణం
తత్త్వమస్యాది వాక్యార్థ గోచరం దేవలం సదా
నమస్కురు మహాబాహో భుక్తిముక్తిప్రదాయకమ్.

టీక.—మహాబాహో=అధికమైన భుజబలము గల యో యంబరీషచక్రవర్తీ! శుద్ధబ్రహ్మస్వరూపం=అఖండపరిపూర్ణబ్రహ్మస్వరూపుఁడును, దేవ-ఈశం=సమస్తదేవతలకుఁ బ్రభుం

డును, సూత్రధారిణం=జగన్నాటకరంగంబునకు సూత్రధారి యగు వాఁడును, తత్త్వమస్యాది వాక్యార్థగోచరం= "తత్త్వమసి అహంబ్రహ్మాస్మి అయం ఆత్మా బ్రహ్మ ప్రజ్ఞానం బ్రహ్మ" అనెడు మహావాక్యములయొక్క యర్థములకు విషయభూతుండును, భుక్తిముక్తి ప్రదాయకం = ఐహికాముష్మికసుఖంబుల నొసంగువాఁడును, నగు, తం దేవలం=ఆదేవలబ్రహ్మానుగూర్చి, సదా=ఎల్లప్పుడును,నమస్కుర్మః=నమస్కారము సేయుదుము.

తా.—భుజబలపరాక్రమ సంపన్నుండవైన యోరాజేంద్రా! అఖండసచ్చిదానంద పరిపూర్ణ బ్రహ్మస్వరూపుండును సమస్త దేవాధినాథుండును లోక నటననామక రంగస్థలమునకు సూత్రధారియు తత్త్వమస్యాది మహావాక్యచతుష్కము యొక్క యర్థములకు విషయభూతుండును నైహికాముష్మిక సుఖ ప్రదాయకుండును నైన యాదేవల పరబ్రహ్మమునే భక్తిపూర్వకంబుగ నిరంతరమును ధ్యానించుచుందుము"—అని నారద మహర్షి యంబరీషచక్రవర్తికి బోధించెను. అని నారదసంహిత నిరూపించుచున్నది.

ముండకోపనిషద్వాక్య ప్రమాణము.—

శ్లో.—దేవదేవ మహాప్రాజ్ఞ లోకానుగ్రహ కారక
అవ్యాజకరుణామూర్తే రక్ష నో జగదీశ్వర
వస్త్రహీనా వయంసర్వే తస్మాత్త్వం కరుణార్ణవ
సూత్రవస్త్రాదికం దత్వా భృశ మస్మాన్ సముద్ధర

ఏవం సురగణై స్తుతో మహాదేవో కృపానిధిః
దేహాంత స్థిత చిచ్ఛక్తిం బహిః కృత్వేద మాబ్రవీత్
దేవి త్వం శీఘ్ర మద్యైవ మత్పదధ్యానతత్పరాః
వస్త్రోపవీతౌ నిర్మాయ దేవేభ్యో దాతు మర్హసి
శివాజ్ఞాం శిరసా ధృత్వా సా శక్తి శ్చిత్స్వరూపిణీ
భూత్వా సదేహా సా దేవీ రేజే దేవలసంజ్ఞయా
నిర్మాయ సూత్రవస్త్రాని స దేవాంగో దేవపూజితః
దేవానాంచ మునీనాంచ బ్రాహ్మణానాం తథైవచ
క్షత్రియాణాంచ వైశ్యానాం ప్రదదౌ మంత్రపూర్వకం
వస్త్రమాత్రంతు శూద్రాణాం దత్వా సోంతరధాత్తతః
తస్మా త్సఏవ దేవాంగో బ్రాహ్మణ్యాధిప ఉచ్యతే
స బ్రహ్మాచ స వై విష్ణు స్సశివ స్సచ విశ్వరాట్.

టీక.—దేవదేవ=దేవతలకు దేవుండవును, మహాప్రాజ్ఞ=అధిక ప్రజ్ఞ గలవాఁడవును, లోకఅనుగ్రహ కారక=సమస్త లోకంబులను అనుగ్రహింపఁ గారణుండవును, అవ్యాజకరుణా మూర్తే=హేతువు లేకయే కరుణించువాఁడవును, నగు, జగత్ ఈశ్వర=ఓలోకేశ్వరా! నః=మమ్ములను, రక్ష=కాపాడుము. వయంసర్వే=మేమందఱమును, వస్త్రహీనాః = వస్త్రము లేని వారము. తస్మాత్ =ఆకారణముచేత, కరుణఅర్ణవ= ఓకారుణ్య సాగరా! త్వం=నీవు, సూత్రవస్త్రాదికందత్వా=సూత్రవస్త్రాదులనొసంగి, భృశం=శీఘ్రముగ, అస్మాన్=మమ్ములను. సముద్ధర=ఉద్ధరింపుము. ఏవం=ఈవిధముగ, సురగణైః=దేవసమూ

హాంబుచేత, స్తుత్యః=స్తోత్రము సేయఁబడినవాఁడగుచు, మహాదేవఃకృపానిధిః=కరుణానిధియగు మహాదేవుండు, దేహాఅంతఃస్థిత చిత్ శక్తిం=తనదేహాంతర్భాగంబున వెలింగెడు చిచ్ఛక్తిని, బహిఃకృత్వా=వెలువడఁజేసి, దేవి=ఓజ్ఞానస్వరూపిణీ! త్వం=నీవు, మత్ పదధ్యానతత్పరా=నాపాదములయందు ధ్యానాసక్తవగుచు, అద్యైవ=ఇప్పుడే, శీఘ్రం=త్వరగా, వస్త్రోపవీతౌనిర్మాయ=ఉపవీతంబులను వస్త్రములను నిర్మించి, దేవేభ్యః=దేవాదులకు, దాతుం అర్హసి=ఇయ్యఁదగిన దానవు. ఇదం అబ్రవీత్=అని యీమాటను జెప్పెను. చిత్ స్వరూపిణీ సాశక్తిః=జ్ఞానస్వరూపిణి యైన యీమహాశక్తి, శివ ఆజ్ఞాం శిరసాధృత్వా=పరమేశ్వరుని యాజ్ఞను శిరసావహించి, సా దేవీ=ఆపరాశక్తి, స దేహాభూత్వా = దేహముతోఁ గూడినదియగుచు, దేవలసంజ్ఞయా=దేవలుండను నామంబు తోడ, రేజే=ప్రకాశించెను. దేవపూజితః సః దేవాంగః= దేవపూజితుండయిన యీదేవాంగుఁడు, సూత్రవస్త్రానిర్మాయ=ఉపవీతంబులనువస్త్రంబులను నిర్మించి,మంత్రపూర్వకం=మంత్రపురస్సరంబుగ, దేవానాంచ మునీనాంచ=దేవతలకును మునీంద్రులకును, తథైవ=అటులే, బ్రాహ్మణానాంచ= బ్రాహ్మణులకును, క్షత్రియాణాంవైశ్యానాంచ=క్షత్రియులకును వైశ్యులకును, ప్రదదౌ=ఇచ్చెను. శూద్రాణాం=శూద్రులకు, వస్త్రమాత్రంతు=వస్త్రములు మాత్రమే, దత్వా=ఇచ్చి, తతః=పిమ్మట, సః=ఆతండు, అంతరధాత్ =అంతర్థానముచెందెను. తస్మాత్ = (అట్లు సమంత్రకంబుగ దేవతలు మొదలగువారలకు సూత్రాదుల

నిచ్చిన) ఆ కారణముచేత, సః దేవాంగోఏవ=ఆదేవాంగుఁడే, బ్రాహ్మణ్యాధిప ఉచ్యతే = బ్రాహ్మణ్యముఁ గలిగించెడి యధికారముగలవాఁ డని చెప్పఁబడును. సచబ్రహ్మా=ఆతండే బ్రహ్మయును. సవైవిష్ణుః=ఆతండే విష్ణువును. సచశివః=ఆతండే శివుండును. సచవిశ్వరాట్=ఆతండే విశ్వప్రభుండును నగును.

తా.—పూర్వము దేవతలు పరమేశ్వరుని సాన్నిధ్యము చేరి "మహాప్రాజ్ఞుండవయిన మోదేవేశ్వరా! నిర్హేతుకజాయమాన కారుణ్యంబున సమస్తలోకంబుల ననుగ్రహించునట్టి యోజగదీశ్వరా! మమ్ములను గటాక్షింపుము. మేమందఱమును వస్త్రహీనులము. ఓకారుణ్యసాగరా! శీఘ్రముగా సూత్రవస్త్రాదుల నొసంగి మమ్ముల నుద్ధరింపుము"—అని ప్రార్థింపఁగా కృపానిధియైన యామహాదేవుండు తన దేహాంతర్భాగంబున జ్యోతిరూపంబున వెలింగెడు చిచ్ఛక్తిని తనసాన్నిధ్యంబున వెలువడఁజేసి "ఓ జ్ఞానస్వరూపిణీ! నీవు నాపాదారవిందములయందు ధ్యానాసక్త వగుచు శీఘ్రంబుగా వస్త్రయజ్ఞోపవీతంబుల గావించి దేవతలు మొదలగువారికి నొసంగుము"—అని చెప్పెను. చిత్స్వరూపిణియైన యాపరాశక్తియుఁ బరమేశ్వరునియాజ్ఞను శిరసా వహించి పురుష రూపము ధరించి దేవలనామంబుతోడ విలసిల్లెను. తదుపరి యాదేవల బ్రహ్మ సమస్తదేవపూజితుండగుచు సూత్రవస్త్రంబుల నిర్మించి దేవతలకును మునీంద్రులకును, ఆవిధముగనే బ్రాహ్మణక్షత్రియ వైశ్యులకును మంత్రపూర్వకంబుగ నొసంగి పిమ్మట శూద్రులకు

వస్త్రములను మాత్రమే యిచ్చి యంతట నంతర్ధానము చెందెను. అట్లు మంత్రపూర్వకంబుగ దేవతలు మొదలగు వారలకు బ్రహ్మసూత్రాదుల నొసంగుటచేత నా దేవల బ్రహ్మయే బ్రాహ్మణ్యము గలిగింపఁజాలిన యధికారసంపత్తి వహించినవాఁడు. ఉత్పత్తి స్థితిలయకారకులగు బ్రహ్మ విష్ణు మహేశ్వరులును నాతఁడే. విశ్వప్రభుం డగు విరాట్పురుషుం డును నాతండే యని చెప్పఁబడును.— అని ముండకోపనిష ద్వాక్యప్రమాణము.

తత్త్వప్రకాశికయందలి ప్రమాణము.—

శ్లో.—వందే నిత్యం భవభయహరం సర్వలోకాధివాసం
నిత్యాకారం సకలజగతాం సూత్రధర్తార మాద్యం
భావాతీతం త్రిగుణరహితం తత్త్వమస్యాదిగమ్యం
దేవాంగాఖ్యం పరమపురుషం సచ్చిదానందరూపమ్.

టీక.—భవభయహరం = జన్మభయంబును బోఁగొట్టు వాఁడును, సర్వలోకఅధివాసం = సమస్తలోకంబులయందును నంతరాత్మగా విలసిల్లెడువాఁడును, నిత్యఆకారం = జ్ఞానమే స్వరూపం బగువాఁడును, సకలజగతాం సూత్రధర్తారం=సకల జగంబులకు సూత్రధారియు, ఆద్యం=ప్రధానుండును, భావ అతీతం=మనస్సుచేత నిర్దేశింపసాధ్యముగానివాఁడును, త్రిగుణ రహితం= రజస్సత్త్వతమంబులు లేనివాఁడును, తత్త్వమస్యాది గమ్యం= తత్త్వమస్యాది మహావాక్యార్థగోచరుండును, సచ్చి దానందరూపం=శక్తిజ్ఞానానందంబులే స్వరూపంబగువాఁడును

నగు, దేవాంగఆఖ్యం పరమపురుషం= దేవాంగనామకుఁడగు పురుషవరేణ్యుని, నిత్యం = నిరంతరమును, వందే = నమస్కరించుచున్నాను.

తా.—"జననమరణ దుఃఖంబులఁ బోఁగొట్టుచు, సర్వలోకాధివాసుండై విజ్ఞానస్వరూపంబున సకలజగత్సూత్రంబుల ధరించి సనాతనుండై యవాఙ్మానసగోచరుండును త్రిగుణరహితుండును తత్త్వమస్యాది మహావాక్యార్థగోచరుండు నగుచు, సచ్చిదానందరూపంబునఁ దేజరిల్లెడు పరమాత్ముఁడైన యా దేవలబ్రహ్మనుగూర్చి నిరంతరమును నమస్కరించు చున్నాఁడను"—అని తత్త్వప్రకాశిక ప్రారంభమున జైమినీమునీంద్ర భాషితము.

ముండకోపనిషద్వాక్య ప్రమాణము.—

శ్రుతి.—దేవలఏవ స్వమాయయా ఉవచ్ఛిన్నస్సన్ బ్రహ్మాద్యనేకరూపతయా భాసతే. తద్బ్రహ్మణి మాయావశాత్ చాండేశ్వరీనామ చిచ్ఛక్తిర్జాతా. సాతు తత్కులాధిదేవతాభూత్. తస్యపుత్త్రికేతిచ వ్యవహ్రియతే. తేచ తదుపాసకా బభూవుః.

టీక.—దేవలఏవ=దేవలబ్రహ్మయే, స్వమాయయా వచ్ఛిన్నస్సన్ = తనమాయతోడనే కూడినవాఁడగుచు, బ్రహ్మాది అనేకరూపతయా భాసతే = బ్రహ్మమొదలుగాఁగల యనేకరూపంబులతోడఁ బ్రకాశించుచున్నాఁడు. తత్ బ్రహ్మణి = ఆ దేవల బ్రహ్మయందు, మాయావశాత్ = మాయాప్రభావంబు

చేత, చౌడేశ్వరీనాను చిత్ శక్తిఃజాతా=చౌడేశ్వరీయను పేరు గల చిచ్ఛక్తిపుట్టెను. సాతు = మహాశక్తియైన యాచౌడేశ్వరియే, తత్ కులఅధిదేవతా అభూత్ = ఆదేవలబ్రహ్మకులము నకు నధిష్ఠానదేవతయయ్యెను. తస్యపుత్రికా ఇతిచ వ్యవహ్రియతే=ఆదేవాంగబ్రహ్మయొక్క పుత్రికయనియు వ్యవహరింపఁబడుచున్నది. తేచ = ఆ దేవాంగకులసంభవులును, తత్ ఉపాసకాః బభూవుః = ఆ చౌడేశ్వరిని నుపాసించువారుగా నగుచున్నారు.

తా.—దేవలబ్రహ్మయే తనయొక్క మాయాప్రభావంబు చేత బ్రహ్మవిష్ణుమహేశ్వరాదికంబులగు ననేకరూపంబులతోడఁ బ్రకాశించుచున్నాఁడు. ఆ దేవలబ్రహ్మయందు మాయావశంబున చౌడేశ్వరీనామక పరాశక్తి యావిర్భవించెను. అట్టి మహాశక్తియైన యాచౌడేశ్వరీదేవియే యా దేవాంగకులమునకు నధిష్ఠానదేవతయగుచు దేవలబ్రహ్మయొక్క పుత్రిక యనివ్యవహరింపఁబడుచుండును. దేవాంగకులసంభవులందఱును దమకు నిరంతరోపాసితదైవంబుగ నా చౌడేశ్వరీదేవిని నారాధించుచుందురు.—అని ముండకోపనిషద్వాక్య ప్రమాణము.

ఈ విషయమున నిగమరహస్య ప్రమాణము.—

శ్లో.—శ్రుణు నారద వక్ష్యామి జగదేత చ్చరాచరం
ఆసీ త్సంప్లేః పురాసర్వం నిశ్చలం దేవలాత్మకం
స్వయమేవ బహుస్యామి త్యాలోచ్యస్వస్యమాయయా

వ్యాప్య బ్రహ్మాదిరూపేణ జగద్రూపేణ వై తథా
ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచంద్రవత్.

టీక.—నారద = ఓ నారదమహర్షీ ! వక్ష్యామి = చెప్పుచున్నాఁడను, శృణు=వినుము. చరఅచరం = చరించునవియు నిలుకడగా నుండునవియునగు భూతంబులతోఁ గూడినదియగు, ఏతత్ జగత్ సర్వం = ఈ ప్రపంచమంతయు, సృష్టేఃపురా= లోకసృష్టికి పూర్వము, నిశ్చలం=చలనము లేనిదియగు, దేవలాత్మకం = దేవలమయంబుగా, ఆసీత్ =ఉండెను. స్వయమేవ= (దేవలబ్రహ్మ యగు) తానే, బహుస్యామితి= బహురూపంబుల నొందవలయు నని, ఆలోచ్య= యోచన చేసి, స్వస్యమాయయా = తనయొక్క మాయచేతనే, బ్రహ్మాదిరూపేణ = బ్రహ్మాది రూపములతోడను, తథా=అట్లే, జగద్రూపేణవై = ప్రపంచ రూపముతోడను, ఏకధా = ఒకవిధముగను, బహుధాచైవ= బహువిధంబులుగను, వ్యాప్య = వ్యాపించి, జలచంద్రవత్ = జలమునందుఁ జంద్రునివలె, దృశ్యతే=గోచరించుచున్నాఁడు.

తా.— " ఓ నారదమహర్షీ ! జంగమ స్థావరాత్మకమయిన యీ ప్రపంచం బంతయును సృష్టికిఁ బూర్వము చలన రాహిత్యంబై దేవలస్వరూపంబుగ నుండెను. నిత్యుండై యఖండస్వరూపుఁ డయిన యాదేవలుండు, తానే యనేక రూపంబుల నొందవలయు నని సంకల్పించి, తనయొక్క యోగ మాయాప్రభావంబుచేత సృష్టిస్థితిలయాది కారకు లగు బ్రహ్మ విష్ణుమహేశ్వరాది రూపంబులతోడను, ప్రపంచస్వరూపంబు

తోడను, సర్వవిధంబులుగను వ్యాపించి, యొక్కచంద్రుఁడే యనేకంబు లగు జలఘటంబులయందు ననేకు లగు చంద్రుల మాడ్కి ప్రతిఫలించి యాఘటములయందు నిత్యుండు గాని విధంబున, లోకంబునకు నంటినట్లు దోఁచియు నంటకయే యాత్మస్వరూపంబున విలసిల్లుచున్నాఁడు"— అని బ్రహ్మదేవుండు నారదమునీంద్రునకుఁ జెప్పినట్లు నిగమరహస్యమూలమునఁ దెలియుచున్నది.

ఇందునకే వివేకసింధువునందలి ప్రమాణము.—

శ్లో.—దేవలబ్రహ్మ చిచ్ఛక్తి ర్జాతా చూడాంబి కాభిదా
సా దేవాంగబ్రాహ్మణానాం బభూవ కులదేవతా.

టీక.—దేవలబ్రహ్మచిచ్ఛక్తిః = దేవలబ్రహ్మయందలి జ్ఞానశక్తియే, చూడాంబికా అభిదా = చూడాంబిక యనెడు పేరు గలది. సా=ఆమహాశక్తియే, దేవాంగ బ్రాహ్మణానాం=దేవాంగ బ్రాహ్మణులకు, కులదేవతా బభూవ = కులదేవత యయ్యెను.

తా.—దేవలబ్రహ్మయందలి విజ్ఞానశక్తియే చూడాంబికా నామంబున మహాశక్తిగ నవతరించెను. ఆమహాదేవియే దేవాంగ బ్రాహ్మణులకు కులదేవతగా విలసిల్లుచున్న యది.—అని వివేక సింధువు నిరూపించుచున్నది.

ఈ విషయమునసే అగస్త్యసంహితయందలి ప్రమాణము.—

శ్లో.—చూడాంబికే భగవతి ప్రణతార్తి హంత్రి
దేవాంగ బ్రహ్మకులదేవి సుపర్వపూజ్యే

వందామహే జనని దేవల పుత్త్రికే త్వాం
మాం పాహి పాహి జగదీశ్వరి మృత్యువక్త్రాత్.

టీక.—భగవతి=షడ్గుణైశ్వర్య సంపన్నవును, ప్రణత ఆర్తి హంత్రి = స్తోత్రము సేయువారిదుఃఖములను బోఁగొట్టుదానవును, దేవాంగబ్రహ్మకులదేవి= దేవాంగ బ్రాహ్మణవంశంబునకుఁ గులదేవతవును, సుపర్వపూజ్యే= దేవతలచేతఁ బూజింపఁ బడుదానవును, జనని=సర్వలోకైకమాతవును, దేవలపుత్త్రికే=దేవల బ్రహ్మయొక్క కొమారితవును నగు, చూడాంబికే=ఓచౌడేశ్వరీ! త్వాం = నిన్ను గూర్చి, వందామహే=నమస్కరించుచున్నాను. జగత్ ఈశ్వరి=ఓలోకేశ్వరీ! మృత్యువక్త్రాత్ = మృత్యువుయొక్క నోటినుండి, మాం=నన్ను, పాహిపాహి=కాపాడుము.

తా.— "షడ్గుణైశ్వర్య సంపన్న వగుచు భక్తవరేణ్యుల దుఃఖంబులను బోకార్చుచుండెడి యోజననీ! దేవలబ్రహ్మపుత్త్రివై యాదేవాంగ బ్రాహ్మణ వంశంబునకుఁ గులదేవతవుగా నిలిచి దేవపూజిత వగుచు వెలింగెడి యో చూడాంబికా! నీకు నమస్కరించుచున్నాఁడను. ఓ జగదీశ్వరీ! నన్నుమృత్యువు నోటఁబడనీయక రక్షింతువుగాక!" అని యగస్త్యమునీంద్రుండు మహాదేవిని స్తోత్రము గావించినట్లు అగస్త్యసంహిత నిరూపించుచున్నది.

దీనికే కఠోపనిషద్వాక్య ప్రమాణము.—

శ్రుతి.—సర్వే దేవా ఈశ్వర మనమ్య అవస్త్రాస్స లజ్జాః
దీనాః తతస్తాః దృష్ట్వా మహాదేవ స్తదాగమనకారణం

జ్ఞాత్వా స్వస్మిన్ వర్తమానాం చిచ్ఛక్తిం బహిర్ముఖీ కృత్య త్వం శీఘ్రం యజ్ఞోపవీతాదికం నిర్మాయ బ్రహ్మాదీనాం ప్రయచ్ఛే త్యాజ్ఞాపయామాస. సాతు స దేహాసతీ బ్రహ్మాదీనాం యజ్ఞోపవీత వస్త్రాదికం దదౌ. తత్ర తేషాం బ్రాహ్మణక్షత్త్రియవైశ్యానాం చ యజ్ఞోపవీతం పరమం పవిత్ర మితి వేదమంత్రేణ ప్రాయచ్ఛత్. ఇతర జాతీనాం వస్త్రమాత్ర మదదాతి. యజ్ఞాదికర్మ సంపాదనాయ యజ్ఞోపవీత ధారణ మావశ్యకత్వాత్ బ్రహ్మస్వరూపం త్రిగుణాత్మకం యజ్ఞోపవీతం దదౌ బ్రాహ్మణానాం క్షత్త్రియాణాం వైశ్యానాంచ. శూద్రాణాంతు వస్త్రమాత్ర మేవ వేదోక్తకర్మాఽనర్హత్వాత్. తస్మాత్ బ్రాహ్మణ్యాధిప స్సదేవల ఇతి మంతవ్యః. గాయత్రీ చ త్రిగుణాత్మికా సాక్షిస్వరూపిణీతి వ్యవహ్రియతే.

టీక.—సర్వే దేవాః= దేవతలందఱును, అవస్త్రాః = వస్త్రములు లేనివారును, సలజ్జాః=సిగ్గుతోఁగూడినవారును నగుచు, ఈశ్వరం = పరశివునిఁ గూర్చి, అనమన్ = నమస్కరించిరి. తతః= పిమ్మట, మహాదేవః = పరమేశ్వరుండు, తాన్ దీనాన్ = దీను లయిన యా దేవతలను, దృష్ట్వా=చూచి, తత్ ఆగమన కారణం జ్ఞాత్వా=సారివచ్చినకారణంబును నెఱింగి, స్వస్మిన్= తనయందు, వర్తమానాం=వర్తించుచున్నదియగు, చిత్ శక్తిం= చిత్కళను, బహిర్ముఖీకృత్య=వెలువడినదానిఁగాఁ జేసి, త్వం= నీవు, శీఘ్రం=శీఘ్రముగా, యజ్ఞోపవీతాదికం= యజ్ఞోపవీతా

దులను, నిర్మాయ= నిర్మించి, బ్రహ్మాదీనాం ప్రయచ్ఛ= బ్రహ్మాదులకు నొసంగుము. ఇతిఆజ్ఞాపయామాస=అనియాజ్ఞాపించెను. సాతు=ఆ పరాశక్తియు, స దేహాసతీ = శరీరముతోఁ గూడినది యగుచు, బ్రహ్మాదీనాం = బ్రహ్మ మొదలగు వారలకు, యజ్ఞోపవీతవస్త్రాదికం దదౌ = యజ్ఞోపవీతంబులను వస్త్రాదులను నొసంగెను. తత్ర= యజ్ఞోపవీత ప్రదానము చేసెడువిషయంబున, తేషాం = ఆ బ్రహ్మాదులకును, బ్రాహ్మణక్షత్రియ వైశ్యానాంచ=బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకును,యజ్ఞోపవీతం పరమం పవిత్రం ఇతివేదమంత్రేణ = "యజ్ఞోపవీతం పరమం పవిత్ర" మని చెప్పఁబడిన వేదమంత్రముచేత, ప్రాయచ్ఛత్ = ఒసంగెను. ఇతరజాతీనాం = ఇతరకులములవారికి, వస్త్రమాత్రం = వస్త్రములను మాత్రమే, అదదాత్ = ఇచ్చెను. యజ్ఞాదికర్మసంపాదనాయ =,యజ్ఞములు మొదలగు వైదికకర్మలకు నధికారము గలుగుటకొఱకు, యజ్ఞోపవీతధారణం ఆవశ్యకత్వాత్ = యజ్ఞోపవీతముధరించుటయే ప్రధాన మగుటచేత, బ్రహ్మస్వరూపం=పరమాత్మస్వరూపముగలదియు, త్రిగుణాత్మకం=త్రిగుణస్వరూపంబు గలదియునగు, యజ్ఞోపవీతం= బ్రహ్మసూత్రంబును, బ్రాహ్మణానాం క్షత్రియాణాం వైశ్యానాంచ = బ్రాహ్మణులకునుక్షత్రియులకునువైశ్యులకును, దదౌ=ఇచ్చెను. శూద్రాణాంతు=శూద్రులకన్ననో, వేదోక్తకర్మ అనర్హత్వాత్ = వేదప్రతిపాదకం బగు బ్రాహ్మ్యకర్మ అర్హము కాకుండుటచేత, వస్త్రమాత్రం ఏవదదౌ=వస్త్రములను మాత్రమే యొసంగెను. తస్మాత్ = ఆకారణముచేత, సః దేవలః = ఆదేవల బ్రహ్మయే.

బ్రాహ్మణ్య అధిపః= బ్రాహ్మణ్యమునకు నధికారము గలవాఁడు, ఇతి మంతవ్యః = అని యెఱుఁగఁ దగినవాఁడు. గాయత్రీచ= గాయత్రియు, త్రిగుణఆత్మికా= త్రిగుణములు గలదియనియు, సాక్షి స్వరూపిణీ = సర్వలోకంబులకు సాక్షిభూతం బగునది యనియు, వ్యవహ్రియతే = వ్యవహరింపఁబడుచున్నది.

( యజ్ఞోపవీతధారణ మంత్రమ్.—

యజ్ఞోపవీతం పరమంపవిత్రం,
ప్రజాపతే ర్యత్సహాజం పురస్తాత్,
ఆయుష్య మగ్ర్య ఉప్రతిమంచ శుభ్రం,
యజ్ఞోపవీతం బల మస్తు తేజః.

టీక.—పరమం = శ్రేష్ఠమయినదియు, పవిత్రం = పరిశుద్ధ మయినదియు, పురస్తాత్ = పూర్వకాలమునందు, ప్రజాపతేః= పరబ్రహ్మమునకు, సహాజం=కూడఁబుట్టినదియు నగుచు, యత్ యజ్ఞోపవీతం (అస్తిస్మ)=ఏయజ్ఞోపవీతముగలదో, ఆయుష్యం= దీర్ఘాయువు నొసంగునదియు, అగ్ర్యం= ప్రధాన మగునదియు, అప్రతిమంచ = సాటిలేనిదియు, శుభ్రం = ధావళ్యమైనదియు నగు, (తత్) యజ్ఞోపవీతం = ఆయజ్ఞోపవీతము, బలం = శక్తి నొసంగునదిగను, తేజః = తేజంబు నొసంగునదిగను, అస్తు = అగుఁగాక !

తా.—యజ్ఞోపవీతము, ప్రథమమున సాక్షాత్ పరమాత్మ తోడనే పుట్టి సర్వోత్కృష్టం బై సర్వపావనం బై విలసిల్లు చుండును. సర్వప్రాధాన్యము గలిగి నిరుపమాన మహి

మాధ్యత వహించి ధావళ్యకాంతులచేఁ దేజరిల్లు నట్టిది యైన యా యజ్ఞోపవీతము తేజోశక్తుల నొసంగుఁ గాత !)

తా.— పూర్వము దేవతలందఱును వస్త్రహీనులగుచు లజ్జావనతవదనంబులతోడఁ బరమేశ్వరునిఁ బ్రార్థించిరి. దీన మానసులయిన యా దేవతలయొక్క యాగమనకారణం బెఱింగి పరమాత్ముండు, తనయందు జ్యోతిర్మయంబుగ వెలుంగుచుం డెడు చిచ్ఛక్తిని, బహిర్ముఖం బగునట్లు చేసి "యో! మహాశక్తీ! నీవు శీఘ్రింబుగ యజ్ఞోపవీతాదుల నిర్మించి బ్రహ్మాదులకు నొసంగుము."—అని యాజ్ఞాపించెను. తత్క్షణమే యా పరాశక్తి దేవలనామంబునఁ బురుషరూపంబుఁ దాల్చి బ్రహ్మాదిదేవతలకును బ్రాహ్మణాదు లగు మానవులకును వస్త్రయజ్ఞోపవీతంబుల నొసంగెను. యజ్ఞోపవీతప్రదానవిషయంబున బ్రహ్మాది దేవతలకును బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్యులకును మాత్రము "యజ్ఞోపవీతం పరమం పవిత్రం। ప్రజాపతే ర్యత్సహజం పురస్తాత్ । ఆయుష్యమగ్ర్యం ప్రతిమంచ శుభ్రం। యజ్ఞోపవీతం బలమస్తు తేజః"—అనెడి వేదమంత్రము పురస్సరం బగునట్లుగ నొసంగెను. ఇతరులగు శూద్రాదులకు వస్త్రములను మాత్రమే యొసంగెను. యజ్ఞములు మొదలయిన వైదికకర్మలను నాచరించుటకు నధికారము గలుగుటకై యజ్ఞోపవీతధారణంబు ఆవశ్యక మగుటచేత, బ్రహ్మస్వరూపంబును త్రిగుణాత్మకంబును నగు బ్రహ్మసూత్రమును మానవలోకంబున బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్యులకు మాత్రమే యొసంగెను. వేదప్రతిపాదకం బయిన

బ్రాహ్మణ్యాకర్మ, శూద్రులకు సర్వాంబు కామింజేసి వారలకు వస్త్రంబులను మాత్రమే యొసంగెను. అట్లు దేవతలు మొదలగువారికి బ్రాహ్మణ్యసంపాదకం బగు బ్రహ్మసూత్రంబులను సమంత్రకంబుగ నొసంగుటఁబట్టి యా దేవలబ్రహ్మయే బ్రాహ్మణ్యాధికారము గలవాఁడు. అట్లు బ్రహ్మాదులకు ననుగ్రహింపఁబడి గాయత్రీనామకం బయిన యా బ్రహ్మోపవీతంబు త్రిగుణాత్మకమై సర్వలోకసాక్షిభూతం బగుచు విలసిల్లుచుండును.—అని కఠోపనిషత్తువలన నిరూపణ మగుచున్నది.

ఈ విషయంబున సిద్ధాంతచంద్రికయందలి ప్రమాణము.—

శ్లో.—ఈశ్వరీ యాతు యా శక్తి ర్జగన్నిర్మాణకారిణీ
సా వై దేవాంగరూపేణ సూత్రవస్త్రాదికం ముదా
సుర కిన్నర గంధర్వ యక్షేభ్యః ప్రదదౌ తదా.

టీక.—ఈశ్వరీయాతు = పరమేశ్వరసంబంధినియై, జగన్నిర్మాణకారిణీ = సర్వలోకసృష్టికి నాధారభూత యగు, యా శక్తిః=ఏ చిచ్ఛక్తి గలదో, సావై= అదియే, తదా = అపుడు, దేవాంగరూపేణ = దేవాంగరూపముతో, సురకిన్నరగంధర్వయక్షేభ్యః = దేవకిన్నరగంధర్వయక్షులకు, ముదా = సంతోషముగలదియగుచు, సూత్రవస్త్రాదికం=గాయత్రీవస్త్రాదులను, ప్రదదౌ=ఇచ్చెను.

తా.—పరాత్పరునియందు సర్వలోకనిర్మాణకారణంబుగ వెలుంగుచుండెడు చిజ్జ్యోతియే దేవలబ్రహ్మరూపంబుఁ దాల్చి యా పరమేశ్వరుని యభిప్రాయానుగుణంబుగ సురసిద్ధసాధ్య

గరుడ గంధర్వాదులకుఁ బ్రేమతో వస్త్రసూత్రాదుల నొసం
గెను.—అని సిద్ధాంతచంద్రిక దెలుపుచున్నది.

ధర్మనిధి యనెడు ధర్మశాస్త్రమునందలి ప్రమాణము.—

శ్లో.—దేవాంగే నోపదిష్టేన హ్యానేన ద్విజపుంగవ
యజ్ఞోపవీతం పరమం ఇతి మంత్రేణ సర్వదా
ఉపవీతం ద్విజై ర్ధార్య మన్యథా పతితో భవేత్.

టీక.—ద్విజపుంగవ=ఓ బ్రాహ్మణోత్తమా! దేవాంగేన=
దేవాంగునిచేత, ఉపదిష్టేన = ఉపదేశింపఁబడిన, యజ్ఞోపవీతం
పరమం ఇతి="యజ్ఞోపవీతం పరమం పవిత్రం" అనెడు, అనేన
మంత్రేణ=ఈ మంత్రముచేత, సర్వదా=ఎల్లప్పుడును, ద్విజైః=
ద్విజులచేత, ఉపవీతంధార్యం=యజ్ఞోపవీతము ధరింపఁబడునది.
అన్యథా=ఇతరవిధంబుచేత (సమంత్రకంబుగ గాయత్రిని ధరిం
పమిఁ జేసి), పతితః భవేత్=అపరిశుద్ధుం డగుచున్నాఁడు.

తా.—దేవలబ్రహ్మచే నుపదేశింపఁబడిన "యజ్ఞోపవీతం
పరమం పవిత్రం"—అనెడు మంత్రముచేతనే నిరంతరమును
ద్విజులు యజ్ఞోపవీతంబును ధరింపవలయును. అట్లు మంత్ర
పూర్వకంబు గాక గాయత్రిని ధరించువాఁడు మహాపాతకుఁ
డగును.—అని ధర్మనిధివలనఁ దెలియవచ్చుచున్నది.

ఈ విషయమున ఋగ్వేదభాష్యమందలి ప్రమాణము—.

శ్లో.—గుణత్రయాత్మకం యజ్ఞసూత్రం బ్రాహ్మణ్యహేతుకం
దేవలేన పురా దత్తం దేవతాభ్య శ్శివాజ్ఞయా.

టీక.—గుణత్రయఆత్మకం=త్రిగుణస్వరూపం బగునదియు, బ్రాహ్మణ్యహేతుకం=బ్రాహ్మణ్యమునకుఁ గారణంబగునదియు నగు, యజ్ఞసూత్రం=యజ్ఞోపవీతము, పురా=మునుపు, శివాజ్ఞయా=పరమేశ్వరుని యాజ్ఞచేత, దేవలేన = దేవలునిచేత, దేవతాభ్యః=దేవతలకొఱకు, దత్తం=ఈయఁబడినది.

తా.—త్రిగుణాత్మకం బగు బ్రాహ్మణ్యమునకుఁ గారణభూతం బయిన యజ్ఞోపవీతము పూర్వము పరమేశ్వరుని యభిప్రాయానుసారంబుగ దేవలబ్రహ్మచేత దేవతలకు నొసంగఁబడెను.—అని ఋగ్వేదభాష్యము నిరూపించుచున్నది.

మూల.—ఈశ్వర స్స్వస్య పంచమముఖే ఉత్పన్నస్య విశ్వకర్మణః జగన్మానజ్ఞానార్థం సూత్రాభావాత్ సమంత్రకం సూత్రాదికం దేవాంగేన దాపితవాన్. సతు తేన జగత్పరిమాణ మమన్యత.

టీక.—ఈశ్వరః=పరమేశ్వరుండు, స్వస్యపంచమముఖే=తనయొక్క నైదవ ముఖంబు వలన, ఉత్పన్నస్య=పుట్టినవాఁడగు, విశ్వకర్మణః = విశ్వకర్మకు, జగత్ మానజ్ఞానార్థం= ప్రపంచముయొక్క పరిమాణము తెలియుటకొఱకు, సూత్ర అభావాత్ = యజ్ఞసూత్రము లేకుండుటచేత, దేవాంగేన = దేవాంగునిచేత, సూత్రాదికం = సూత్రాదికమును, సమంత్రకం = మంత్రయుక్తంబుగ, దాపితవాన్ = ఇప్పించెను. సతు=ఆ విశ్వకర్మయు, తేన = అట్టి బ్రహ్మసూత్రధారణము

వలన, జగత్పరిమాణం=ప్రపంచముయొక్క పరిమితిని, అమ న్యత=ఎఱింగెను.

తా.—పూర్వము, పరమేశ్వరుని పంచమముఖంబువలన నుత్పన్నుం డయిన విశ్వకర్మ, తనకు బ్రాహ్మణ్యము లేకుండుట చేతఁ బ్రపంచముయొక్క పరిమాణంబు నెఱుంగఁజాలక శంకరునిఁ బ్రార్థించెను. అప్పుడు పరశివుండు దేవలబ్రహ్మచేత నా విశ్వకర్మకు సమంత్రకంబుగ బ్రహ్మోపవీతాదికంబుల నిప్పించెను. అపుడు విశ్వకర్మయు యజ్ఞోపవీతధారణ ప్రభావంబు చేత బ్రాహ్మణ్యయుక్తుం డగుచుఁ బ్రపంచ పరిమాణంబు నెఱుంగ సామర్థ్యము గలవాఁ డయ్యెను.

ఈ విషయంబున శ్రీశైలమాహాత్మ్యమున ఉత్పత్తికాండప్రమాణము.—

శ్లో.—దేవదేవ భవద్వక్త్రాత్ సంభూతోప్యహ మీశ్వర
సూత్రాభావా జ్జగన్మాతు మశక్తో ఽహం కథంచన
తస్మాత్సూత్రం త్వయా దేవ దాతవ్యం మానహేతుకం
ఇతి సంప్రార్థితో పశ్చాత్ దేవాంగేన మహాత్మనా
సూత్రం దాపితవాన్ తస్మై మహేశో విశ్వకర్మణే.

టీక.—దేవదేవ=దేవేశ్వరుండవయిన, ఈశ్వర=ఓ ప్రభూ! అహం = నేను, భవత్ వక్త్రాత్ =మీ ముఖంబువలన, సంభూతోపి = పుట్టినవాఁడ నయ్యును, సూత్ర అభావాత్ =బ్రహ్మోపవీతము లేకుండుటవలన, జగన్మాతుం = లోకపరిమాణం బెఱుంగుటకు, కథంచన = ఏవిధముచేతను, అహం అశక్తః = నేను శక్తి లేనివాఁడను, తస్మాత్ = ఆ కారణముచేత, దేవ =

ఈశ్వరా! మానహేతుకం=పరిమాణం బెఱుంగుటకు నాధార భూతం బగునట్టి, సూత్రం = యజ్ఞోపవీతము, త్వయా=నీచేత, దాతవ్యం = ఈయఁదగినది. ఇతి సంప్రార్థితః=అని ప్రార్థింపఁ బడినవాఁ డగుచు, పశ్చాత్ = పిమ్మట, మహేశః = పరమేశ్వరుండు, మహాత్మనా దేవాంగేన= మహానుభావుం డగు దేవాంగునిచేత, తస్మై విశ్వకర్మణే = ఆ విశ్వకర్మకొఱకు, సూత్రం దాపితవాన్ = యజ్ఞసూత్రంబును నిప్పించినవాఁ డయ్యెను.

తా.—"ఓ దేవేశ్వరా! ఓ ప్రభూ! నేను మీ ముఖంబున నుండియే పుట్టినవాఁడ నయ్యును బ్రాహ్మణ్యసంపాదకం బగు యజ్ఞసూత్రము లేకుండుటచేత లోకపరిమాణం బెఱుంగుటకు నెంతమాత్రమును శక్తి లేక యున్నాఁడను. కాఁబట్టి యో పరమేశ్వరా! అట్టి సామర్థ్యము వహించుటకు నాధార భూతం బయిన యజ్ఞోపవీతంబును నాకు ననుగ్రహింపుము."— అని ప్రార్థించిన విశ్వకర్మకు మహేశ్వరుండు, మహాత్ముఁ డగు దేవలబ్రహ్మచేత బ్రహ్మసూత్రంబు నిప్పించెను.— అని శ్రీశైల మాహాత్మ్యము నందలి యుత్పత్తికాండమునఁ జెప్పఁబడి యున్నది.

ఈ విషయంబుననే అధర్వణవేదమందలి ప్రమాణము.—

జట.—దదా దేవాంగ స్సూత్రం వై విశ్వకర్మణ ఇత్యాహ ప్రజాపతిః.

టీక.— దేవాంగః = దేవాంగుఁడు, విశ్వకర్మణః = విశ్వకర్మకు, సూత్రం = యజ్ఞోపవీతంబును, దదౌ=ఇచ్చెను, ఇతి= అని, ప్రజాపతిః ఆహ=బ్రహ్మదేవుండు చెప్పెను.

తా.— "దేవలబ్రహ్మయే విశ్వకర్మకు బ్రహ్మసూత్రంబు నొసంగెను."— అని బ్రహ్మదేవుండు చెప్పినట్లుగ నధర్వణ వేదప్రమాణము.

మూల.—తతో వైశ్వకర్మణోపి దేవాంగప్రసాదలబ్ధ యజ్ఞ సూత్రా ణ్యమంత్రకేణ ధారయామాసుః, తేన సూత్రాణి దగ్ధాని, తే ప్యతిభయేన శివం సంప్రార్థ్య సూత్రాణి యాచయామాసుః,తతశ్శివాజ్ఞయా ప్రసన్నో దేవాంగో దగ్ధయజ్ఞోపవీతాన్ మన్వాదీన్ దృష్ట్వాఽతి కరుణయా గాయత్రీ మంత్రోపదేశపూర్వకం యజ్ఞోప వీతం దత్తవాన్, అత ఏవ యజ్ఞసూత్ర మమంత్రకేణ నధార్య మితి మంతవ్యమ్.

టీక.—తతః=పిమ్మట, వైశ్వకర్మణోపి = విశ్వకర్మయొక్క కుమారులో, దేవాంగప్రసాదలబ్ధయజ్ఞసూత్రాణి=దేవాంగుని యనుగ్రహముచేతఁ బొందఁబడిన యజ్ఞసూత్రంబులను, అమంత్రకేణ = మంత్రములేమిచేత (మంత్రములేకయే), ధారయామాసుః = ధరించిరి. తేన = అమంత్రకముగ ధరించిన యా కారణముచేత, సూత్రాణి=యజ్ఞోపవీతంబులు, దగ్ధాని= కాలి పోయినవి. తేపి= వారును, అతిభయేన=మిక్కిలియు భయముచేత, శివం = పరమశివుని, సంప్రార్థ్య = భక్తితోఁ బ్రార్థించి,

సూత్రాణి = బ్రహ్మసూత్రములకొఱకు, యాచయామాసుః =
యాచించినవారైరి. తతః=పిమ్మట, శివఆజ్ఞయా= పరమేశ్వరుని
యాజ్ఞచేత, ప్రసన్నః=ప్రత్యక్షుండయిన, దేవాంగః=దేవలుండు,
దగ్ధయజ్ఞోపవీతాన్ = కాలిన యుపవీతంబులు గలవారగు,
మన్వాదీన్= మనువుమొదలగువారిని, అతికరుణయాదృష్ట్వా=
మిక్కిలియుఁ గారుణ్యముతోడఁ గాంచి, గాయత్రీమంత్రఉప
దేశపూర్వకం = గాయత్రీమంత్రసంబంధ మగు నుపదేశము
మొదటఁ గలదిగా, యజ్ఞోపవీతం = బ్రహ్మసూత్రంబులను,
దత్తవాన్ = ఒసంగెను. అతఏవ=ఆకారణముచేతనే, యజ్ఞ
సూత్రం=యజ్ఞోపవీతము, అమంత్రకేణ= మంత్రము లేకయే,
నధార్యం=ధరింపఁదగనిది,ఇతిమంతవ్యం=అనిమెఱుంగఁదగినది.

తా.—విశ్వకర్మ, యజ్ఞోపవీత ప్రభావంబుచేత సర్వలోక
ప్రమాణంబు నెఱుంగఁజాలిన శక్తిని వహించిన పిమ్మట, ఆతని
కుమారులగు మనువు మొదలగువారలు, తమకు దేవలబ్రహ్మ
యొక్క యనుగ్రహముచేత లభించిన యజ్ఞోపవీతంబులను
మంత్రములు లేకయే ధరించిరి. అట్లు మంత్రరహితంబుగ ధరిం
చుటంబట్టి యా యుపవీతంబు లన్నియు దగ్ధంబులయ్యెను. అం
తట వార లందఱును నత్యంతభయాక్రాంతచిత్తులగుచు యజ్ఞో
పవీతంబులఁ బొందుటకై పరమభక్తి తాత్పర్యములతోడ
ధ్యానపూర్వకంబుగఁ బరమేశ్వరునిఁ బ్రార్థించిరి. అంతట,
మహాదేవుని కారుణ్యరూపకం బయిన యభిప్రాయంబు ననుస
రించి దేవలబ్రహ్మ ప్రసన్నుండై, దగ్ధయజ్ఞోపవీతు లయిన యా

మనువు మొదలగు వారినిఁ గారుణ్యముతోడఁ గాంచి, గాయత్రీ మంత్రోపదేశ పూర్వకంబుగ వారలకు బ్రహ్మసూత్రంబుల నొసంగెను. కాబట్టియే యజ్ఞోపవీతంబును మంత్రరహితంబుగ ధరింపఁగూడ దని యెఱుంగవలయును.

ఈ విషయంబున స్కాందమునందలి ప్రమాణము —

శ్లో.—ఉపవీతం యదా ధత్సే మంత్ర ముచ్చార్య ధారయ
అన్యథా తేపి రాజేంద్ర గతి స్స్యా ద్వైశ్వకర్మణామ్.

టీక.—రాజేంద్ర=ఓ రాజశ్రేష్ఠుఁడా! ఉపవీతం=యజ్ఞోపవీతమును, యదా = ఎప్పుడు, ధత్సే = ధరింతువో, (తదా = అపుడు), మంత్రంఉచ్చార్య=మంత్రము నుచ్చరించి, ధారయ= ధరింపుము. అన్యథా= అట్లు చేయనియెడల, తేపి= నీకుఁగూడ, వైశ్వకర్మణాంగతిః = విశ్వకర్మయొక్క కుమారులకుఁ గలిగిన యవస్థయే, స్యాత్ =అగుచుండును.

తా.— "ఓ రాజేంద్రా! నీవు యజ్ఞోపవీతంబును ధరించున పు డంతయు మంత్రోచ్చారణపూర్వకంబుగనే ధరించుచుండుము. అట్లు చేయనియెడల నీకును విశ్వకర్మయొక్క పుత్త్రులకుఁ గలిగిన యవస్థయే గలుగు నని భావింపుము"— అని గర్గమునీంద్రుండు సింధులరాజునకు హితోపదేశము చేసినట్లు స్కాందమువలనఁ దెలియుచున్నది.

మూల.— స దేవల బ్రహ్మచారీ నిర్గుణః నిష్కళంకః నిత్యః
నిర్వికల్పః సచ్చిదానందస్వరూపః మాయాశూన్యః
అకర్తా అభోక్తా సచ మాయయా ఽవచ్ఛిన్నత్వాత్సగుణః

సవికల్పః సూత్రాత్మా త్రిమూర్తిస్వరూపః దేహీ చా
సీత్. ఓమిత్యేకాక్షరంబ్రహ్మ, ప్రజ్ఞానం బ్రహ్మ, అహం
బ్రహ్మాస్మి, తత్త్వమసి, అయమాత్మా బ్రహ్మేత్యాదిమహా
వాక్యలక్ష్యార్థగోచరో దేవల ఏవ.

టీక.—సః దేవలః = ఆ దేవలుండే, బ్రహ్మచారీ = ఊర్ధ్వరే
తస్కుండగుచు బ్రహ్మచర్యంబు నడపువాఁడు, నిర్గుణః = గుణ
రహితుండు, నిష్కళంకః=కళంకము లేనివాఁడు, నిత్యః=శాశ్వ
తుండు, నిర్వికల్పః = మార్పు లేనివాఁడు, సచ్చిదానంద
స్వరూపః = శక్తిజ్ఞానానందములే స్వరూపముగఁ గలవాఁడు,
మాయాశూన్యః= మాయ లేనివాఁడు, అకర్తా=దేనిని నంటక
యుండువాఁడు, అభోక్తా= దేనిచేతను నంటఁబడకుండువాఁడు,
సచ=అట్టివాఁడుగ నుండియు, మాయయా అవచ్ఛిన్నత్వాత్ =
మాయతోఁగూడినవాఁ డగుటచేత, సగుణః = గుణములతోఁ
గూడినవాఁడు, సవికల్పః = నామరూపాదులచేత మార్పులు
గలవాఁడు, సూత్రాత్మా = సూత్రస్వరూపుఁడు, త్రిమూర్తి
స్వరూపః = బ్రహ్మవిష్ణుమహేశ్వరరూపంబులు గలవాఁడు,
దేహీచ ఆసీత్ =జీవుండును నయ్యెను. దేవలఃఏవ= దేవలుండే,
ఓమిత్యేకాక్షరంబ్రహ్మ = (ఓం అనెడియొక్కయక్షరమే పర
బ్రహ్మము), ప్రజ్ఞానంబ్రహ్మ = (ప్రకృష్టం బగుజ్ఞానమే బ్రహ్మ
మగును), అహంబ్రహ్మాస్మి = (నేనే బ్రహ్మంబు నగుచున్నాను),
తత్త్వమసి= (ఆ బ్రహ్మమే నీ వగుచున్నాఁడవు), అయమాత్మా
బ్రహ్మ = (ఈ యాత్మయే బ్రహ్మము), ఇత్యాది మహావాక్య

లక్ష్యార్థగోచరః=ఇది మొదలుగాఁగల మహావాక్యములయొక్క లక్షణములచేత నెఱుంగఁదగినయర్థమునకు విషయమగువాఁడు.

తా.—ఆ దేవల బ్రహ్మయే యూర్ధ్వరేతస్కుం డగుచు బ్రహ్మచర్యంబుచేత విలసిల్లెడువాఁడు. నిర్గుణుండును నిష్కళంకుఁడును శాశ్వతుఁడును నిర్వికల్పుఁడును మాయారహితుఁడు నగుచు సచ్చిదానందమయుండై ప్రకృతిని నంటక మాయాతీతుండై వెలుంగును. అట్టి తేజోమయుండయ్యును నిజమాయచేత నామరూపాదిక వికల్పంబులవహించి గుణసహితుఁడగుచుఁ బ్రపంచనాటక సూత్రధారియై బ్రహ్మవిష్ణుమహేశ్వర రూపంబుల నుత్పత్తిస్థితిలయంబులఁ గావించుచు నాత్మరూపంబున సర్వాంతర్వర్తియగుచుండును. "ఓం ఇత్యేకాక్షరంబ్రహ్మ, ప్రజ్ఞానంబ్రహ్మ, అహంబ్రహ్మాస్మి, తత్త్వమసి, అయమాత్మాబ్రహ్మ" ఇత్యాదిమహావాక్యలక్ష్యార్థములకు విషయభూతుం డగువాఁడును దేవలబ్రహ్మయే యని యెఱుఁగఁదగును.

ఈ విషయమున ఋగ్వేదమునందలి ప్రమాణము.—

జట.—ఓం తదాత్మా ఓం తజ్జగత్ ఓమితి సర్వం తదోంకార రూపదేవల త్వం యజ్ఞః త్వం వషట్కారః త్వం ఇంద్రః త్వం బ్రహ్మా త్వం విష్ణుః త్వం రుద్రః త్వం వాయుః త్వమగ్నిః త్వం చంద్రమాః ఇతి ఋగ్వేదప్రదర్శనాత్.

టీక.—ఓం తత్ ఆత్మా = ఓంకారమే యా పరమాత్ముఁడు. ఓం తత్ జగత్ = ఓంకారమే యా జగత్తు. ఓం ఇతిసర్వం= ఓంకారమనునదియే సమస్తంబును. తత్ ఓంకారరూపదేవల=

అట్టి ప్రణవస్వరూపుఁడ వయిన యో దేవలా ! త్వం యజ్ఞః=
నీవు యజ్ఞస్వరూపుఁడవు. త్వం వషట్కారః = నీవే యాహుతి
స్వరూపుఁడవు. త్వం ఇంద్రః=నీవే ఇంద్రుండవు. త్వం బ్రహ్మా=
నీవే బ్రహ్మదేవుఁడవు. త్వం విష్ణుః=నీవే విష్ణుండవు. త్వం రుద్రః=
నీవే రుద్రుండవు. త్వం వాయుః = నీవే వాయుదేవుఁడవు. త్వం
అగ్నిః=నీవే యగ్నివి. త్వం చంద్రమాః = నీవే చంద్రుండవు.
ఇతి ఋగ్వేదప్రదర్శనాత్ = అని ఋగ్వేద ప్రమాణంబువలనఁ
దెలియుచున్నది.

తా.—పరమాత్ముఁడు ప్రణవాకారుండు. జగంబులు సమ
స్తంబులును బ్రణవస్వరూపమే. అట్టి ఓంకారమయుండ వయిన
యో దేవలబ్రహ్మమా ! నీవే యజ్ఞంబులును యజ్ఞాహుతి
మయం బగు వషట్కారంబును. త్రిగుణాత్మకులగు బ్రహ్మవిష్ణు
మహేశ్వరులును నీవే. నీవే వాయురగ్నులును. చంద్రేం
ద్రాదులును నీవే. సర్వంబును నీ స్వరూపమే యగుచుండును.
అని ఋగ్వేదము నిరూపించుచున్నది.

సిద్ధాంత తత్త్వప్రకాశికయందలి ప్రమాణము.—

శ్లో.—దేవలోయం పరబ్రహ్మ నిత్యశుద్ధోతి నిర్మలః
సచ్చిదానందరూపశ్చ నిర్వికల్పో నిరామయః
కర్తృత్వాదివినిర్ముక్త స్సర్వసాక్షీ నిరాకులః
స ఏవ మాయయా యుక్త స్సగుణ స్సవికల్పకః
సత్త్వాదిగుణసంయుక్తో బ్రహ్మో ద్యాకార మాయయా
అయం హి తత్త్వమస్యాది వాక్యలక్ష్యార్థగోచరః
తద్రూపం హి జగత్సర్వం తదన్యం నాస్తి కించన.

టీక.— అయం దేవలః = ఈదేవలుండే, పరబ్రహ్మ = పరమాత్ముఁడు, నిత్యః= శాశ్వతుఁడు, శుద్ధః = పరిశుద్ధుఁడు, అతినిర్మలః= మిక్కిలియు నిర్మలుఁడు, సచ్చిదానందరూపః = శక్తిజ్ఞానానందమయుండు, నిర్వికల్పః = వికల్పరహితుఁడు, నిరామయః=మేరలేనివాఁడు, కర్తృత్వాదివినిర్ముక్తః = కార్యకారణాదులచేత విడువఁబడినవాఁడు, సర్వసాక్షీ=లోకములకుసాక్షిభూతుఁడు, నిరాకులశ్చ=భిన్నము గానివాఁడును. స ఏవ=అట్టివాఁడే, మాయయాయుక్తః = మాయతోఁ గూడినవాఁడై, సగుణః=గుణసహితుండును, సవికల్పకః= వికల్పయుక్తుండును, సత్త్వాదిగుణసంయుక్తః = సత్త్వాదిగుణములతోఁ గూడినవాఁడును నగుచు, బ్రహ్మాదిఆకారం=బ్రహ్మాదులరూపంబులను, ఆయయౌ = పొందెను. అయంహి = ఈతఁడే గదా, తత్త్వమస్యాదివాక్యలక్ష్యార్థగోచరః = తత్త్వమస్యాది మహావాక్యములయొక్కలక్ష్యార్థమునకు విషయభూతుండు, జగత్ సర్వం= ప్రపంచంబంతయు, తత్ రూపం హి = ఆతనిరూపమే గదా! తత్ అన్యం = వానికి నితరం బగునది, కించన = ఎంతమాత్రమును, నాస్తి = కలుగదు.

తా.—ఈ దేవలబ్రహ్మయే పరమాత్ముఁడు. నిత్యుండును శుద్ధుండును నిర్మలుండును నిరామయుండును నగుచు సచ్చిదానందరూపంబున నిర్వికల్పుండై వెలుంగుచుండును. అతండు కర్తృత్వ భోక్తృత్వాదులఁ దగులువడక నిరాకులుండై ప్రకృతినంటక సర్వలోకసాక్షిభూతుం డగును. అట్లు నిర్గుణ

నిర్వికల్పాదులు గల యా దేవలబ్రహ్మయే జగంబుల యుత్పత్తి స్థితి వినాశంబులకొఱకు నిజమాయచేత సత్త్వరజస్తమోగుణంబులఁ గూడి నామరూపాదికంబు లగు వికల్పంబులతోడ బ్రహ్మ విష్ణు మహేశ్వరాది రూపంబుల వహించెను. ఆతఁడే తత్త్వమస్యాది మహావాక్యములయొక్క లక్ష్యార్థములకు విషయభూతుం డగువాఁడు. సమస్తజగంబులును దేవలమయమే యగుచుండును. దేవలేతరం బగునది లోకంబున మఱి యేదియును లేదు.—అని సిద్ధాంత తత్త్వప్రకాశిక తెలుపుచున్నది.

ఇందునకు అథర్వణవేదమునందలి ప్రమాణము.—

శ్రుతి.—సర్వం దేవల మామనంతి బ్రహ్మవాదినః.

టీక.— బ్రహ్మవాదినః = బ్రహ్మవాదులు, సర్వం=సమస్త ప్రపంచంబులును, దేవలం = దేవలమయ మని, ఆమనంతి= చెప్పుచున్నారు.

తా.— "సమస్త ప్రపంచంబులును దేవలమయ మనియే బ్రహ్మవేత్తలు చెప్పుచున్నారు"—అని అథర్వణవేద ప్రమాణము.

మూల.—పునః కల్పాదౌ వస్త్ర సూత్రా భావాత్ సర్వే దేవా శ్శివం నత్వా ప్రార్థయామాసుః. శివో దైవతైః ప్రార్థితః స్వయంభువం దధ్యౌ. సోపి శివసహస్రారకమలాన్నిర్గత్య స శరీరస్సన్ దేవలనామ్నా బ్రహ్మ విష్ణు రుద్రాది దేవానాం సూత్రవస్త్రాదికం దత్తవాన్. తతః కాండర్షి రాగత్య దేవాంగమనుం దృష్ట్వా మమ వస్త్ర

సూత్రాదికం దాతవ్య మిత్యపృచ్ఛత్. దేవాంగ బ్రహ్మ ణా నేదాసీం వర్తతే శ్వః దీయతే ఇత్యుక్తం. తతః కాం దర్షిః కుపితస్సన్ సర్వేషాం దత్వా మమ నాస్తీత్యు క్తం అతస్త్వం నరో భవేతి శాపం దత్తవాన్. తత్రో మనుబ్రహ్మా త్వచ్ఛాపం జగదుపకారాయ భవతి. లోకే కార్యకారణయో రభేదస్య విద్యమానత్వాత్, నరా ణాం జగదంతః పాతిత్వేన సర్వస్యాపి జగతః బ్రహ్మస్వ రూపత్వేనచ. నరస్య మమచ భేదో నాస్తి. అతః త్వ ద్దత్తశాపేన కింప్రయోజన మిత్యుక్త్వా శివసహస్రార కమలం ప్రావిశత్.

టీక.—పునః=మఱల, కల్పఆదౌ=కల్పముయొక్క ప్రారం భమునందు, వస్త్రసూత్ర అభావాత్ =వస్త్రములును యజ్ఞో పవీతంబులును లేకుండుటచేత, సర్వేదేవాః=దేవతలందఱును, శివంనత్వా=పరమేశ్వరుని స్తోత్రముచేసి, ప్రార్థయామాసుః= ప్రార్థించిరి. దైవతైః ప్రార్థితఃశివః=దేవతలచేతఁ బ్రార్థింపఁబడిన వాఁడగుపరశివుండు, స్వయంభువం= తనయందుజ్యోతిరూపం బుగ వెలుంగుచుండెడు స్వయంభువును, దధ్యౌ=ధ్యానించెను. సోపి=ఆ స్వయంభువును, శివసహస్రార కమలాత్ = పరశివుని సహస్రారపద్మమునుండి,నిర్గత్య=వెలువడి, దేవలనామ్నా=దేవ లుం డను నామముతోడ, సశరీరస్సన్=శరీరముతోఁ గూడిన వాఁ డగుచు, రుద్రాదిదేవానాం = బ్రహ్మవిష్ణుమహేశ్వరాదు లగు దేవతలకు, సూత్రవస్త్రాదికం దత్తవాన్ = సూత్రవస్త్రా

దులను నొసంగెను. తతః=పిమ్మట, కాండర్షిః= కాండుఁ డనెడు మహార్షి, ఆగత్య=వచ్చి, దేవాంగమనుం దృష్ట్వా = దేవాంగ మనువును గాంచి, మమ=నాకు, వస్త్రసూత్రాదికం దాతవ్యం= వస్త్రసూత్రాదు లొసంగఁదగును, ఇతి అపృచ్ఛత్ = అని చెప్పెను. దేవాంగ బ్రహ్మణా = దేవలబ్రహ్మచేత, నఇదానీంవర్తతే= ఇపుడు జరుగఁజాలదు, శ్వః దీయతే = రేపటిదినమున నొసంగఁబడును, ఇతిఉక్తం=అని చెప్పఁబడెను. తతః=పిమ్మట, కాండర్షిః = కాండమహార్షి, కుపితస్సన్ = కోపగించినవాఁడగుచు, సర్వేషాం దత్వా=అందఱకు నొసంగి, మమ=నాకు, నాస్తిఇతిఉక్తం = లేదు అనిచెప్పఁబడెను. అతః= ఆకారణముచేత, త్వం=నీవు, నరోభవ = మనుష్యుండ వగుము, ఇతిశాపం దత్తనాన్=అనిశాపమిచ్చెను. తతః=పిమ్మట,మనుబ్రహ్మ=ఆదేవలబ్రహ్మ, త్వత్ శాపం=నీయొక్క శాపము, జగత్ ఉపకారాయ భవతి=లోకమునకు నుపకారముకొఱకే యగుచున్నది.లోకే= లోకమునందు,కార్యకారణయోః= కార్యకారణములకు, అభేదస్యవిద్యమానత్వాత్ =భేదరాహిత్య ముండుటవలనను, నరాణాం=జనులు,జగదంతః పాతిత్వేన= జగత్తులోపలఁ జేరియుండుటవలనను, సర్వవ్యాపిజగతః= జగం బంతయును, బ్రహ్మస్వరూపత్వేనచ = బ్రహ్మస్వరూపంబుగ నుండుటవలనను, నరస్యమమచ=నరునకును నాకును, భేదఃనాస్తి= భేదము లేదు. అతః= ఆకారణముచేత, త్వత్ దత్తశాపేన= నీచే నియ్యఁబడిన శాపముచేత, కింప్రయోజనం = ఏమిప్రయోజనము! ఇతిఉక్త్వా=

అని చెప్పి, శివసహస్రార కమలం = పరశివుని సహస్రారపద్మ మునందు, ప్రావిశత్ = ప్రవేశించెను.

తా.— మఱియొక బ్రహ్మకల్పప్రారంభమునందు, దేవత లందఱును దమకు సూత్రవస్త్రాదులు లేకుండుటచేత స్తోత్ర పూర్వకంబుగఁ బరమేశ్వరునిఁ బ్రార్థించిరి. అట్లు దేవతలు ప్రార్థించి నపుడు పరశివుండు తనయందు జ్యోతిరూపంబుగ వెలుంగు చుండెడు స్వయంభువును ధ్యానించెను. అంతట నా స్వయం భువు పరశివ సహస్రారపద్మాంతరమునుండి వెలువడి దేవల నామంబుతోడఁ బురుషరూపంబుఁ దాల్చి బ్రహ్మవిష్ణుమహేశ్వ రాదిదేవతలకు సూత్రవస్త్రాదులనొసంగెను. పిమ్మట కాండ మహర్షి యా దేవలబ్రహ్మను గాంచి "ఓమహాత్మా! నాకు వస్త్ర సూత్రాదుల నొసంగుము" అని యడిగెను. అపుడు దేవల బ్రహ్మ "ఇప్పుడు నీకు నొసంగఁజాలను రేపటికి నొసంగెదను"_ అని చెప్పెను. అంతట కాండమహర్షి కోపాక్రాంతచిత్తుం డగుచు, "అందఱికిని ఇప్పు డొసంగి నాకుమాత్రము గడువు చెప్పు చున్నాఁడవుగదా! కాఁబట్టి నీవు భూలోకంబున మనుష్యుండవై జన్మింతువు గాక!" అని శాపమిచ్చెను. అంతట దేవలబ్రహ్మ యా మునీంద్రునితో "నీవిచ్చిన శాపము లోకోపకారకముగాఁ బరిణమించుచున్నది. లోకంబున కార్యమగు ప్రపంచమునకును గారణ మగు పరబ్రహ్మమునకును భేదము లేకుండుటచేతను, మానవులు ప్రపంచములోపలనే చేరినవారగుటచేతను, ప్రపం చమంతయుఁ బరబ్రహ్మస్వరూపమే యగుటచేతను, మనుష్య

నకును నాకును భేద మెంతమాత్రమును గలుగనేరదు. కాఁబట్టి నీ విచ్చినశాపంబుచేత మేలు కలిగనేగాని లోప మెంతమాత్ర మును గానుపించదు".— అని చెప్పి పరమశివసహస్రార పద్మాంతరాళంబునఁ బ్రవేశించెను.

ఈ విషయమున తత్త్వసారోపనిషత్తునందలి ప్రమాణము.—

శ్లో.—కల్పాదౌ వస్త్రసూత్రాణా మభావా న్నిర్జరాః పునః
శివం సంప్రార్థయామాసుః లజ్జాఽవనతమస్తకాః
తత స్స్వయంభువం దధ్యౌ వస్త్రసూత్రార్థ మీశ్వరః
త్యక్త్వా సోపి సహస్రారం బహి రాగత్య సాదరం
సదేహీ దేవలాభిఖ్యాం ధృత్వా సా విబుద్ధై స్తతః
నిర్మాయ సూత్రవస్త్రాదీ౯ దేవతానాం దదౌ ముదా
కాండర్షి స్తత ఆగత్య నత్వా దేవాంగ మీశ్వరం
యయాచ సూత్రవస్త్రాదీ౯ మను దేహీతి భక్తితః
ఇతీరితం వచ శ్శ్రుత్వా దేవాంగో మునినా తదా
నేదానీం వర్తతే బ్రహ్మ౯ సూత్రవస్త్రాదికం త్వహం
శ్వస్తే దాస్యామి గచ్ఛేతి ప్రోక్తవా౯ దేవతాధిపః
తత స్తద్వచనం శ్రుత్వా కుపితో మునిపుంగవః
సూత్రవస్త్రప్రదత్వాద్య సర్వేషా మమృతాంధసాం
అబ్రహ్మ ర్మమ నాస్తీతి యస్మా న్నిష్కృపయాఽధునా
నరో భవేతి దేవాంగం శశాప సురపూజితం
తతో మునివరం దృష్ట్వా దేవాంగః ప్రహస౯ముదా
ఉవాచ మునిశార్దూల త్వచ్ఛాపం జగతాం భృశం

ఉపకారాయ భవతి నాత్ర కార్య విచారణా
భేదో నదృశ్యతే విద్వాన్ యత్కించి జ్జగదావయోః
మత్స్వరూపం జగత్సర్వం జగన్మద్రూప మేవ హి
నరాణాం చాపి మే విద్వన్ యోగ్యా వేవ నసంశయః
ఇత్యుక్త్వాంతరధా ద్దేవో దేవాంగో జగదీశ్వరః.

టీక.—కల్పాదౌ = బ్రహ్మకల్పముయొక్క ప్రారంభము నందు, పునః=మరల, వస్త్రసూత్రాణాం అభావాత్ = వస్త్ర సూత్రములు లేకుండుటవలన, నిర్జరాః = దేవతలు, లజ్జా అవనతమస్తకాః=సిగ్గుచేత వంపఁబడిన తలలు గలవా రగుచు, శివం=పరమ శివునిఁ గూర్చి, సంప్రార్థయామాసుః=భక్తితోఁ బ్రార్థించిరి. తతః = పిమ్మట, ఈశ్వరః = పరమశివుఁడు, వస్త్ర సూత్రార్థం = వస్త్రసూత్రముల కొఱకు, స్వయంభువం = స్వయంభు వగు పరమాత్మను, దధ్యౌ=ధ్యానించెను. సోపి=ఆ పరమాత్మయు, సహస్రారం త్యక్త్వా = శివసహస్రారంబును విడిచి, బహిఃఆగత్య=వెలుపలికి వచ్చి, సఆదరం= మన్ననతో, సదేహీ= దేహముతోఁ గూడినవాఁడగుచు, దేవల అభిఖ్యాం ధృత్వా= దేవలనామంబును వహించి, అసౌ విబుధైః స్తుతః = ఆ దేవతలచేత నుతింపఁబడినవాఁ డగుచు, సూత్రవస్త్రాదీన్ = సూత్రవస్త్రాదులను, నిర్మాయ=నిర్మించి, దేవతానాం = దేవత లకు, ముదా=సంతోషముతో, దదౌ=ఇచ్చెను. తతః పిమ్మట, కాండర్షిఃఆగత్య = కాండమహర్షివచ్చి, ఈశ్వరందేవాంగం నత్వా=భగవంతుఁడగుదేవాంగుని స్తోత్రముచేసి, సూత్రవస్త్రా

దీన్ మహ్యం దేహి ఇతి=సూత్రవస్త్రాదులను నాకు నొసంగుము అని, భక్తితః = భక్తితో, యయాచ = యాచించెను. తదా = అప్పుడు, మునినా=మునీంద్రునిచేత, ఇతి ఈరితం వచః = ఇట్లు చెప్పఁబడిన మాటను, శ్రుత్వా=విని, దేవతాధిపః దేవాంగః= దేవేశ్వరుం డయిన దేవాంగుఁడు, బ్రహ్మన్ = ఓ మునీంద్రా! సూత్రవస్త్రాదికం తు=సూత్రవస్త్రాదులో, న ఇదానీం వర్తతే= ఇప్పుడు గలుగఁజాలదు. అహం = నేను, తే = నీకు, శ్వః దాస్యామి = రేపటికి నొసంగుచున్నాను. గచ్ఛ = వెళ్లుము, ఇతి ప్రోక్తవాన్=అని చెప్పెను. తతః=అంతట, మునిపుంగవః= మునిశ్రేష్ఠుఁడు, తత్ వచనం శ్రుత్వా = ఆ మాటను విని, కుపితః=కోపముగలవాఁడగుచు, అమృతాంధసాం సర్వేషాం= దేవతల కందఱకును, సూత్రవస్త్రా = సూత్రవస్త్రములను, అద్య = ఇప్పుడు, ప్రదత్వా = ఇచ్చి, నిష్కృపయా = కారుణ్యము లేక, యస్మాత్ = ఏకారణముచేత, అధునా = ఇప్పుడు, మమ నాస్తి ఇతి = నాకు లేదు అని, అబ్రవీః = చెప్పితివో, (తస్మాత్ =అందువలన), నరో భవ=మనుష్యుండవగుము. ఇతి= అని, సురపూజితం దేవాంగం = దేవపూజితుఁ డయిన దేవాంగుని, శశాప = శపియించెను. తతః = పిమ్మట, దేవాంగః = దేవాంగుఁడు, ముదా=సంతోషముతోఁ గూడినవాఁ డగుచు, ప్రహసన్ = నవ్వి, మునివరం దృష్ట్వా = మునిశ్రేష్ఠుం డగు శాండమహర్షినిఁ గాంచి, మునిశార్దూల = ఓ మునిశ్రేష్ఠా! త్వత్ శాపం = నీవిచ్చిన శాపము, జగతాం = లోకంబులకు,

భృశం = మిక్కిలియును, ఉపకారాయభవతి = ఉపకారము కొఱకే యగుచున్నది. అత్ర కార్య=ఈవిషయమునందు,న విచారణా = సంతాపములేదు. విద్వాన్ =ఓ విద్వాంసుఁడా! జగత్ ఆవయోః = జగంబునకును నాకును, యత్కించిత్ = కొంచమేనియును, భేదః నదృశ్యతే = భేదము కానుపించదు. మత్ స్వరూపం = నాయొక్క స్వరూపమే; జగత్ సర్వం=జగంబంతయును. జగత్ మత్ రూపంఏవహి = జగత్తునాయొక్కరూపమే గదా ! విద్వాన్ = ఓ జ్ఞానీ ! మే = నాకును, నరాణాంచాపి= మనుష్యులకును, యోగ్యవేవ = తగినదియే. నసంశయః = సందేహములేదు, ఇతిఉవాచ = అనిచెప్పెను. ఇతిఉక్త్వా = ఇట్లుచెప్పి, దేవః జగదీశ్వరః = ప్రభుండును లోకేశ్వరుండును నగు, దేవాంగః = దేవాంగుఁడు, అంతరధాత్ = అంతర్ధానమొందెను.

తా.—మఱియొక్క కల్పారంభమునందు దేవతలు వస్త్రసూత్రములు లేకుండుటవలన సిగ్గుచేతఁ దలలు వంచుకొని భక్తితోఁ బరశివునిఁ బ్రార్థించిరి. అప్పుడు పరమేశ్వరుండు వస్త్రసూత్రములకొఱకు స్వయంభు వగు పరమాత్మనుధ్యానించెను. ఆ స్వయంభువు శివసహస్రారంబు నుండి వెలువడి యాదరంబుతోడ శరీరవంతుఁడగుచు దేవలనామంబువహించి, తన్ను దేవతలందఱును స్తోత్రము సేయుచుండఁగ సూత్రవస్త్రాదుల నిర్మించి సంతోషపూర్వకంబుగ నాదేవతల కందఱకు నొసంగెను. అపుడు కాండమహర్షి వచ్చి, సర్వేశ్వరుం డయిన

యీ దేవాంగుని స్తోత్రము చేసి "మహాత్మా! నాకు సూత్రవస్త్రాదుల నొసంగుము"—అని భక్తితో యాచించెను. అపుడు దేవేశ్వరుండయిన దేవలబ్రహ్మ యాతనిం గాంచి, "ఓమునీంద్రా! ఈ దినము నీకు సూత్రవస్త్రాదుల నియ్యంజాలను, తేపటికి నిచ్చెదను గాక!" అని చెప్పెను. ఆమాటకు మునీంద్రుండు కోపాక్రాంత చిత్తుం డగుచు, "ఓహో! దేవతలకందఱకు సూత్రవస్త్రంబుల నేటిదినమునందు నొసంగి, నాకుమాత్రము నిష్కారుణ్యబుద్ధి తోడ గడువు చెప్పుచున్నాండవుగదా! కాంబట్టి నీవు భూలోకంబున మనుష్యుండవై జన్మింపుము" అని దేవపూజితుం డయిన దేవాంగుని శపియించెను. అపుడు దేవలబ్రహ్మ సంతోషపూర్వకంబుగ నవ్వుచు మహర్షినిం గాంచి. "ఓమునిశార్దూలా ! నీ విచ్చిన శాపము లోకమునకు మిక్కిలియు నుపకారరూపకంబుగనే పరిణమించుచుండును. ఈ విషయమున నాకు నెంత మాత్రమును బరితాపము లేదు. ఓమహాత్మా! లోకంబునకును నాకును గొంచెమేనియు భేదంబుగలుగదు. ఈజగంబంతయును నా స్వరూపమే. నేనును ఈ జగత్స్వరూపుండనే. కాంబట్టి యో మునీంద్రా ! నీ విచ్చినశాపము యోగ్యమైనదియే. ఇందునకు సందేహామే లేదు"—అని చెప్పి యీజగదీశ్వరుండైన దేవల బ్రహ్మ యచ్చటనే యంతర్ధానము నొందెను.— అని తత్త్వసారోపనిషత్తువలనం దెలియవచ్చుచున్నది.

శ్లో.—వేదాః ప్రమాణం ప్రథమం స్వతఏవ నసంశయః
స్మృతయశ్చేతి హాసాని పురాణానిచ షణ్ముఖ

వేదా ఽవిరోధాదేతాని ప్రమాణాని నసంశయః
బ్రాహ్మం పాద్మం వైష్ణవంచ శైవం భాగవతాభిదం
మార్కండేయం నారదీయ మాగ్నేయ మితికీర్తితం
భవిష్యద్బ్రహ్మకైవర్తం లైంగ్యం వారాహ మేవచ
స్కాందంవామనకూర్మాఖ్యం మాత్స్యంగారుడసంజ్ఞికం
బ్రహ్మాండాఖ్యపురాణంచ వ్యాసోక్తంశ్రుతిసమ్మతం
శైవంస్కాందం తథాలైంగ్యం కూర్మంవామనసంజ్ఞికం
భవిష్యం మత్స్యవారాహం మార్కండేయం తథైవచ
బ్రహ్మాండంచ దశైతాని శైవాని సురసత్తమ
నారదీయం భాగవతం గారుడం వైష్ణవాభిదం
ఏత చ్చతుష్టయం విష్ణు పురాణాని మహామతే
బ్రాహ్మం పాద్మం ద్వయం బ్రహ్మ పురాణ మితి కథ్యతే
బ్రహ్మకైవర్తమేకంతు పురాణం సూర్యబోధకం
ఆగ్నేయాఖ్యం మహాప్రాజ్ఞ పురాణం త్వగ్నిబోధకం
రామాయణం భారతంచ వాల్మీకే ర్వ్యాసనిర్మితం
ఇతిహాసా విమా పూర్వరాజవృత్తాంత బోధకా
పురాణే ష్వితిహాసేషు తత్ర తత్రచ షణ్ముఖ
దేవాంగమునిమాహాత్మ్యం విద్యతే శ్రుతిసమ్మతమ్.

టీక.—షణ్ముఖ = ఓసుబ్రహ్మణ్యా! ప్రథమం = మొదట, వేదాః = వేదములు, స్వతఏవ = స్వాభావికంబుగ, ప్రమాణం = నిరూపణము. నసంశయః = సందేహము లేదు. స్మృతయశ్చ = శాస్త్రములును, ఇతిహాసాని = ఇతిహాసంబులును,

పురాణానిచ = పురాణంబులును, వేదఅవిరోధాత్ = వేద
విరుద్ధములు గా కుండుటచేత, ఏతానిచ=ఇవియును, ప్రమా
ణాని = తార్కాణములే. నసంశయః = సందియము లేదు.
బ్రాహ్మం = బ్రహ్మపురాణము, పాద్మం=పద్మపురాణము, వైష్ణ
వంచ=విష్ణుపురాణము, శైవం=శివపురాణము, భాగవత అభి
దం=భాగవత మను పేరుగల పురాణము, మార్కండేయం=
మార్కండేయపురాణము, నారదీయం = నారదపురాణము,
ఆగ్నేయం ఇతి కీర్తితం=ఆగ్నేయ మని పేరందిన పురాణము,
భవిష్యత్ = భవిష్య త్పురాణము, బ్రహ్మకైవర్తం=బ్రహ్మకై
వర్తపురాణము, లైంగ్యం = లింగపురాణము, వారాహం
ఏవచ=వారాహపురాణమును, స్కాందం=స్కాందపురాణము,
వామనం = వామనపురాణము, కూర్మాఖ్యం = కూర్మమను
పేరుగల పురాణము, మాత్స్యం=మత్స్యపురాణము, గారుడ
సంజ్ఞికం=గారుడ మనెడి పేరుగల పురాణము, బ్రహ్మాండాఖ్య
పురాణంచ= బ్రహ్మాండ మనెడి నామము గల పురాణంబును,
శ్రుతిసమ్మతం=వేదసమ్మతంబుగ, వ్యాసఉక్తం = వ్యాసమహర్షి
చేతఁ జెప్పఁబడినవి. సురసత్తమ= దేవశ్రేష్ఠుండ వయిన యో
షణ్ముఖా! శైవం స్కాందం లైంగ్యం = శైవము స్కాందము
లైంగ్యములును, తథా=అట్లే, కూర్మం వామనసంజ్ఞికం=కూర్మ
వామనాఖ్యంబు లగు పురాణములును, తథైవచ=అట్లులే, భవి
ష్యం మత్స్య వారాహం మార్కండేయం = భవిష్యత్తు
మత్స్య వారాహ మార్కండేయ పురాణంబులును, బ్రహ్మాం

డంచ = బ్రహ్మాండపురాణంబును, ఏతానిదశ=ఈ పది పురాణంబులును, శైవాని=శివపురాణంబులు. మహామతే=గొప్ప బుద్ధిగలవాఁడ వగు కుమారా! నారదీయం భాగవతంగారుడం వైష్ణవాభిదం = నారదీయ భాగవత గారుడ వైష్ణవాఖ్యంబులగు, ఏతత్ చతుష్టయం=ఈ నాలుగుపురాణంబులును, విష్ణు పురాణాని=విష్ణుపురాణంబులు. బ్రాహ్మం పాద్మంద్వయం=బ్రాహ్మము పాద్మము ననెడు పురాణములు రెండును, బ్రహ్మపురాణం ఇతికథ్యతే=బ్రహ్మపురాణంబులని చెప్పంబడును. బ్రహ్మకైవర్తం ఏకంతు = బ్రహ్మకైవర్త మనెడి యొక్కటి, సూర్యబోధకం పురాణం=సూర్యవిషయముఁ దెలిపెడి పురాణము. మహాప్రాజ్ఞ=మహావిజ్ఞానసంపన్నుండ వగు కార్తికేయా! ఆగ్నేయ ఆఖ్యంతు=ఆగ్నేయ మను పేరుగలది, అగ్నిబోధకం పురాణం= అగ్నిహోత్ర విషయక మగు పురాణము. వాల్మీకేర్వ్యాస నిర్మితం=వాల్మీకిమునీంద్రునిచేతను వ్యాసమహర్షి చేతను రచితంబు లయిన, రామాయణం భారతంచ=రామాయణంబును భారతంబును ననెడు, ఇమా ఇతిహాసౌ=ఇతిహాసంబు లయిన యీ రెండును, పూర్వరాజవృత్తాంతబోధకౌ = పూర్వరాజ వృత్తాంతములను బోధించునవి. షణ్ముఖ=ఓషడాననా! పురాణేషు ఇతిహాసేషుచ = పురాణములయందును నితిహాసముల యందును, తత్రతత్ర = అచ్చటచ్చటను, శ్రుతి సమ్మతం = వేదసమ్మతంబుగ, దేవాంగ మునిమాహాత్మ్యం=దేవాంగముని యొక్క ప్రభావము, విద్యతే=దెలియఁబడు చున్నది.

తా.—"ఓ షణ్ముఖా! తత్త్వార్థములను నిర్ధారణము సేయుట యందు మొట్టమొదట స్వతస్సిద్ధముగ వేదములే ప్రమాణంబు లగుచుండును. శాస్త్రంబులును బురాణేతిహాసంబులును వేదవిరుద్ధంబులు గామింజేసి యవ్వియును బ్రమాణంబు లగుట యందు నెంతమాత్రమును సందేహము లేదు. బ్రాహ్మము పాద్మము వైష్ణవము శైవము భాగవతము మార్కండేయము నారదీయము ఆగ్నేయము భవిష్యత్తు బ్రహ్మకైవర్తము లైంగము వారాహము స్కాందము వామనము కూర్మము మాత్స్యము గారుడము బ్రహ్మాండము ననెడు పదునెనిమిది పురాణంబులును వేదసమ్మతంబుగ వ్యాసమహర్షి ప్రోక్తంబులు. ఓ ధీవరేణ్యా! ఈ పదునెనిమిది పురాణములయందును శైవము స్కాందము లైంగ్యము కూర్మము వామనము భవిష్యత్తు మాత్స్యము వారాహము మార్కండేయము బ్రహ్మాండము ననెడు పదియును శైవపురాణంబులు. నారదీయము భాగవతము గారుడము వైష్ణవము ననెడు నాలుగును వైష్ణవపురాణంబులు. బ్రాహ్మము పాద్మము ననెడు రెండును బ్రహ్మపురాణంబులు. బ్రహ్మకైవర్త మనునది సూర్యబోధకంబగు పురాణము. ఆగ్నేయమనునది అగ్నిబోధకంబగుపురాణము. ఓమహాప్రాజ్ఞా! వాల్మీకిమునీంద్రవిరచిత మయిన శ్రీమద్రామాయణంబును వ్యాస మహర్షి ప్రోక్తం బయిన మహాభారతంబును ననెడు నితిహాసంబులు రెండును బూర్వరాజవృత్తాంతబోధకంబులు. ఓ షణ్ముఖా! వేదశాస్త్రములయందు మాత్రమే గాక పురాణేతి

హాసములయందు సయితము నచ్చటచ్చటను శ్రుతిసమ్మతంబుగ దేవలమునీంద్ర ప్రభావము తెలియవచ్చుచుండును".— అని శంకరుండు కుమారస్వామికిఁ దెలియఁజేసెను.

షణ్ముఖః.—దేవాంగసంభవే మానం వద మే కరుణాకర
శ్రుతిస్మృత్యవిరోధేన బ్రహ్మవిష్ణ్వాదిపూజిత
కుమారవచనం శ్రుత్వా మహేశో హృష్టమానసః
తా న్యేవ శ్రుతివాక్యాని దైవలా నిత్థముక్తవాన్.

టీక.—బ్రహ్మవిష్ణ్వాదిపూజిత=బ్రహ్మవిష్ణువు మొదలగు వారిచేతఁ బూజింపఁబడెడువాఁడా! కరుణ ఆకర=దయకుస్థానమగువాఁడా! దేవాంగసంభవే = దేవాంగతత్త్వార్థవిషయ మగు, మానం = ప్రమాణమును, శ్రుతిస్మృతి అవిరోధేన = వేదశాస్త్రములకు విరుద్ధము లేకుండునట్లు, మే= నాకు, వద = చెప్పుము. కుమారవచనం శ్రుత్వా = కుమారస్వామియొక్క వచనమును విని, మహేశః=మహేశ్వరుండు, హృష్టమానసః= సంతోషహృదయుండగుచు, దైవలాని = దేవలబ్రహ్మవిషయమగు, తాని శ్రుతివాక్యానిఏవ=ఆ వేదప్రమాణవాక్యములనే, ఇత్థం=ఈ ప్రకారముగ, ఉక్తవాన్=చెప్పినవాఁడయ్యెను.

తా.—కుమారస్వామి శంకరునిఁ గాంచి "బ్రహ్మ విష్ణ్వాది పూజితా ! ఓ కరుణాకరా ! దేవాంగతత్త్వార్థబోధకంబు లగు విషయములను వేదశాస్త్ర సమ్మతంబులగు ప్రమాణంబుల తోడ నాకు నెఱింగింపుము"—అని ప్రార్థింపఁగా విని మహేశ్వరుండు సంతుష్టాంతరంగుఁ డగుచు, దేవలబ్రహ్మవిషయమయిన

యా వేద ప్రమాణవాక్యములనే యీవిధంబుగా నాతనికిఁ జెప్ప నారంభించెను.

జట.—దేవలా దిమాని భూతాని జాయంతే. దేవలేన జాతా
ని జీవంతి. దేవలం ప్రత్యభిసంవిశంతి. తస్మా ద్దేవలో భూ
తానా మగ్ర ఆసీ దితి సామవేద ప్రదర్శనాత్.

టీక.—దేవలాత్ = దేవలబ్రహ్మవలన, ఇమాని భూతాని= ఈ (పృథివ్యాది) భూతంబులు, జాయంతే=పుట్టినవి. జాతాని= పుట్టినవన్నియు, దేవలేన=దేవలునిచేత, జీవంతి = జీవించుచున్నవి. దేవలంప్రతి = దేవలునిఁగూర్చి, అభిసంవిశంతి = ఐక్యమగుచున్నవి. తస్మాత్ = ఆకారణముచేత, దేవలః = దేవలబ్రహ్మయే, భూతానాం = సమస్తభూతంబులకును, అగ్రఆసీత్=ప్రధానుఁ డయ్యెను. ఇతి సామవేదప్రదర్శనాత్=అని సామవేద నిరూపణమువలన నెఱుంగఁదగును.

తా.—"పృథివ్యప్తేజోవాయ్వాకాశాదిక సమస్త జంగమ స్థావరంబులతోడఁ గూడిన ప్రపంచంబు లన్నియు దేవలబ్రహ్మ వలననే యుత్పన్నములయినవి. ఆవిధంబుగ నుత్పన్నంబులయిన సమస్తంబులును దేవలునిచేతనే వర్తించుచున్నవి. అట్టి సమస్తంబులును నంత్యంబున దేవలునియందే యైక్యంబు లగుచున్నవి. కాఁబట్టి దేవలబ్రహ్మయే సమస్త భూతంబులకును బ్రధాన పూరుషుండు"— అని సామవేద నిరూపణమువలనఁ దెలియుచున్నది.

౫౮.—హిరణ్యగర్భా దగ్రే సమవర్తత సర్వస్య భూతస్య పతి రేకఏవ దేవలః. య తేంద్రో బృహస్పతి ర్దేవా సూర్యా చంద్రమసా దేవల మయజంత తస్మా ద్దేవలో దేవతాద్య శ్శాస్తాచ దేవతానాం బ్రహ్మణ శ్చేతి యజు ర్వేద ప్రదర్శనాత్.

టీక.—హిరణ్యగర్భాత్ = చతుర్ముఖునికంటెను, అగ్రే= పూర్వము, సర్వస్య భూతస్య = సమస్త భూతంబులకును, పతిః=నాయకుండైన, దేవలః=దేవలుండు, ఏకఏవ=ఒక్కరుండే, సమవర్తత = ఉండెను. యతః= ఏకారణముచేత, ఇంద్రః = దేవేంద్రుండు, బృహస్పతిః= దేవగురుండు, దేవాః = దేవతలు, సూర్యాచంద్రమసా= సూర్యచంద్రులు, దేవలం అయజంత = దేవలునిఁ బూజించిరో, తస్మాత్ =ఆ కారణముచేత, దేవలః= దేవలుండు, దేవతానాం=దేవతలకును, బ్రహ్మణశ్చ=చతుర్ముఖునకునుగూడ, శాస్తా = శిక్షకుండును, దేవతాద్యశ్చ = దేవతల కందఱకును నాదిపురుషుండును, ఇతియజుర్వేద ప్రదర్శనాత్ = అని యజుర్వేద నిరూపణమువలనఁ దెలియనగును.

తా.— "హిరణ్యగర్భునికంటెను బూర్వము సమస్తభూతాధినాథుండగుచు దేవలుండొక్కరుండే సనాతనుండై యుండెను. దేవేంద్రుండును దేవతాచార్యుండును సూర్యచంద్రాదులగు దేవతలందఱును దేవలబ్రహ్మనే పూజించుచున్నారు. కాఁబట్టి దేవలబ్రహ్మయే బ్రహ్మాదిదేవతల కందఱకుఁ బ్రభుం

దునునాదిపూరుషుండును"—నని యజుర్వేదనిరూపణము వలనఁ దెలియుచున్నది.

ఈ విషయంబున సామవేద ప్రమాణము.—

జట.—మనసా వాచా వదంతి సత్యం దేవాంగం దేవతా యజ్ఞభుజం యజ్ఞకర్తారం యజ్ఞరూపం విశ్వస్యభర్తారం గోప్తారం హర్తారం తస్య రూపమే వై తత్సర్వం సూత్రకర్తార మాహుః— ప్రజాపతిస్తపసా తప్త్వా దేవాంగ మబ్రువత్ ఇమాన్లోకాన్ కథం వై సృజామీతి—ఇతి సామవేద ప్రదర్శనాత్.

టీక.—దేవతాః=దేవతలు, దేవాంగం=దేవాంగునిఁగూర్చి, మనసావాచా=మనస్సుచేతను మాటలచేతను, యజ్ఞభుజం = యజ్ఞభోక్త యనియు, యజ్ఞకర్తారం=యజ్ఞాధికారి యనియు, యజ్ఞరూపం = యజ్ఞస్వరూపుఁ డనియు, విశ్వస్యభర్తారం= సమస్తమునకు నధినాథుం డనియు, గోప్తారం = రక్షకుం డనియు, హర్తారం = లయకర్త యనియు, ఏతత్ సర్వం తస్య రూపం ఏవ=ఈ సర్వంబును నాతనిరూపమే యనియు, సత్యం వదంతి=సత్యమును జెప్పుచున్నారు. సూత్రకర్తారం ఆహుః= సూత్రకర్త యనియుఁ జెప్పుచున్నారు. ప్రజాపతిః = బ్రహ్మదేవుఁడు, తపసా తప్త్వా= తపం బాచరించి, దేవాంగం=దేవల బ్రహ్మను గూర్చి, ఇమాన్ లోకాన్=ఈ లోకంబులను, కథం సృజామి=ఎట్లు సృజింతును? ఇతి అబ్రువత్=అని యడిగెను.

ఇతి సామవేద ప్రదర్శనాత్ = ఇట్లని సామవేద ప్రమాణంబు వలనఁ దెలియుచున్నది.

తా.—దేవతలందఱును దేవాంగ బ్రహ్మావిషయమై "యాతండే యజ్ఞభోక్తయు యజ్ఞకర్తయు యజ్ఞస్వరూపియును. ఆతఁడే ప్రపంచోత్పత్తి స్థితిలయకారకుండును. ఈ సమస్తంబును నాతనిస్వరూపమే. బ్రాహ్మణ్యసంపాదకం బగు యజ్ఞసూత్రంబునకుఁ గర్తయు నాతండే" యని మానసికవాచికంబులుగ నీ సత్యార్థంబును గ్రహించుచున్నారు. పూర్వము చతుర్ముఖుండు ప్రపంచోత్పత్తి సేయఁగోరి తపంబాచరించి, తనకుఁ బ్రసన్నుం డయిన దేవాంగ బ్రహ్మను గాంచి "ఓ ప్రభూ! ఈ లోకంబులను నెట్లు సృజింతును?" అని యడిగెను—అని సామవేద ప్రమాణంబువలనఁ దెలియవచ్చుచున్నది.

మఱియు యజుర్వేదమువలని ప్రమాణము.—

జట.—అగ్నిరగ్రే ప్రథమో దేవతానాం, అగ్నేర్దేవానాం ప్రథమస్సూర్యః, అగ్నిర్దేవతా సూర్యాంతరాత్మా జగతస్తస్థుషశ్చ దేవాంగో బ్రాహ్మణాస్తం నమంతి బ్రహ్మవాదినః.—ఇతి యజుర్వేద ప్రదర్శనాత్.

టీక.—అగ్రే=ముందుగా, అగ్నిః=అగ్నిహోత్రుండు, దేవతానాం=దేవతలయందు, ప్రథమః=మొదటివాఁడు. అగ్నేః=అగ్నిహోత్రునకును, దేవానాం = దేవతలకును, సూర్యః = సూర్యుండు, ప్రథమః = మొదటివాఁడు. దేవాంగః=దేవాంగ

మనువు, తస్థుషః = గోచరించుచుండునది యగు, జగతః = లోకంబునకును, అగ్నిఃదేవతాసూర్యశ్చ = అగ్నిహోత్ర దేవాదిత్యులకును, అంతరాత్మా = లోపలియాత్మయై వెలుంగు వాఁడు, బ్రహ్మవాదినః బ్రాహ్మణాః = బ్రహ్మజ్ఞాను లగు బ్రాహ్మ ణులు, తం= ఆ దేవలబ్రహ్మను గూర్చి, నమంతి=నమస్కరించు చున్నారు. ఇతి యజుర్వేద ప్రదర్శనాత్ =అని యజుర్వేద నిరూపణంబుచేఁ దెలియనగును.

తా.—“దేవతలయందుఁ బ్రధానుండు అగ్నిహోత్రుండు. ఆయగ్నిహోత్రునకును దేవతలకును బ్రధానుండు సూర్యుండు. అట్టి సూర్యాగ్నిహోత్రులకును దేవతలకును స్థావరజంగ మాదులు గల సమస్తప్రపంచములకును నంతరాత్మయై వెలుంగుచుండెడు పరమాత్మయే దేవలబ్రహ్మ. కాఁబట్టియే బ్రహ్మజ్ఞానసంపన్ను లగు బ్రాహ్మణోత్తములు నిరంతరమును నా దేవలబ్రహ్మను ధ్యానించుచుందురు ”— అని యజుర్వేద ప్రమాణంబువలనఁ దెలియవచ్చుచున్నది.

ఇందునకు ఋగ్వేదమువలని ప్రమాణము —

శ్రుతి.—ఏక ఏవహి దేవాంగః, స బ్రహ్మో, తత్సత్యం, పృథ్వీ మిథ్యా, సూత్రాత్మనో దేవలబ్రహ్మణ స్సకాశాదవ్యక్తం, అవ్యక్తాన్మహాత్, మహతో అహంకారః, అహంకారా దాకాశః, ఆకాశా ద్వాయుః, వాయో రగ్నిః, అగ్నే రాపః, అద్భ్యః పృథివీ, పృథివ్యా ఓషధయః,ఓషధీభ్యో

ఽన్నం, తస్మాత్సర్వకారణో దేవాంగః—ఇతి ఋగ్వేద ప్రదర్శనాత్.

టీక.—ఏకఏవహి దేవాంగః=(ప్రపంచసృష్టికిఁ బూర్వము) దేవాంగబ్రహ్మ యొక్కరుఁడే యుండెను. సః బ్రహ్మ = ఆతఁడే పరబ్రహ్మము,తత్ సత్యం=అది సత్యము. పృథ్వీమిథ్యా=ప్రపంచము మాయ. సూత్రాత్మనో దేవలబ్రహ్మణః సకాశాత్ = సూత్రాత్మకుఁ డగు దేవలబ్రహ్మమూలముగ, అవ్యక్తం = పరమాత్మ గలిగెను. అవ్యక్తాత్ మహత్=పరమాత్మవలన మహాత్తత్త్వము గలిగెను. మహతో౽హంకారః = మహత్తువలన నహంకారము పుట్టెను. అహంకారాత్ ఆకాశః = అహంకారమువలన నాకాశము జనించెను. ఆకాశాత్ వాయుః=ఆకాశంబువలన వాయువు పుట్టెను. వాయోరగ్నిః= వాయువువలన నగ్నిగలిగెను. అగ్నేరాపః = అగ్నియందు జల ముద్భవిల్లెను. అద్భ్యఃపృథ్వీ = జలముచే భూమి గలిగెను. పృథివ్యా ఓషధయః = భూమివలన సస్యాదు లగు పంటలు గలిగెను. ఓషధీభ్యః అన్నం= సస్యాదులవలన నన్నము గలిగెను. తస్మాత్ = ఆ హేతువుచేత, సర్వకారణః దేవాంగః = సమస్తమునకు మూలకారణభూతుండు దేవలబ్రహ్మయే. ఇతి ఋగ్వేదప్రదర్శనాత్ =అని ఋగ్వేదప్రమాణంబువలనఁ దెలియవచ్చుచున్నది.

తా.—"ప్రపంచసృష్టికిఁ బూర్వము దేవాంగ బ్రహ్మయొక్కరుండె యఖండాద్వితీయ పరిపూర్ణబ్రహ్మంబై వెలుంగుచుండెను. ఆతండే పరాత్పరుండు. అది సత్యమయిన విషయము.

ప్రపంచము మాయ. సూత్రాత్మకుఁ డయిన దేవలబ్రహ్మమూలముగ నవ్యక్తము జనించెను. అవ్యక్తమువలన మహత్తత్త్వము గలిగెను. మహత్తత్త్వంబునుండి యాకాశం బేర్పడెను. ఆకాశంబునందు వాయువు పుట్టెను. వాయువు వలన నగ్ని యుద్భవించెను. అగ్నివలన జలంబు పుట్టెను. జలముచేత భూమి యేర్పడెను. భూమివలన సస్యాదులగు నోషధు లుత్పన్నములయ్యెను. ఓషధులవలన నన్నంబు గలిగెను. కాఁబట్టి సమస్తంబునకును గారణభూతుండు దేవలబ్రహ్మయే.—యని ఋగ్వేద ప్రమాణంబువలనఁ దెలియవచ్చు చున్నది.

ఇందునకు తత్త్వరహస్యోపనిషత్ ప్రమాణము.—

శ్రుతి.—ఓంకారరూపిణో దేవలస్య ప్రకృతేః రజస్సత్త్వ తమోగుణాః బ్రహ్మవిష్ణురుద్రా బభూవుః. బ్రహ్మా కామయత ప్రజాసృజేయేతి. స బ్రహ్మా తపస్తప్త్వా యో వై బ్రహ్మాణే ప్రదదౌచ వేదాన్ తం దేవలం శరణ మహం ప్రపద్యే. ఇతి తత్త్వ రహస్యోపనిషత్ప్రదర్శనాత్.

టీక.—ఓంకారరూపిణః=ప్రణవస్వరూపుఁ డయిన, దేవలస్య=దేవలునియొక్క, ప్రకృతేః=మాయవలన, రజస్సత్త్వ తమోగుణాః=రజస్సత్త్వతమోగుణంబులుగలవారలగు, బ్రహ్మవిష్ణురుద్రాః = బ్రహ్మవిష్ణుమహేశ్వరులు, బభూవుః = పుట్టిరి. బ్రహ్మా = రజోగుణయుతుం డగు బ్రహ్మదేవుఁడు, ప్రజాసృజేయేతి=ప్రజలను సృజింపవలయు నని, అకామయత= కోరెను. సః బ్రహ్మా = ఆ బ్రహ్మదేవుఁడు, తపః తప్త్వా = తపం బాచ

రింపఁగా, యః=ఎవ్వఁడు, బ్రహ్మణే=బ్రహ్మదేవునకు, వేదాఞ్= వేదములను, ప్రదదాచ=ఒసంగెనో, తం దేవలం = ఆ దేవల బ్రహ్మను, అహం = నేను, శరణం ప్రపద్యే = రక్షకునిఁగాఁ బొందుచున్నాఁడను. ఇతి తత్త్వరహస్యోపనిషత్ ప్రదర్శనాత్ = అని తత్త్వరహస్యోపనిషత్ప్రమాణంబు వలనఁ దెలియనగును.

తా.—“ప్రణవస్వరూపుఁ డగు దేవలబ్రహ్మ యొక్క మాయవలన రజస్సత్త్వతమోగుణాత్మకు లగు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు జన్మించిరి. వారిలో రజోగుణయుతుం డయిన బ్రహ్మదేవుండు ప్రపంచోత్పత్తిఁ గావింప నెంచి యందునకుఁ దగిన పరికరంబులకొఱకుఁ దపం బాచరించెను. అప్పుడు దేవలుండు ప్రసన్నుం డై యా చతుర్ముఖునకుఁ బ్రపంచోత్పత్తిసాధనభూతంబు లగు వేదంబులను గారుణ్యపూర్వకంబుగ ననుగ్రహించెను. అట్టిపరాత్పరుండగు దేవలబ్రహ్మయే నాకు రక్షకుం డగును గాక.”— అని తత్త్వరహస్యోపనిషత్తునందలి ప్రమాణంబువలనఁ దెలియవచ్చును.

మఱియు సామవేదోపనిషత్ ప్రమాణము.—

శ్రుతి.—దివ్యోగ్ని రేకో దేవలః. సబ్రహ్మా. సప వాగ్ర ఆసీత్. స వై తంతుకర్తాభవత్. విశ్వకర్మణే ప్రాయచ్ఛత్తంతూఞ్ సదేవాంగో దేవానా మయచ్ఛతూన్సత్రాణి. తం సర్వే దేవానమంతి. సోగ్నిమసృజత్. ఇమాన్లోకానసృజత్. ఇంద్రమ సృజత్. వాయుమసృజత్. అన్నం వై

దేవలో౽న్నాదో దేవలః. సచంద్రమా స్సనక్షత్రాణి సదివానక్తం ద్యా రంతరిక్షం దిశ స్సోస్మాన్పాతు. సదిశః పాతు. సో౽ఖిలాత్మానందీ భవతీతి సామవేదప్రదర్శనాత్.

టీక.—దేవలఃఏకః = దేవలుండొక్కరుండే, దివ్యోగ్నిః= చిజ్జ్యోతిస్వరూపుఁడు. సఃబ్రహ్మ = ఆతండే పరబ్రహ్మము. సఏవ = అతండే, అగ్రఆసీత్ = సృష్టికిఁ బూర్వ ముండెను. సవై తంతుకర్తా అభవత్ = అతఁడే లోకపరిమాణంబు నెఱుంగఁ దగిన తంతువుల నిర్మించినవాఁడుగా నయ్యెను. సదేవాంగః=ఆదేవాంగుఁడే, విశ్వకర్మణే=విశ్వకర్మకు, తంతూన్= లోకపరిమాణ నిర్ధారణం బగు సూత్రములను, ప్రాయచ్ఛత్= ఇచ్చెను. దేవానాం = దేవతలకు, సూత్రాణి = యజ్ఞోపవీతంబులను, అయచ్ఛత్=ఇచ్చెను. తం=ఆదేవలునిఁగూర్చి, సర్వేదేవాః= దేవతలందఱును, నమంతి = నమస్కరించుచున్నారు. సఃఅగ్నింఅసృజత్ = అతండే యగ్నిని సృజించెను. ఇమాన్ లోకాన్ అసృజత్ = ఈ లోకంబును సృజించెను. ఇంద్రం అసృజత్ = ఇంద్రుని సృజియించెను. వాయుం అసృజత్ = వాయువును సృజించెను. అన్నంచదేవలః= దేవలుండే యన్నంబును. అన్నాదోదేవలః = దేవలుండే యన్నము భుజించువాఁడును. సచంద్రమాః = అతఁడే చంద్రుఁడు. సనక్షత్రాణి = అతఁడే నక్షత్రములును. సః = అతఁడే, దివా = దినములును, నక్తం = రాత్రులును, ద్యౌః = స్వర్గంబును, అంతరిక్షం =

ఆకాశంబును, దిశః= దిక్కులును. సః అస్మాన్ పాతు=అతండు మనలను రక్షించుఁగాత! సః దిశః పాతు= ఆతండు సర్వదిక్కులను రక్షించుఁగాత! సః అఖిలఆత్మా = ఆతఁడు సర్వాత్ముఁడు, ఆనందీ భవతి =నిత్యానందమయుం డగుచున్నాఁడు. ఇతి సామవేద ప్రదర్శనాత్= అని సామవేద ప్రదర్శనమువలనఁ దెలియుచున్నది.

తా.—"దేవలబ్రహ్మ యొక్కరుఁడే చిజ్జ్యోతిస్స్వరూపుఁడు. సృష్టికిఁ బూర్వంబుగ సచ్చిదానందాఖండపరిపూర్ణం బగుచుండిన పరబ్రహ్మమును నతండే. లోకప్రమాణార్థమైన తంతుపరికరంబులను నతండే నిర్మించెను. అట్టితంతువులను విశ్వకర్మకు ననుగ్రహించినదియు నాదేవలబ్రహ్మయే. బ్రాహ్మణ్యసంపాదకంబుగ దేవతలకు బ్రహ్మసూత్రంబుల నొసంగినదియును దేవలుండే. అట్టి విరాడ్పురుషుం డగు దేవలబ్రహ్మకే దేవతలందఱును నమస్కరించుచున్నారు. సమస్తలోకంబులను నింద్రాదులగు దేవతలను దేజోవాయ్వాకాశాదికంబు లగు భూతంబులను సూర్యచంద్రనక్షత్రాదు లగు గ్రహంబులను నాతఁడే సృజించెను. భోజ్యమును భోక్తయును నగు కార్యకారణాధ్యక్షతలు గలవాఁడును నాతండే. దివారాత్రంబులును స్వర్గాకాశంబులును దిశాంతరాళంబులును నాతనిస్వరూపంబే. అతఁడే సచ్చిదానందమయుండును. అట్టి సర్వాత్మకుండు, మనలను సకలలోకంబులను రక్షించుఁగాత!"—అని సామవేదప్రదర్శనము వలనఁ దెలియుచున్నది.

తత్త్వసారోపనిషత్ ప్రమాణము.—

శ్రుతి.—సదేవలో బ్రాహ్మీవీణాయై శతతంతు దాతా. సశుచి ర్భవతు సూత్రదాతా సబ్రహ్మ భవతి సవిచార్యః తస్య సూత్రాదన్నప్రాణో మన శ్చక్షు శ్శ్రోత్ర మజీజనత్. తత్స్వరూపం జగత్, సఆత్మా తత్సత్యం, తంతో ర్వాలఖిల్యా అజాయంత, తే బ్రాహ్మణ్యాం, సవై విశ్వరూపో, నదివా నరాత్రి ర్నద్యాః ననక్షత్రాణి ననభో నదిశః కేవలం సూత్రాత్మా సర్వాం దేవలో, దేవతాస్సర్వే దేవలం ప్రవిశంతి, స రుద్రాంతర్యా మ్యోంకార రూపః, సర్వభూతాంతరాత్మా అపహత పాప్మా. యదక్షర మిదం బ్రహ్మ తత్సూత్రం జ్ఞానదాయకం, సూచనాత్సూత్రమి త్యాహు స్సూత్ర వై పరమంపదం, తత్సూత్రం విదితం యేన సయోగీ నాత్రసంశయః. ఏకో దేవస్సర్వభూతే షుగూఢః, సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా, కర్మాధ్య క్ష స్సర్వభూతాధివాసః, సాక్షీ చేతో దేవలో సూత్ర రూపః. ఇతి తత్త్వసారోపనిషద్దర్శనాత్.

టీక.—సదేవలః=ఆదేవలుండే, బ్రాహ్మీవీణాయై=సరస్వతి యొక్కవీణకు, శతతంతు = నూరుతంతువులను, దాతా = ఇచ్చినవాఁడు. సశుచిర్భవతు = ఆతఁడే నిర్మలుండు. సూత్ర దాతా= బ్రాహ్మణ్యసంపాదకంబు లగు సూత్రముల నొసంగిన వాఁడు. సబ్రహ్మాభవతి = అతఁడే పరబ్రహ్మము, సవిచార్యః= ఆతఁడే విషయపరిశీలనముచేత నెఱుంగఁ దగినవాఁడు. తస్య

సూత్రాత్ =ఆతనితంతువులవలన, అన్న ప్రాణోమనశ్చక్షుశ్శ్రోత్రం అజీజనత్ = అన్నము ప్రాణము మనస్సు నేత్రములు శ్రోత్రములుగలిగెను.తత్ స్వరూపం జగత్ =లోకమంతయును దేవల స్వరూపమే. స ఆత్మా = అతఁడే యాత్మయయుండు. తత్ సత్యం = అది సత్యము. తంత్రోః వాలఖిల్యాః అజాయంత= సూత్రములవలన వాలఖిల్యాది బ్రహ్మర్షులు జన్మించిరి. తైః= ఆ సూత్రములవలన, బ్రాహ్మణ్యం = బ్రాహ్మణ్యము గలిగెను. సవై విశ్వరూపః = ఆతండే లోకస్వరూపుఁడు, నదివా=పగలు కాదు, నరాత్రిః = రాత్రియునుగాదు, నద్యాః = స్వర్గమును గాదు, న నక్షత్రాణి = నక్షత్రములునుగాదు, న నభః = ఆకాశంబునుగాదు, నదిశః = దిక్కులును గాదు. సర్వాః = సమస్తమును, కేవలం= సంపూర్ణముగ, సూత్రాత్మా = సూత్రస్వరూపుఁడయిన, దేవలః= దేవలుఁడేయగుచుండును.సర్వే దేవతాః= దేవతలందఱును, దేవలంప్రవిశంతి = దేవలునియందే ప్రవేశించుచున్నారు. సః = ఆ దేవలుండు, రుద్రాంతర్యామి ఓంకారరూపః=రుద్రునియందుఁ దేజోరూపంబుగ విలసిల్లుచుండెడు ప్రణవస్వరూపుఁడు. సర్వభూత అంతరాత్మా = సమస్తభూతములలోపల నంతరాత్మగ విలసిల్లెడువాఁడు. అపహతపాప్మా = పోఁగొట్టఁబడిన పాపములు గలవాఁడు ( దోషరహితుఁడు ). యత్ =ఏది, అక్షరం = నాశరహిత మయిన, ఇదం బ్రహ్మ= ఈ పరబ్రహ్మమో, తత్ = అదియే, సూత్రం = సూత్రరూపమయినది. జ్ఞానదాయకం=దివ్యజ్ఞానమును నొసంగునది. సూచ

నాత్ = బ్రహ్మమును సూచించునదిగ నుండుటవలన, సూత్రం ఇతి = సూత్రము అని, ఆహుః = ప్రాజ్ఞులు చెప్పుచున్నారు. సూత్రంవై = ఆ సూత్రమే, పరమంపదం = శ్రేష్ఠ మయిన స్థానము, తత్ సూత్రం = ఆసూత్రము, యేనవిదితం = ఎవ్వని చేతఁ దెలియఁబడునో, సఃయోగీ = ఆతండే యోగీంద్రుఁడు, అత్రనసంశయః = ఈవిషయమున సందేహము లేదు. సూత్ర రూపః దేవలః= సూత్రస్వరూపుఁ డయిన దేవలుండు, ఏకః = ఒక్కరుండే, దేవః = ఈశ్వరుఁడు, సర్వభూతేషుగూఢః = సమస్తభూతములయందును నంతర్యామియగువాఁడు, సర్వ వ్యాపీ = సకలమునందును వ్యాపించినవాఁడు, సర్వభూత అంతరాత్మా = సమస్తభూతముల యందును ఆత్మరూపంబున నుండువాఁడు, కర్మాధ్యక్షః = సర్వకార్యంబులకును నియామ కుండు, సర్వభూతఅధివాసః = సమస్తభూతంబులకు నధికారి యగువాఁడు, సాక్షీ = సమస్తంబును జూచువాఁడు, చేతః = సమస్తంబును నడపువాఁడు, ఇతి తత్త్వసారోపనిషత్ దర్శ నాత్ = అని తత్త్వసారోపనిషత్తునందలి ప్రమాణంబువలనఁ దెలియుచున్నది.

తా.—"ఆ దేవలుండు సరస్వతీదేవియొక్క వీణకు నూలు తంతువుల నొసంగెను. శుచిర్ఖ్యాతుండును సూత్రదాయకుం డును నైన యీదేవలుండే బ్రహ్మస్వరూపుఁడు. తత్త్వార్థ పరిశీల నముచేత నెఱుంగఁదగినవాఁడును నాతండే. ఆతని సూత్రముల వలననే యన్నప్రాణంబులును మనోబుద్ధిచిత్తాదు లగు నంగ,

కరణంబులును జక్షుశ్శ్రోత్రాదు లగు నింద్రియంబులును జనిం చెను. సర్వలోకంబులును దేవలస్వరూపమే. ఆతఁడే యాత్మ మయుండును. ఇది సత్యము. ఆతని సూత్రములవలననే వాల ఖిల్యాది బ్రహ్మరులు జన్మించిరి. ఆ సూత్రములచేతనే బ్రాహ్మ ణ్యము గలుగును. కాఁబట్టి యాతఁడే విశ్వమయుండు. దివా రాత్రంబులు గాక స్వర్గాకాశంబులును గాక దిశానక్షత్రా దులును గాక మఱి యన్నియును దానేయగుచు సూత్రాత్ముఁడై వెలింగెడువాఁడు దేవలబ్రహ్మయే. దేవతలందఱును దేవలుని యందే లీను లగుచుందురు. దేవలుండే రుద్రునియందు నంత ర్యామియై తేజోరూపంబున వెలుంగుచుండును. ఆతండే ప్రణ వాత్మకుఁడు. దోషరహితుండును సర్వభూతాంతరాత్మయు నాతఁడే. ఏది నాశరహితంబై యఖండాత్మక మైన పరబ్రహ్మ మోయదియే సూత్రాత్మకమైనదియుజ్ఞానరూపంబగునదియును. అది యఖండానంద పరిపూర్ణబ్రహ్మంబును సూచించుటవలననే బ్రహ్మజ్ఞానసంపన్నులు దానిని సూత్ర మని చెప్పుచున్నారు. ఆ సూత్రమే పరమపదము. దాని నెఱింగినవాఁడే యోగీం ద్రుఁడు. ఇందునకు సందేహము లేదు. సూత్రస్వరూపుఁ డయిన దేవలుం డొక్కరుఁడే పరమాత్ముఁడు. సమస్తభూతాంతర్యా మియు సర్వవ్యాపియు సర్వభూతాంతరాత్మయు నై సమస్త కార్యంబులకును నియామకుఁ డగుచుండును. ఇట్లు దేవలబ్రహ్మ సర్వమును దానే యయ్యును దేని నంటక సర్వాతీతుం డగుచు సర్వసాక్షియై విలసిల్లు చుండును”—అని తత్త్వసారోపనిషత్తు నందలి ప్రమాణంబువలనఁ దెలియుచున్నది.

మూల.—అథఖలు ఋగ్వేదాది విభాగేన వేదాశ్చత్వారః
తత్రైకవింశతిశాఖాఋచః. నవాధికశతశాఖాయజుషః.
సహస్రశాఖా స్సామ్నః. పంచాశచ్ఛాఖా అథర్వ
ణస్య.ఏకైకశాఖాయా ఏకైకోపనిషత్. ఆహత్యాశీతి
సహితశతాధిక సహస్రసంఖ్యాకా ఉపనిషదః. తాసు
శ్రీరామచంద్రేణ సారతరోపనిషదః అష్టోత్తరశత
సంఖ్యాకా వాయు సూనవే ఉపదిష్టాః.

టీక.—అథఖలు=పిమ్మట, ఋగ్వేదాదివిభాగేన = ఋగ్వే
దము మొదలగు విభాగముచేత, వేదాః చత్వారః=వేదములు
నాలుగు. తత్ర = ఆ వేదముల యందు, ఋచః ఏకవింశతి
శాఖాః = ఋగ్వేదమునకు నిరువదియొక్క శాఖలు. యజుషః
నవ అధిక శతశాఖాః = యజుర్వేదమునకు నూటతొమ్మిది
శాఖలు. సామ్నఃసహస్రశాఖాః = సామవేదమునకు వేయి
శాఖలు. అథర్వణస్య పంచాశత్ శాఖాః = అథర్వణవేదము
నకు నేఁబదిశాఖలు. ఏకైకశాఖాయా = ఒక్కొక్క శాఖ
కును, ఏకైకోపనిషత్ =ఒక్కొక్క యుపనిషత్తు. ఆహత్యా=
మొత్తమునకు, అశీతిసహిత శత అధిక సహస్రసంఖ్యాకాః
ఉపనిషదః= వేయిన్ని నూటయెనుబది యుపనిషత్తులు. తాసు=
ఆ యుపనిషత్తులయందు, సారతరఉపనిషదః = శ్రేష్ఠతరము
లయిన యుపనిషత్తులు, అష్టోత్తరశతసంఖ్యాకాః= నూటయెని
మిది సంఖ్య గలవి, శ్రీరామచంద్రేణ= శ్రీరామచంద్రునిచేత,
వాయుసూనవే ఉపదిష్టాః = ఆంజనేయుని కొఱకు నుప
దేశింపఁబడినవి.

తా.—ఋగ్యజుస్సామాథర్వణములనెడు విభాగములచేత వేదములు నాలుగుగా నేర్పడినవి. అందు ఋగ్వేదమునకు నిరువదియొక్క శాఖలును, యజుర్వేదమునకు నూటతొమ్మిది శాఖలును, సామవేదమునకు వేయిశాఖలును, నథర్వణవేదమునకు నేఁబదిశాఖలును గలవు. ఒక్కొక్క శాఖయును నొక్కొక్కయుపనిషత్తగును. మొత్తమునకు వేయిన్నినూటయెనుబది యుపనిషత్తు లేర్పడినవి. వానియందు సారతరములయిన నూటయెనిమిదియుపనిషత్తులను శ్రీరామచంద్రుండు వాయుపుత్త్రునకు నుపదేశించెను.

అవతారిక.—శ్రీరామచంద్రుండు వాయుపుత్త్రునకు నుపదేశించిన నూటయెనిమిది యుపనిషత్తులకును నూటయెనిమిది యుపోపనిషత్తులు గలవు. ఈ మూలస్తంభనయందు దేవల బ్రహ్మ ప్రతిపాదకంబుగ మహోపనిషత్తు నిరాలంబోపనిషత్తు జాబాలోపనిషత్తు ముండకోపనిషత్తు కఠోపనిషత్తుల నుండి ప్రమాణంబులు చూపఁబడియున్నవి. ఈ మహోపనిషత్తు మొదలగునవి రామచంద్రుం డుపదేశించిన నూటయెనిమిదితోఁ జేరినవి గావనియు, ఉపోపనిషత్తులతోఁ జేరిన ఉపమహోపనిషత్తు ఉపనిరాలంబోపనిషత్తు ఉపజాబాలోపనిషత్తు ఉపముండకోపనిషత్తు ఉపకఠోపనిషత్తు లనియు నెఱుంగవలయును.

ఈ విషయమున విద్యారణ్యవిరచిత సర్వోపనిషత్సారసంగ్రహ ప్రమాణము.

శ్లోక.—ఋగ్వేదాది విభాగేన వేదాశ్చత్వార ఈరితాః
ఏకవింశతిసంఖ్యాక శాఖా స్తత్ర ఋచ స్స్మృతాః

నవాధికశతం శాఖా యజుషః పరికీర్తితాః
సామ్నస్సహస్రసంఖ్యాక శాఖా స్సంతి విభాగతః
అధర్వణస్య పంచాశ చ్ఛాఖా స్సంతి ప్రమాణతః
ఏకైక స్యాశ్చ శాఖాయా ఏకైకోపనిషత్ స్మృతా
అశీత్యుత్తరశతేన యుక్తా సాహస్రసంఖ్యయా
విద్యంతే త్రోపనిషద శ్శుద్ధతత్త్వార్థబోధకాః
తత్రా చాష్టోత్తరశత సంఖ్యాకా వాయుసూనవే
ప్రోక్తం శ్రీరామచంద్రేణ సాక్షాత్స ద్వస్తు సిద్ధయే
ఈశ కేన కఠ ప్రశ్న ముండ మాండూక్య తిత్తిరిః
ఐతిరీయంచ ఛాందోగ్యం బృహదారణ్యకం దశ
జాబాలం సర్వసారంచ నిరాలంబం మహా శ్శుకం
అద్వ యావ్యక్త శారీర భావ నాధ్యాత్మకం దశ
ఆసు ముండక జాబాల నిరాలంబ కఠో మహాః
ఏతా వదంతి చిన్మాత్ర పరబ్రహ్మస్వరూపకం
ఆసా ముపోపనిషదః దేవల బ్రహ్మబోధకాః
దేవలబ్రహ్మమాహాత్మ్యం యన్నిర్గుణ నిరామయం
తద్దేవలోపనిషది నామ శాఖీయకే స్ఫుటం
దేవాంగస్యతు సూత్రాది నిర్మాణం తాత్త్వికే స్ఫుటం
సూత్రవస్త్రప్రదానాది చరితం దేశికే స్ఫుటం
సప్తావతారచరితం విద్యతే వేదసారకే.

టీక.—వేదాః=వేదములు, ఋగ్వేదాది విభాగేన=ఋగ్వేదము మొదలగు విభాగములచేత, చత్వారః = నాలుగుగ,

ఈరితాః= చేయఁబడినవి. తత్ర=ఆ వేదములయందు, ఋచః= ఋగ్వేదమునకు, ఏకవింశతి సంఖ్యాక శాఖాః=ఇరువదియొక్క సంఖ్యగల శాఖలు, స్మృతాః = చెప్పఁబడినవి. యజుషః= యజుర్వేదమునకు, నవఅధికశతంశాఖాః = నూటతొమ్మిదిశాఖలు, పరికీర్తితాః = చెప్పఁబడినవి. సామ్నః = సామవేదమునకు, విభాగతః = వేఱ్వేఱగుచు, సహస్రసంఖ్యాకశాఖాః = వేయిసంఖ్యగల శాఖలు, సంతి = కలవు. అధర్వణస్య = అధర్వణవేదమునకు, ప్రమాణతః = ఆధారములతోఁ గూడినవియగు, పంచాశత్ శాఖాః = ఏఁబదిశాఖలు, సంతి = కలవు. ఏకైకస్యాశ్చ శాఖాయాః = ఈ శాఖలలో నొక్కటొక్కటియును, ఏకైక ఉపనిషత్ స్మృతా=ఒక్కొక్కయుపనిషత్తును జెప్పుచున్నది. అత్ర ఉపనిదః=ఈయుపనిషత్తులు, అశీత్యుత్తర శతేనయుక్తా సాహస్రసంఖ్యయా= నూటయెనుబదితోఁజేరిన వేయిసంఖ్యతో, శుద్ధతత్త్వార్థబోధకాః= శుద్ధ తత్త్వార్థములను బోధించునవి యగుచు, విద్యంతే = ఎఱుఁగఁబడుచున్నవి. తత్రాపిచ = ఆ యుపనిషత్తులయందు, అష్టోత్తరశతసంఖ్యాకా= నూటయెనిమిదిసంఖ్యగలవి, సాక్షాత్ సద్వస్తుసిద్ధయే=ప్రత్యక్షజ్ఞానసిద్ధి గలుగుటకై, వాయుసూనవే = ఆంజనేయునికొఱకు, శ్రీరామచంద్రేణ = శ్రీరామచంద్రునిచేత, ప్రోక్తం = చెప్పఁబడెను. ఈశ కేన కఠ ప్రశ్న ముండ మాండూక్య తిత్తిరిః ఐతిరీయంచ ఛాందోగ్యం బృహదారణ్యకం దశ = ఈశావాస్యోపనిషత్తు కేనోపనిషత్తు కఠోవల్ల్యుపనిషత్తు ప్రశ్నోపనిషత్తు ముండకోపనిషత్తు మాండూక్యోపనిషత్తు తైత్తిరీయోపనిషత్తు

ఐతిరీయోపనిషత్తు ఛాందోగ్యోపనిషత్తు బృహదారణ్యకోపని షత్తు ననెడు పది యుపనిషత్తులును, జాబాలం సర్వసారంచ నిరాలంబం మహా శ్శుకం అద్వయావ్యక్త శారీర భావనాధ్యా త్మకం దశ=జాబాలోపనిషత్తు సర్వసారోపనిషత్తు నిరాలంబో పనిషత్తు మహోపనిషత్తు శుకరహస్యోపనిషత్తు అద్వయో పనిషత్తు అవ్యక్తోపనిషత్తు శారీరకోపనిషత్తు భావనోపనిషత్తు అధ్యాత్మకోపనిషత్తు ననెడు పది యుపనిషత్తులును గూడిన, ఆసు = ఈ యుపనిషత్తులయందు, ముండక జాబాల నిరాలంబ కఠో మహాః=ముండకోపనిషత్తు జాబాలోపనిషత్తు నిరాలంబో పనిషత్తు కఠవల్ల్యుపనిషత్తు మహోపనిషత్తు ననెడు, ఏతాః= ఇవి, చిన్మాత్ర పరబ్రహ్మస్వరూపకం = జ్ఞానాత్మక పరబ్రహ్మ స్వరూపమును, వదంతి= చెప్పుచున్నవి. ఆసాం ఉపోపనిషదః= వీనియొక్క ఉపోపనిషత్తులు, దేవల బ్రహ్మబోధకాః = దేవల బ్రహ్మమును బోధించునవి. యత్ =ఏది, నిర్గుణనిరామయం= గుణశూన్యమును మాయారహితమును నగు, దేవల బ్రహ్మ మాహాత్మ్యం = దేవలబ్రహ్మమాహాత్మ్య మగునో, తత్ = అది, దేవలోపనిషదినామ శాఖీయకే = దేవలోపనిషత్తు అనెడు పేరుగల శాఖయందు, స్ఫుటం = స్పష్ట మగుచున్నది. దేవాంగస్య = దేవాంగునియొక్క, సూత్రాదినిర్మాణంతు = సూత్రాదినిర్మాణ విషయమన్ననో, తాత్త్వికే స్ఫుటం= తత్త్వో పనిషత్తునందు స్పష్ట మగుచున్నది. సూత్రవస్త్ర ప్రదానాది చరితం= సూత్రవస్త్రంబుల నొసంగుట లాదిగాఁ గలచరిత్రము, దేశికేస్ఫుటం = దేశికోపనిషత్తునందు స్పష్టమగుచున్నది. సప్త

వతారచరితం = దేవాంగుని సప్తావతారంబులను దెలుపు చరిత్రము, వేదసార కేవిద్యతే= వేదసారోపనిషత్తువలనఁ దెలియఁబడుచున్నది.

తా.—వేదములు, ఋగ్వేదము యజుర్వేదము సామవేదము అథర్వణవేదము ననెడు విభాగములచేత నాలుగుగ నేర్పడియున్నవి. వానియందు ఋగ్వేదమునకు నిరువదియొక్క శాఖలును,యజుర్వేదమునకు నూటతొమ్మిది శాఖలును, సామవేదమునకు వేయిశాఖలును, నథర్వణవేదమునకు నేఁబది శాఖలును గలవు. ఈ శాఖలయందు నొక్కటొక్కటియు నొక్కొక్క యుపనిషత్తును జెప్పుచున్నది. అట్లు మొత్తమునకు వేయిన్నినూటయెనుబది యుపనిషత్తు లేర్పడినవి. ఈ యుపనిషత్తులన్నియు శుద్ధతత్త్వార్థంబులను బోధించుచున్నవి. వీనియందు నూటయెనిమిది యుపనిషత్తులను సాక్షాత్ అధ్యాత్మిక జ్ఞానసిద్ధి గలుగుటకై శ్రీరామచంద్రుండు హనుమంతునకు నుపదేశించెను. ఈ నూటయెనిమిది యుపనిషత్తులయందును నీశావాస్య కేన కఠ ప్రశ్న ముండక మాండూక్య తైత్తిరీ మైతిరీయ ఛాందోగ్య బృహదారణ్యాకంబు లనెడు నుపనిషత్తులు పదియును బూర్వదశోపనిషత్తులు. జాబాల సర్వసార నిరాలంబ మహత్ శుకరహస్య అద్వయ అవ్యక్త శారీరక భావన అధ్యాత్మకంబు లనెడు నుపనిషత్తులు పదియును నుత్తరదశోపనిషత్తులు. ఇట్లు పూర్వోత్తరంబు లయిన యిరువదియుపనిషత్తులతోఁ జేరిన ముండక జాబాల నిరాలంబ

కఠ మహోపనిషత్తు లయిదును చిన్మాత్రపరబ్రహ్మ బోధకంబు లగుచుండును. ఈ యుపనిషత్తు లయిదింటికిని ఉపోపనిషత్తు లయిన ఉపముండక ఉపజాబాల ఉపనిరాలంబ ఉపకఠ (ఉప మహోపనిషత్తులు) దేవల బ్రహ్మ బోధకంబు లగుచుండును. మఱియు నిర్గుణ నిరామయ బ్రహ్మం బగు దేవలబ్రహ్మము యొక్క మాహాత్మ్యము సామవేదశాఖలతోఁ జేరిన దేవలోపనిషత్తునందుఁ జెప్పఁబడి యున్నది. దేవాంగునియొక్క సూత్రవస్త్రాదిక నిర్మాణచారిత్రము తాత్త్వికోపనిషత్తువలన స్పష్టమగుచున్నది. దేవతలకు సూత్రవస్త్రంబు లొసంగుటలు మొదలుగా గల చారిత్రము దేశికోపనిషత్తువలనఁ దెలియవచ్చుచున్నది. దేవాంగుని సప్తావతార చరిత్రము వేదసారోపనిషత్తునందుఁ జెప్పఁబడియున్నది.— ఇట్లని విద్యారణ్యస్వాములు సర్వోపనిషత్సార సంగ్రహమునందుఁ జెప్పియున్నారు.

## ఆగ్నేయపురాణాంతర్గత దేవాంగప్రభావము.—

ఋషయః.—సూతసూత మహాప్రాజ్ఞ కోయందేవాంగసంజ్ఞికః
అస్మాకం వద శీఘ్రం తదిత్యూచుస్తే మహాయశాః.

టీక.—మహాప్రాజ్ఞ = విజ్ఞానసంపత్తిగలవాఁడవును, సూతసూత = సుప్రసిద్ధుండవును నగు సూతమహర్షీ! కోయం దేవాంగసంజ్ఞికః = దేవాంగుఁడను పేరు గలవాఁ డెవ్వఁడు? తత్ = ఆవిషయమును, శీఘ్రం = త్వరగా, అస్మాకం = మాకు,

వద = చెప్పుము, ఇతి= అని, తే=ఆసూతునిఁ గూర్చి, మహా యశాః=మహాకీర్తివంతులగు శౌనకాదులు, ఊచుః= అడిగిరి.

తా.—మహానుభావులగు శౌనకాదిమహర్షులు సూత మునీంద్రునిఁగాంచి, "ఓమహాప్రాజ్ఞా! దేవాంగుఁడను పేరుగల యాతం డెవ్వరుఁడు? ఆతనివిషయంబు నెఱుంగ మిక్కిలియుఁ గుతూహలుల మగుచున్నారము. మాకుఁదెలియఁజేయుమా!" యని ప్రార్థించిరి.

సూతః.—పురాతు పార్వతీనాథం నమస్కృత్యచ షణ్ముఖః
దేవాంగస్య స్వరూపం మే వక్తవ్య మితి చాబ్రవీత్.

టీక.—సూతః = సూతమహర్షి యిట్లనియె.—పురాతు = పూర్వకాలమున, షణ్ముఖః = కుమారస్వామి, పార్వతీనాథం= పార్వతీశునిఁగూర్చి, నమస్కృత్య=నమస్కరించి, దేవాంగస్య స్వరూపం=దేవాంగునియొక్క స్వరూపంబును, మే=నాకు, వక్తవ్యంఇతి = చెప్పఁదగు నని, అబ్రవీత్ = చెప్పెను.

తా.—అట్లు తెలియఁ గోరిన యా శౌనకాదులఁ గాంచి సూతమునీంద్రుండు— "ఓమహర్షులారా! పూర్వము కుమార స్వామి, దేవాంగమాహాత్మ్యంబును నెఱుంగుటకై పరమేశ్వ రునిఁ బ్రణామపూర్వకంబుగఁ బ్రార్థించెను. అప్పు డాషణ్ముఖు నకుఁ బార్వతీనాథుండు దెలియఁజేసిన విధానంబును మీకుఁ జెప్పెదను"— అని యిట్లనియె.

శ్లో.—శృణు షణ్ముఖ సర్వజ్ఞ దేవాంగస్య స్వరూపకం
స సర్వకార్యకర్తాచ సచ సూత్రాత్మక ప్రభుః.

టీక.—సర్వజ్ఞషణ్ముఖ= సర్వము నెఱింగినవాఁడవగు నో షణ్ముఖా! దేవాంగస్య స్వరూపకం = దేవాంగుని స్వరూపం బును, శ్రుణు = వినుము. సచ = అతఁడే, సర్వకార్యకర్తా= సకల కార్యములకును నధినాథుఁడు. ప్రభుః= లోకేశ్వరుండు. సః సూత్రాత్మకశ్చ = ఆతండే సూత్రస్వరూపుఁడును.

తా.—ఓ షడాననా! దేవాంగమాహాత్మ్యంబును దెలియఁ జేసెద వినుము. ఆ దేవాంగుఁడే సకల కార్యంబులకును నధి నాథుండు. లోకేశ్వరుండును. సూత్రస్వరూపుఁడును నాతఁడే.

శ్లో.—న పంచపంచతత్త్వస్థః న దివా రాత్రి తారకః
న బ్రహ్మో విష్ణు రుద్రాశ్చ న నవగ్రహా సంకులమ్.

టీక.—న పంచపంచతత్త్వస్థః = ఇరువదియైదు తత్త్వం బులయందు నుండెడువాఁడు గాఁడు. న దివారాత్రి తారకః= రేయుం బవల్లును నక్షత్రంబులును గాఁడు. న బ్రహ్మావిష్ణు రుద్రాశ్చ = బ్రహ్మవిష్ణుమహేశ్వరులును గాఁడు. న నవగ్రహా సంకులం = నవగ్రహసముదాయమును గాఁడు.

తా.—ఆ దేవలబ్రహ్మ, పంచవింశతి తత్త్వంబులతోఁ గూ డినవాఁడు గాఁడు. దివారాత్రంబులును గాఁడు. బ్రహ్మ విష్ణు మహేశ్వరులును గాఁడు. గ్రహనక్షత్రంబులును గాఁడు.

శ్లో.—కింతు బ్రహ్మస్వరూపశ్చ దేవాంగో జ్యోతి రుచ్యతే
త జ్జ్యోతి స్తు స్వయం భాతి స్వేతరై ర్న ప్రకాశతే.

టీక.—కింతు=మఱియేమనఁగా, దేవాంగః=దేవాంగుఁడు, బ్రహ్మస్వరూపః = పరబ్రహ్మస్వరూపుఁ డనియు, జ్యోతిశ్చ =

చిజ్జ్యోతియనియు, ఉచ్యతే = చెప్పఁబడు చున్నాఁడు. తత్ జ్యోతిస్తు = ఆ జ్యోతియో, స్వయంభాతి = తనయంతటఁ దానే వెలుంగుచున్నది. స్వ ఇతరైః న ప్రకాశతే=మఱియొక దానిచేతఁ బ్రకాశించునది కాదు.

తా.__ మఱియే మనఁగా, ఆ దేవాంగుఁడు పరబ్రహ్మ స్వరూపుఁ డనియుఁ బరంజ్యోతియనియుఁ జెప్పఁబడుచుండును. ఆ జ్యోతియో స్వయంప్రకాశం బగునదియే గాని మఱియొక దానిచేత వెలుంగునది గాదు.

శ్లో.__స్వయంభు ర్దేవదేవేశః పరంజ్యోతి స్సదా శుచిః
నిరాకార స్వరూపశ్చ సర్వసాక్షీ నిరామయః.

టీక.__స్వయంభుః= తనంతటఁ దానే బుట్టినవాఁడు, దేవదేవేశః = దేవతలకును దేవుం డగువాఁడు. పరంజ్యోతిః = చిజ్జ్యోతి యగువాఁడు, సదాశుచిః=నిత్యనిర్మలుండు, నిరాకార స్వరూపః = ఆకారరాహిత్యమే స్వరూపంబుగఁ గలవాఁడు, సర్వసాక్షీ=దేనినంటక యతీతుం డగుచు సర్వంబును గాంచు వాఁడు, నిరామయశ్చ = మేర లేనివాఁడును.

తా.__ఆ దేవలబ్రహ్మయే స్వయంభువును దేవదేవేశ్వరుం డును. అఖండపరిపూర్ణచిజ్జ్యోతి యై నిరాకారస్వరూపంబు తోడనాతండు వెలుంగుచుండును. ఆతండే సర్వవ్యాపియగుచు దేనిని నంటక సర్వాతీతుండై సర్వసాక్షిగ విలసిల్లు చుండును.

శ్లో.__ఓమి త్యేకాక్షరం బ్రహ్మ దేవాంగో భాసతే సదా
స సూత్రాత్మా పరబ్రహ్మ ప్రపంచం స్రష్టు మైచ్ఛత.

టీక.—దేవాంగః = దేవాంగుఁడు, ఓం ఇతి ఏకాక్షరం బ్రహ్మ = ఓం అనెడు నేకాక్షరమే స్వరూపంబుగాఁ గల పరబ్రహ్మమై, సదా = నిరంతరమును, భాసతే = ప్రకాశించుచుండును. సః = ఆతండు, సూత్రాత్మా = సూత్రస్వరూపుఁడు. పరబ్రహ్మ = అఖండసచ్చిదానంద బ్రహ్మము. ప్రపంచం స్రష్టుం ఐచ్ఛత = లోకమును సృజింపఁ గోరెను.

తా.—ఆ దేవాంగుఁడే ప్రణవస్వరూపుఁ డగుచు నఖండ పరిపూర్ణానంద పరబ్రహ్మమై నిరంతరమును జజ్జ్యోతిరూపంబుగ వెలుంగుచుండును. సూత్రస్వరూపుఁ డయిన యాపరబ్రహ్మ ప్రపంచోత్పత్తిఁ గావింప సంకల్పించెను.

శ్లో.—తే నాహం జనితః ప్రాజ్ఞ మాయయా సహిత స్సదా
జగద్రూపిణి దేవాంగే తస్మిన్ సర్వం ప్రతిష్ఠితమ్.

టీక.—ప్రాజ్ఞ = విజ్ఞాన సంపన్నుండ వైన యోషణ్ముఖా! తేన = ఆ దేవలబ్రహ్మయొక్క శక్తిచేత, అహం = నేను, మాయయా సహితః = మాయతోఁ గూడినవాఁడ నగుచు, జనితః = పుట్టింపఁబడితిని. జగద్రూపిణి తస్మిన్ దేవాంగే= ప్రపంచస్వరూపుఁ డయిన యాదేవాంగునియందు, సర్వం= సమస్తము, సదా ప్రతిష్ఠితం=ఎల్లప్పుడును నిలుకడ పొందెను.

తా.—విజ్ఞానసంపన్నుండవయిన యో కుమారా! ఆదేవలబ్రహ్మయొక్క సంకల్పరూపం బయిన మాయవలన నేను బుట్టితిని. ప్రపంచస్వరూపుఁడయిన యా దేవల బ్రహ్మయందే

జంగమస్థావరరూపంబులగు సమస్తంబులును నెల్లప్పుడు నిలిచి యుండును. మఱియుసమస్తంబులును దేవాంగస్వరూపంబులే యగుచుండును.

శ్లో.—ఆవయో రంతరం నాస్తి భ్రాంత్యా భేదః ప్రకల్పితః
చిన్మయే కల్పితో భేదః రజ్జౌ సర్ప మతి ర్యథా.

టీక.—ఆవయోః = మా యిద్దఱకును, అంతరంనాస్తి= భేదము లేదు, భ్రాంత్యా=భ్రమచేత, భేదఃప్రకల్పితః=భేదము గలిగింపఁబడెను. రజ్జౌ = త్రాటియందు, సర్పమతిః యథా= సర్పమనెడి భ్రాంతియెట్లో (తథా=అట్లే), చిన్మయే = పర బ్రహ్మమునందు, భేదఃకల్పితః = భేదము గల్పింపఁ బడెను.

తా.—ఆ దేవాంగబ్రహ్మకును నాకును నెంతమాత్రమును భేదంబు లేదు. భ్రాంతిచేత మాయిద్దఱికిని భేద ముండునట్లు తోఁచుచుండును. ఒక్క త్రాటియందు సర్ప మనెడి యభిప్రాయము భ్రాంతిచేత నెట్లు కల్పితం బగునో యట్లే యఖండపరిపూర్ణచిన్మయబ్రహ్మమునందును భేదాభిప్రాయము కల్పితం బగు చుండును.

శ్లో.—ఆపాదమస్తకం ప్రాపుః భువనాని చతుర్దశ
పాదౌ తస్యతు పాతాళం పాదోర్ధ్వంతు మహాతలం
రసాతలంచ జంఘేతు జానుశ్చాపి తలాతలం
ఊరుద్వయంతు సుతలం వితలం గుహ్యభాగకం
అతలం కటిబంధేతు లోకా స్సప్త యథాక్రమం
అధోభాగేషు వర్తంతే ఊర్ధ్వలో కాధకీర్తితాః.

టీక.—తస్య=ఆ దేవల బ్రహ్మయొక్క, ఆపాదమస్తకంతు= పాదములు మొదలు శిరస్సుపర్యంతమును, చతుర్దశభువనాని= పదునాలుగు లోకంబులును, ప్రాపుః = పొందినవి. పాదౌ పాతాళం = పాదములు పాతాళలోకంబును, పాదఊర్ధ్వం మహాతలంతు = పాదములయొక్క మీఁదిభాగము మహాతల లోకంబును, జంఘేతు రసాతలంచ=పిక్కలు రసాతలంబును, జానుశ్చాపి తలాతలం=మోకాళ్లు తలాతలలోకంబును, ఊరు ద్వయంతు సుతలం = రెండుతొడలు సుతలంబును, గుహ్య భాగకం వితలం=గుహ్యప్రదేశము వితలంబును, కటిబంధేతు అతలం = మొలయందు నతలలోకంబును, సప్తలోకాః = ఈ యేడులోకంబులును, యథాక్రమం = క్రమము ననుస రించినవిగా, అధోభాగేతువర్తంతే=క్రిందిభాగమునం దున్నవి. అథ = పిమ్మట, ఊర్ధ్వలోకాః=మీఁదిలోకంబులు, కీర్తితాః = చెప్పఁబడుచున్నవి.

తా.— ఆ దేవల బ్రహ్మయొక్క పాదములు మొదలు శిరస్సు పర్యంతమును బదునాలుగు లోకంబులు వ్యాపించి యున్నవి. పాదములు పాతాళంబును, పాదముల యొక్క మీఁదిభాగము మహాతలంబును, పిక్కలు రసాతలంబును, మోకాళ్లు తలా తలంబును, తొడలు సుతలంబును, గోప్య స్థానము వితలంబును, కటిప్రదేశం బతలలోకంబును, నిట్లు యథాక్రమంబుగ నధోలోకంబు లేడును దేవాంగుని యధ శ్శరీరభాగంబున వ్యాపించి యున్నవి. ఇఁక నూర్ధ్వలోకంబుల విధము తెలుపఁబడును.

శ్లో.—భూలోకోదరమధ్యేతు భువర్లోకస్తు నాభిషు
సువర్లోకస్తు హృదయం మహర్లోకో గళస్తథా
జనర్లోకస్తతో వాచి తపోలోకే లలాటకే
సత్యలోకస్తు మూర్ధాస్య భువనాని చతుర్దశ
ఏవం తద్దేహమధ్యేతు వర్తంతే తాన్యథాక్రమమ్.

టీక.—అస్య = ఆ దేవాంగునియొక్క, ఉదరమధ్యేతు = కడుపు నడుమ, భూలోకః = భూలోకంబును, నాభిషు భువర్లోకస్తు= బొడ్డునందు భువర్లోకమును, హృదయం సువర్లోకస్తు = ఱొమ్ము సువర్లోకంబును, తథా = అట్లులే, గళః మహర్లోకః = గొంతు మహర్లోకమును, తతః = పిమ్మట, వాచిజనర్లోకః= నోరు జనర్లోకంబును, లలాటకే తపోలోకః= నుదుటఁదపోలోకంబును, మూర్ధా సత్యలోకస్తు= శిరస్సు సత్యలోకంబును, ఏవం = ఈవిధముగ, ఏతానిచతుర్దశభువనాని=ఈ పదునాలుగులోకంబులును, తత్ దేహమధ్యేతు = ఆ శరీరమధ్యమున, యథాక్రమం = వరుసప్రకారము, వర్తంతే=ఉన్నవి.

తా.—ఆ దేవల మను బ్రహ్మయొక్క యుదరమధ్యము భూలోకంబును, నాభిప్రదేశము భువర్లోకంబును, వక్షస్థలము సువర్లోకంబును, కంఠము మహర్లోకంబును, వాక్స్థానము జనర్లోకంబును, లలాటము తపోలోకంబును, శిరస్సు సత్యలోకంబును, ఈ విధంబుగఁ బదునాలుగు లోకంబులును ఆ శరీరమునందు వరుసప్రకారము వ్యాపించి యున్నవి.

శ్లో.—చంద్రోస్య మనసోజాతః చక్షోస్సూర్యో హ్యజాయత
ముఖా దగ్ని ర్మనుశ్చాపి ప్రాణా ద్వాయు రజాయత.

టీక.—అస్యమనసః= ఆ దేవాంగునియొక్క మనస్సువలన, చంద్రఃజాతః=చంద్రుండు పుట్టెను. చక్షోఃసూర్యః అజాయత=నేత్రములవలన సూర్యుఁడు పుట్టెను. ముఖాత్ అగ్నిః మనుశ్చాపి = ముఖమువలన నగ్నియును మనువును బుట్టిరి. ప్రాణాత్ వాయుః అజాయత = ప్రాణమువలన వాయువు పుట్టెను.

తా.—ఆదేవాంగ బ్రహ్మయొక్క మనస్సువలనఁ జంద్రుండు పుట్టెను. నేత్రములవలన సూర్యుండు జన్మించెను. ముఖము వలననగ్నిహోత్రుండును మనుబ్రహ్మయు జనించిరి. ప్రాణంబు వలన వాయువు గలిగెను.

శ్లో.—పద్భ్యాం భూమి ర్దిశశ్శ్రోత్రా త్తథా లోకానుకల్పితం
నాభ్యాతు హ్యంతరిక్షంచ శీర్ష్ణో ర్ద్యౌ స్సమవర్తత
ఈశకోటి స్తథోత్పన్నా జీవకోటి స్తథైవచ
సర్వేషాంమూలభూతోయం దేవాంగో దేవపూజితః.

టీక.—పద్భ్యాం భూమిః = పాదముల వలన భూమియు, శ్రోత్రాత్ =చెవులవలన, దిశః=దిక్కులును, తథా=అట్లే, లోకాః = లోకంబులును, అనుకల్పితం = కల్పింపఁబడినవి. నాభ్యాతు అంతరిక్షంచ = బొడ్డువలన నాకాశంబును, శీర్ష్ణోః ద్యౌః=శిరస్సువలన స్వర్గంబును, సమవర్తత=జరిగెను. తథా

ఆవిధముగనే, ఈశకోటిః ఉత్పన్నా = ప్రభువులసముదాయము పుట్టెను. తథైవచ = ఆరీతినే, జీవకోటిః ఉత్పన్నా= ప్రాణులసముదాయముపుట్టెను. దేవపూజితః = సర్వదేవసేవితుఁడగు, అయందేవాంగః= ఈ దేవాంగుఁడే, సర్వేషాంమూలభూతః = సమస్తమునకును నాధారభూతుండు.

తా.—ఆతని పాదంబులవలన భూమియును, శ్రోత్రంబులవలన సమస్తదిక్కులతోఁడఁగూడిన లోకంబులును నేర్పడినవి. నాభీప్రదేశంబుచేత నాకాశంబును శిరోభాగంబుచేత స్వర్గంబును గలిగినవి. మఱియు నాయాలోకంబులయందు వసింపఁదగిన ప్రాణులసమూహంబును, నట్టి ప్రాణికోటుల రక్షణార్థంబుగఁ బ్రభువులసముదాయంబును నుత్పన్నంబయ్యెను. కాఁబట్టి సర్వదేవసేవితుండగు యీదేవలబ్రహ్మయే సమస్తంబునకును మూలకారకుం డగుచుండును.

శ్లో.—బ్రాహ్మణో మునిజాతౌతు దేవజాతౌతు క్షత్రియాః
వైశ్యోహ్యప్సరజాతౌతు శూద్రో వై యక్షజాతిజః
చాతుర్వర్ణోపదేశేతు కారణం త్వగ్నిమామనుః
సర్వేషాంతుగురుస్సాక్షాత్ దేవాంగో బ్రహ్మసూత్రకః.

టీక.—బ్రాహ్మణో మునిజాతౌతు = మునికులంబువలన బ్రాహ్మణులును, దేవజాతౌతు క్షత్రియాః=దేవతలవలన క్షత్రియులును, వైశ్యోహ్యప్సరజాతౌతు = గంధర్వులవలన వైశ్యులును, శూద్రోవైయక్షజాతిజః= యక్షకులంబువలన శూద్రులును గలిగిరి. బ్రహ్మసూత్రకః=యజ్ఞోపవీతాధికారియు, అగ్ని

మామనుః = యజ్ఞాదులకు నాధారభూతుం డగు నగ్నిమామనువును, నగు, దేవాంగః=దేవలబ్రహ్మ, చాతుర్వర్ణోపదేశేతు కారణంతు = చాతుర్వర్ణములవారికిని దత్త్వోపదేశము సేయునట్టి కారణంబుచేత, సర్వేషాం = అందఱకును, సాక్షాత్ గురుః = ప్రత్యక్షుం డగు నాచార్యుం డగును.

తా.—దేవలసృష్టియైన యీజగంబునందు మహర్షికులంబువలన బ్రాహ్మణులును, దేవకులంబువలన క్షత్త్రియులును, గంధర్వ కులంబువలన వైశ్యులును, యక్ష కులంబువలన శూద్రులును గలిగిరి. యజ్ఞాధారభూతుం డగు నగ్నిమామనువును యజ్ఞసూత్రాధికారియు నగు దేవాంగుండు చాతుర్వర్ణములవారికిని దత్త్వోపదేశకర్త యగుటచేత నాతఁడే లోకంబునకు సాక్షాత్ మహదాచార్యుం డగు చుండును.

శ్లో.—ఏవం మూర్తిధరః కల్పే లోకానాం హితకామ్యయా
గురు ర్గురూత్తమ శ్చైవ దేవాంగ స్సూత్రధారకః.

టీక.—గురుః = లోకాచార్యుండును, గురూత్తమశ్చ = ఆచార్య వరేణ్యుండును, సూత్రధారకః = సమస్తలోకంబులకు సూత్రధారియు నగు, దేవాంగః = దేవలబ్రహ్మ, లోకానాం హితకామ్యయా= సర్వలోకంబులకును హితము సేయు తలంపుతోడ, కల్పే = ప్రతికల్పము నందును, ఏవం మూర్తిధరః = ఈ విధ మగు స్వరూపంబును దాల్చువాఁ డగును.

తా.—సమస్తలోకసూత్రధారియు మహదాచార్య వరేణ్యుండును నగు దేవాంగబ్రహ్మ నిర్గుణుం డయ్యును సర్వలోక

హితాచరణాసక్తిచేత సగుణుం డగుచు నాయాకల్పానుగుణం బుగ లోక లోకేశ లోకస్థాత్మకం బగు స్వరూపంబును దాల్చు చుండును.

శ్లో.—జటా మేఖల కౌపీనో భస్మాంగో బ్రహ్మసూత్రకః
పవిత్ర మక్షమాలాంచ కమండలు ధర శ్శుచిః
శివముద్రాంకిత ధర శ్శోభమాన స్సురార్చితః
సర్వోపదేశకర్తాచ సర్వభూత హితే రతః
సర్వకార్యప్రకర్తాచ తథా సూత్రాత్మక ప్రభుః
అంతరంగే తు హ్యాత్మాసా బహిరంగే జగద్గురుః
సాయుజ్యే తారకబ్రహ్మ దేవాంగో జ్యోతి రుచ్యతే.

టీక.—జటామేఖల కౌపీనః = జడలును మొలనూలును గౌపీనంబును గలవాఁడును, భస్మాంగః = విభూతి పూఁతతోఁ గూడినశరీరము గలవాఁడును, బ్రహ్మసూత్రకః=యజ్ఞోపవీతము గలవాఁడును, పవిత్రం అక్షమాలాంచ కమండలు ధరః = దర్భముద్రికను జపమాలను జలకుండికను ధరించినవాఁడును, శుచిః = పరిశుద్ధుఁడును, శివముద్రాంకితధరః = త్రిపుండ్ర త్రిశూలాదికంబులగు శివముద్రలను లాంఛనముగ ధరించిన వాఁడును, శోభమానః=ప్రకాశసంపన్నుఁడును, సురార్చితః= దేవతలచేతఁ బూజింపఁ బడువాఁడును, సర్వోపదేశకర్తాచ= అందఱకును దత్త్వార్థంబును బోధించువాఁడును, సర్వభూత హితేరతః=సమస్తభూతంబులకును హిత మాచరించుటయందు నాసక్తి గలవాఁడును, సర్వకార్యప్రకర్తాచ = సమస్తకార్య

ములకును నాధారభూతుండును, తథా=అట్లే, సూత్రాత్మకః= సూత్రస్వరూపుఁడును, ప్రభుః = లోకాధినాథుఁడును నగు, అసౌదేవాంగః=ఈ దేవాంగుఁడు, అంతరంగేతు ఆత్మా=హృదయమునందు జీవాత్మయనియు, బహిరంగే జగద్గురుః = వెలుపల జగదాచార్యుం డనియు, సాయుజ్యే తారకబ్రహ్మ= సహయోగంబునఁ బరమాత్మయనియు, జ్యోతిః=అఖండపరిపూర్ణ పరంజ్యోతి యనియు, ఉచ్యతే=చెప్పఁబడుచున్నాఁడు.

తా.—ఆ దేవాంగుఁడు, జడలును మొలత్రాఁడును గాపీనంబును ధరించి విభూతిఁ బూసి యజ్ఞోపవీతంబును దర్భముద్రికను జపమాలికా జలకుండికలను దాల్చి శుచిర్భూతుండై త్రిపుండ్ర త్రిశూలాదికంబు లగు శైవలాంఛనంబులు గలిగి శోభాయమానుం డగుచు దేవతలు సేవించుచుండఁ దత్త్వార్థ బోధకాచార్యుండును సమస్తభూతహితాసక్తుండును సమస్త కార్య కారణుండును నగుచు సూత్రరూపంబున వెలుంగుచుండును. అట్టి లోకాధినాథుఁడు హృదయాంతరంబున జీవాత్మయనియు, బాహ్యంబున జగదాచార్యుం డనియు, సహయోగంబునఁ దారకబ్రహ్మ యనియు నఖండ పరిపూర్ణానంద పరంజ్యోతి యనియుఁ జెప్పఁబడుచున్నాఁడు.

శ్లో.—మూర్తిత్రయ స్వరూపోయం దేవాంగస్సూత్రధారకః
ఓమిత్యేకాక్షరం బ్రహ్మం వాచ్యకో భాసతేస్వయం
ప్రణవో బీజరూపస్తు పరమాత్మా సదాశివః.

టీక.—మూర్తిత్రయస్వరూపః = బ్రహ్మవిష్ణుమహేశ్వరులగు త్రిమూర్తులస్వరూపము గలవాఁడును, సూత్రధారకః = బ్రహ్మసూత్రము ధరించినవాఁడును, ఓం ఇత్యేకాక్షరం బ్రహ్మం వాచ్యకః = "ప్రణవమే నాశరహితం బగు పరబ్రహ్మము" అనెడు నర్థంబు గల మహావాక్యంబుచేత నెఱుంగఁదగినవాఁడును, ప్రణవః = ఓంకారస్వరూపుఁడును, బీజరూపస్తు= సమస్తలోకోత్పత్తికి నాధారభూతం బయిన బీజరూపం బగువాఁడును, పరమాత్మా = పరబ్రహ్మయును, సదాశివః=సదాశివుండును, నగు, అయం దేవాంగః= ఈదేవాంగుఁడు, స్వయం భాసతే = తానుగనే ప్రకాశించు చున్నాఁడు.

తా.—త్రిమూర్తి స్వరూపుఁడును బ్రహ్మసూత్రధారియు "ఓం ఇత్యేకాక్షరం బ్రహ్మం" అనెడుమహావాక్యంబునకు వాచ్యభూతుండును బ్రణవాకారుండును సర్వలోకోత్పత్తికి బీజాత్మకుండును బరమాత్మయుఁ బరబ్రహ్మంబును నగు నీదేవలబ్రహ్మ సర్వంబును దానె యగుచు స్వయంబుగఁ బ్రకాశించుచుండును.

శ్లో.—ఆత్మత్రయ స్వరూపేణ ఆదిశక్తి సమన్వితః
స్వయంభు ర్దేవదేవేశః దేవాంగో దివ్యమూర్తిభాక్.

టీ.—ఆదిశక్తి సమన్వితః= చిచ్ఛక్తితోఁ గూడినవాఁడును, స్వయంభుః=తనంతటఁ బుట్టినవాఁడును, దేవదేవేశః=దేవతలను దేవేశ్వరుండును, నగు, దేవాంగః = దేవలబ్రహ్మ, ఆత్మత్రయ

స్వరూపేణ = జీవ పర మాంతరాత్మల స్వరూపంబు తోడ, దివ్యమూర్తిభాక్ = దివ్యస్వరూపంబును బొందెను.

తా.— స్వయంభువును నాదిశక్తి సమేతుండును దేవదేవేశ్వరుండును నగు దేవలుండు జీవాత్మా పరమాత్మా అంతరాత్మల స్వరూపంబుతోడఁ దేజోమూర్తియై ప్రకాశించుచుండును.

శ్లో.—గుణత్రయాత్మకో జ్ఞాన స్వరూపో భాసతే గురుః
చంద్రకోటిప్రతీకాశః సూర్యకోటిసమప్రభః
శుద్ధో మాయాసమాయుక్తస్సూత్రాదీన్ నిర్మమే పురా
తాని సూత్రాణి దేవేభ్యః ప్రదదౌ కరుణానిధిః.

టీక.—గుణత్రయ ఆత్మకః = త్రిగుణస్వరూపుఁడును, జ్ఞాన స్వరూపః = జ్ఞానాకారుండును, చంద్రకోటి ప్రతీకాశః=కోటి చంద్రులవలెఁ బ్రకాశించువాఁడును, సూర్యకోటిసమ ప్రభః= కోటిసూర్యులతో సమానమగు కాంతి గలవాఁడును, నగుచు, గురుః=జగదాచార్యుం డగు దేవలుండు, భాసతే=ప్రకాశించు చున్నాఁడు. శుద్ధః=పరిశుద్ధుండును, మాయాసమాయుక్తః= యోగమాయతోఁ గూడినవాఁడును, నగు, కరుణానిధిః = ఆ కరుణాకరుండు, పురా = పూర్వము, సూత్రాదీన్ = సూత్రాదులను, నిర్మమే=నిర్మించెను. తానిసూత్రాణి = ఆసూత్రాదులను, దేవేభ్యః = దేవతలకొఱకు, ప్రదదౌ = ఇచ్చెను.

తా.—రజస్సత్త్వతమోగుణ స్వరూపుఁడును జ్ఞానాకారుండును జగదాచార్యుండును నగు దేవాంగమనువు, చంద్రకోటి ప్రతీకాశుఁడుగను సూర్యకోటి సమప్రభవుఁడుగను భాసిల్లు

చుండును. పరిశుద్ధుఁడై యోగమాయాసమన్వితుం డగు నా కరుణాకరుండు పూర్వము తాను నిర్మించిన సూత్రాదులను బ్రహ్మాది దేవతల కొసంగెను.

శ్లోక.—తమోరూపయుతో విష్ణుసహస్రారే ప్రకాశతే
నానావతారరూపేణ జగతాం హితకామ్యయా
దుష్టదైత్యాదికాన్ హత్వా సుజనాన్ పరిపాల్యచ
భాసతే సౌ మహాతేజా దేవాంగో దేవవందితః.

టీక.—మహాతేజః = అధికప్రభావము గలవాఁడును, దేవవందితః = దేవతలచేత స్తోత్రము సేయఁబడువాఁడును నగు, అసౌ దేవాంగః=ఈ దేవాంగుఁడు. జగతాంహితకామ్యయా= లోకంబులకు మేలు చేయు తలంపుతోడ, తమోరూపయుతః= తమోగుణస్వరూపంబుతోఁ గూడినవాఁ డగుచు, విష్ణుసహస్రారే = మహావిష్ణువుయొక్క సహస్రారకమలంబున, ప్రకాశతే = ప్రకాశించుచున్నాఁడు. నానావతార రూపేణ = మత్స్యకూర్మాదికంబు లగు పలువిధములయిన యవతారరూపంబులతోడ, దుష్టదైత్యాదికాన్ హత్వా= దుర్మార్గు లగు రాక్షసాదులను హతము గావించి, సుజనాన్ పరిపాల్యచ = సన్మార్గులను బరిపాలించుచు, భాసతే = కేశవాది నామంబుల వెలుంగుచున్నాఁడు.

తా.—మహాతేజోసంపన్నుండును సర్వదేవపూజితుండును నగు దేవాంగబ్రహ్మ లోకరక్షణాభిప్రాయంబుతోడఁ దమోగుణవిశిష్టుం డై మహావిష్ణువుయొక్క సహస్రారంబున విలసిల్లి

మత్స్యకూర్మాదికంబు లగు నవతార రూపంబులతోడ దుష్ట నిగ్రహ శిష్ట పరిపాలనము గావించుచుఁ గేశవ నారాయణ మాధవాది నామంబులతోడఁ దేజరిల్లుచున్నాఁడు.

శ్లో.—బ్రహ్మణ స్స సహస్రారే రజసా వ్యాప్య నిర్మలః
చరాచరాత్మక స్యాస్య కర్తా భూల్లోక సంతతేః.

టీక.—సః నిర్మలః= పరిశుద్ధుం డయిన యా దేవలబ్రహ్మ, బ్రహ్మణః సహస్రారే= బ్రహ్మదేవుని యొక్క సహస్రారకమలంబున, రజసా వ్యాప్య=రజోగుణంబుచేత వ్యాపించి, అస్య చరాచరాత్మకస్య=ఈ జంగమస్థావరరూపం బయిన, లోకసంతతేః= లోకసముదాయమునకు, కర్తాభూత్=కర్త యయ్యెను.

తా.—నిత్యనిర్మలుం డయిన యాదేవలబ్రహ్మ రజోగుణ విశిష్టుం డగుచుఁ జతుర్ముఖుని సహస్రార పద్మాంతరాళంబున విలసిల్లి జంగమస్థావరాత్మకంబు లగు సమస్తలోకంబులకు నుత్పత్తికారకుం డయ్యెను.

శ్లో.—తథా సత్త్వగుణే నాసా దేవాంగో దేవవందితః
సహస్రారం ప్రవిశ్యా స్య శివస్య పరమాత్మనః
శుకాది మునిబృందస్య బ్రహ్మవిద్యా ప్రదాయకః
దక్షిణామూర్తి రూపేణ పరాపర మహారాజసా
జ్ఞానముద్రాం చాక్షమాలాం దదానో జగదీశ్వరః
శుద్ధ జ్ఞాన ప్రదాతాభూత్ తథా తామససంయుతః
బ్రహ్మణా సృష్ట మఖిలం కురుతే హి జగ ల్లయః.

టీక.—దేవవందితః = దేవతలచేత నమస్కరింపఁ బడిన వాఁడును, జగదీశ్వరః=లోకేశ్వరుండును,నగు,అసౌదేవాంగః= ఈ దేవాంగుఁడు, శుకాదిమునిబృందస్య = శుకమహర్షి మొదలుగాఁ గల మునీంద్రుల సముదాయమునకు, బ్రహ్మవిద్యాప్రదాయకః=బ్రహ్మవిద్య నొసంగువాఁడగుచు, తథా=అట్లే, పరమాత్మనః అస్యశివస్య=పరమాత్ముఁడయిన యీశివునియొక్క, సహస్రారం=సహస్రారపద్మమునందు, సత్త్వగుణేనప్రవిశ్య= సత్త్వగుణముతోఁ బ్రవేశించి, పరాపరమహౌజసా = దివ్యతేజోసంపన్నం బగు, దక్షిణామూర్తిరూపేణ=దక్షిణామూర్తి రూపంబుతోడ, జ్ఞానముద్రాం అక్షమాలాంచ దదానః= జ్ఞానముద్రయున్ను జపమాలికయున్ను ధరించినవాఁడై, శుద్ధజ్ఞానప్రదాతా ఆభూత్ =శుద్ధజ్ఞానప్రదాయకుండుగనయ్యెను. తథాహి = ఆవిధంబుగనే, తామససంయుతః = తామసగుణ విశిష్టుం డగుచు, బ్రహ్మణాసృష్టం అఖిలంజగత్ = బ్రహ్మచేత నిర్మితంబగు లోకసమస్తంబును, లయః కురుతే = లయము చేయు చున్నాఁడు.

తా.—దేవవందితుఁడును సర్వలోకేశ్వరుండును నయిన యీ దేవాంగబ్రహ్మ, శుకాదిమహర్షులకు బ్రహ్మవిద్యా ప్రదానము సేయ సంకల్పించి సత్త్వగుణవిశిష్టుండై పరమాత్ముఁడగు శంకరునియొక్క సహస్రారపద్మంబునఁ బ్రవేశించి దివ్యతేజో సంపన్నం బగు దక్షిణామూర్తిరూపంబుతోడ జ్ఞానముద్రాజపమాలికల ధరించి యీ మహర్షులకు శుద్ధజ్ఞానోపదేశంబు

గావించెను. అట్లే తామసగుణ విశిష్టుండై యాశంకరునియందే వెలుంగుచు, బ్రహ్మనిర్మితం బగు సమస్త లోకంబులకును లయంబు గలిగించుచుండును.

షణ్ముఖః.— దేవదేవ మహాప్రాజ్ఞ వద మే కరుణాకర
యజ్ఞోపవీతమాహాత్మ్యం దేవాంగబ్రహ్మణో ముదా.

టీక.— దేవదేవ = ఓదేవేశ్వరా! మహాప్రాజ్ఞ = మహావిజ్ఞానసంపన్నా! కరుణాకర=కారుణ్యనిధీ! దేవాంగబ్రహ్మణః యజ్ఞోపవీతమాహాత్మ్యం = దేవాంగబ్రహ్మనిర్మితం బయిన యజ్ఞోపవీతముయొక్క మాహాత్మ్యమును, ముదా = సంతోషముతోడ, మే వద=నాకుఁ జెప్పుము.

తా.— అనంతరము కుమారస్వామి శంకరునిఁ గాంచి "ఓ దేవేశ్వరా! మహాప్రాజ్ఞ! యో కారుణ్యనిధీ! దేవాంగబ్రహ్మచేత నిర్మితం బయిన యీ యజ్ఞోపవీతముయొక్క మాహాత్మ్యం బెట్టిదో నాకు నెఱింగింపుము"— అని ప్రార్థించెను.

శివః.— తంతుత్రయేణ సంయుక్త ముపవీతం ప్రకల్పితం
గాయత్రీ త్రిపదా సాతు దేవాంగే నైవ నిర్మితా
వదామి తస్య మానంతు శృణు షణ్ముఖ సాదరమ్.

టీక.— ఉపవీతం = యజ్ఞోపవీతము, తంతుత్రయేణ = మూఁడుపోఁగులతో, సంయుక్తం = కూడినదిగ, ప్రకల్పితం= చక్కఁగఁ గల్పింపఁబడినది. త్రిపదా=మూఁడుపాదములుగలదియగు, సా గాయత్రీతు = (యజ్ఞోపవీతమునకు నధిష్ఠానభూతయయిన) ఆ గాయత్రీదేవియును, దేవాంగేన ఏవ=దేవాంగుని

చేతనే, నిర్మితా=నిర్మింపఁబడినది యయ్యెను. షణ్ముఖ=ఓ షడా
ననా! తస్యమానంతు = ఆ యజ్ఞోపవీతము యొక్క ప్రమా
ణంబును, వదామి=చెప్పుచున్నాఁడను. సాదరం=ఆదరముతోఁ
గూడినవాఁడవగుచు, శృణు=వినుము.

తా.—ఇట్లు ప్రార్థించిన కుమారస్వామినిఁ గూర్చి మహే
శ్వరుండు "ఓ షణ్ముఖా! యజ్ఞోపవీతము మూఁడు తంతు
వులతోఁ గూడినట్లుగఁ గల్పింపఁబడినది. దానికి నధిష్ఠానభూత
యగు గాయత్రీదేవియుఁ బాదత్రయముతోఁ గూడినదిగ
దేవాంగబ్రహ్మచేతనే నిర్మింపఁబడినది. అట్టి యజ్ఞోపవీతము
యొక్క ప్రమాణంబును దెలియఁజేసెదను శ్రద్ధతో వినుము"—
అని చెప్పందొడంగెను.

శ్లో.—దేవదేవో మహాప్రాజ్ఞో దేవాంగో దేవపూజితః
గాయత్రీం మందగమనాం దృష్ట్వా కరుణయా తదా
చకార త్రిపదాం దేవీం దేవేశో జగదీశ్వరీమ్.

టీక.—దేవదేవః = దేవతలకు దేవుండును, మహాప్రాజ్ఞః=
మహాద్విజ్ఞానసంపన్నుండును, దేవపూజితః = దేవతలచేతఁ
బూజింపఁబడువాఁడును, దేవేశః = సమస్తదేవతలకు నాథుం
డును, నగు, దేవాంగః = దేవాంగబ్రహ్మ, మందగమనాం =
తిన్నని నడక గలదియు, దేవీం=తేజోరూపిణియు, జగదీశ్వరీం=
లోకనాయికయు, నగు, గాయత్రీం = గాయత్రీదేవిని, కరు
ణయా దృష్ట్వా=కారుణ్యముతోడఁ గాంచి, తదా = అపుడు,
త్రిపదాంచకార=మూఁడుపాదంబులు గలదానిఁగాఁ జేసెను.

తా.—దేవదేవుండును మహద్విజ్ఞానసంపన్నుండును దేవపూజితుఁడును నగు దేవాంగబ్రహ్మ కారుణ్యాన్వితమానసుండగుచు, లోకేశ్వరియు మందగామినియు నై తేజరిల్లుచుండెడి యాగాయత్రీదేవిని, యజ్ఞోపవీతంబునకు నధిష్ఠానభూత యగుటకు ననుగుణంబుగఁ బాదత్రయముతోడ విలసిల్లునట్లుగా నిర్మించెను.

శ్లో.—తత స్తాం త్రిపదాం దేవీం దృష్ట్వా ప్రోవాచ దేవలః
దేవి త్వం భువనం గత్వా యేతు బ్రహ్మకులోద్భవాః
తేషాం బ్రాహ్మణ్య సిద్ధ్యర్థం సూత్రరూపేణ తత్తనుం
ప్రాప్య సర్వజగత్పూజ్యాన్ తాన్కురుష్వ మదాజ్ఞయా
తతో దేవాంగవచనం శ్రుత్వా సా పరమేశ్వరీ
తదాజ్ఞాం శిరసా ధృత్వా దేవాంగం ప్రత్యువాచ హ.

టీక.—తతః = పిమ్మట, దేవలః=దేవాంగుఁడు, త్రిపదాం తాందేవీం దృష్ట్వా=మూఁడుపాదంబులు గలదియైన యాదేవిని గాంచి, దేవి=ఓ గాయత్రీ, మత్ ఆజ్ఞయా=నాయొక్కయాజ్ఞచేత, త్వం = నీవు, భువనంగత్వా= భూలోకమునకుఁ బోయి, బ్రహ్మకులఉద్భవాః యేతు= బ్రాహ్మణకులమునందుఁ బుట్టినవా ర లెవ్వరో, తేషాం= వారలకు, బ్రాహ్మణ్యసిద్ధ్యర్థం= బ్రాహ్మణ్యము గలుగుటకొఱకు, తత్ తనుం=వారి శరీరమును, సూత్రరూపేణప్రాప్య=యజ్ఞోపవీతరూపంబుగఁ బొంది, తాన్=వారలను, సర్వజగత్పూజ్యాన్ కురుష్వ= సర్వలోకపూజ్యులనుగాఁ జేయుము, అని, ప్రోవాచ=చెప్పెను. తతః=పిమ్మట, సాపరమే

శ్వరీ = పరమేశ్వరియైన యోగాయత్రీదేవి, దేవాంగవచనం శ్రుత్వా=దేవాంగునిమాటవిని, తత్ ఆజ్ఞాం శిరసా ధృత్వా= ఆ యాజ్ఞను శిరసావహించి, దేవాంగం ప్రత్యువాచ=దేవాంగుని గూర్చి బదులు చెప్పెను.

తా.—అట్లు త్రిపదయైన యోగాయత్రీదేవిని దేవలబ్రహ్మ గాంచి "ఓ దేవీ, నా యుత్తరువు ననుసరించి నీవు భూలోకంబునకుఁ బోయి, యచ్చట బ్రాహ్మణకులోద్భవులకు బ్రాహ్మణ్యము గలుగుట కొఱకు వారిదేహమున యజ్ఞోపవీతరూపంబునఁ జేరి, వారలను లోకపూజ్యులనుగాఁ జేయుము"— అనిచెప్పెను. అంతటఁ బరమేశ్వరియైన యోగాయత్రీదేవి దేవలాజ్ఞను శిరసావహించి యాతనితో వినయపూర్వకంబుగా నిట్లనియెను.

ఈవిషయమున యజుర్వేదోత్తరభాగప్రమాణము.—

జట.—యోసౌ దేవాంగో దేవరాట్ గాయత్రీంయజ్ఞోపవీతగ్ం త్రిపదాం త్రిసూత్ర మాచకార. తతో బ్రాహ్మణానాం బ్రాహ్మణ్యార్థం యజ్ఞోపవీతం పరమం వదంతి.

టీక.—దేవరాట్ = దేవనాయకుం డగుచు, యోసౌ దేవాంగః= ప్రసిద్ధుండయిన యీదేవాంగుఁడు, గాయత్రీం త్రిపదాం = గాయత్రీదేవిని మూఁడుపాదములు గలదిగను, యజ్ఞోపవీతం త్రిసూత్రం = యజ్ఞోపవీతము మూఁడుసూత్రములు గలదిగను, ఆచకార=చేసెను. తతః=పిమ్మట, బ్రాహ్మణ్యార్థం=బ్రాహ్మణ్యముకొఱకు, బ్రాహ్మణానాం=బ్రాహ్మణులకు,

యజ్ఞోపవీతం పరమం=గాయత్రియే ప్రధాన మయినది యని, వదంతి = చెప్పుచున్నారు.

తా.—దేవేశ్వరుండయినయీదేవలబ్రహ్మగాయత్రీయజ్ఞోపవీతంబులకుఁ బరస్పరము ఆధారాధేయంబులు గలుగునట్లు గాయత్రిని మూఁడుపాదములు గలదానిఁగను, యజ్ఞోపవీతంబును మూఁడుసూత్రంబులు గలదానిఁగను నిర్మించెను. అపుడు బ్రాహ్మణ్యసాధనంబుగ బ్రాహ్మణులకు యజ్ఞోపవీతము ప్రధాన మయినది.—అనియజుర్వేదమువలనఁ దెలియుచున్నది.

శ్లో.—దేవాంగ దేవతారాధ్య సృష్టిస్థిత్యంతకారణ
భూలోకే విద్యతే సర్వే మనుష్యా స్స్వేనకర్మణా
తేషుకే బ్రాహ్మణా స్తేషాం దేహంప్రాప్య వసా మ్యహం
ఇతి మే సంశయో జాతః త న్నివృత్తిం కురు ప్రభో.

టీ.—దేవతారాధ్య = దేవతలచేతఁ బూజింపఁబడువాఁడవును, సృష్టిస్థిత్యంతకారణ= ఉత్పత్తిస్థితిలయంబులకు నాధారభూతుండవును, నగు, దేవాంగప్రభూ! భూలోకే=భూలోకమునందు, సర్వేమనుష్యాః = మనుష్యులందఱును, స్వేనకర్మణా= తమకార్యములయందు, విద్యతే =వర్తించుచున్నారు. తేషుకే బ్రాహ్మణాః=వారలయందు బ్రాహ్మణులెవ్వరు? అహం=నేను, తేషాందేహంప్రాప్య=ఎవరి శరీరంబును బొంది, వసామి=వసింతును, ఇతిసంశయః=అనెడు సందేహము, మే=నాకు, జాతః= కలిగెను. ప్రభో=ఓ ప్రభూ! తత్ నివృత్తింకురు=ఆ సందేహమును నివర్తి సేయుము.

తా.—"ఉత్పత్తిస్థితిలయంబులకు మూలభూతుం డవును దేవపూజితుం డవును నయిన యో దేవలప్రభూ! భూలోకం బున నుండెడు మానవులందఱు వారివారికిఁ గల సమస్త కార్యములందును ప్రవేశించి యుందురు. వారిలో బ్రాహ్మణు లెవ్వరని యెఱుంగవచ్చునో? యజ్ఞోపవీతరూపంబున నెవ్వారి శరీరంబున నేను వసింపవచ్చునో? యని నాకు సందేహము గలుగుచున్నది. ఆ సందేహమును నివర్తిసేయుదు వని ప్రార్థించు దానను."

శ్లో.—స తస్యా వచనం శ్రుత్వా గాయత్ర్యా శ్శ్రుతిసమ్మతం
సంతోషేణ పునః ప్రాహ దేవాంగో సౌ జగత్ప్రభుః.

టీక.—సః = ఆ దేవలబ్రహ్మ, తస్యాః గాయత్ర్యాః = ఆ గాయత్రీదేవియొక్క, శ్రుతిసమ్మతం వచనం = వేదసమ్మత మయిన వాక్యంబును, శ్రుత్వా = విని, జగత్ప్రభుః అసౌ దేవాంగః = లోకనాయకుఁ డయిన యా దేవలుండు, సంతోషేణ = సంతోషముతోడ, పునఃప్రాహ = మరల చెప్పెను.

తా.—అట్లు గాయత్రీదేవి చెప్పిన వేదసమ్మతవాక్యంబును విని లోకనాయకుఁ డగు దేవలబ్రహ్మ సంతోషపూర్వకంబుగ నా మహాదేవితో ని ట్లనియె.

శ్లో.—దేవిదేవి మహాప్రాజ్ఞి సచ్చిదానందరూపిణి
ప్రీతోస్మి తవ వాక్యేన సాధుపృష్టం త్వ యాధునా
భూమౌ ప్రాకృతవిప్రాణాం షట్త్రియాణాంవిశాంతథా
తేషాం తత్కర్మసిద్ధ్యర్థం సూత్రం కర్తుం మహేశ్వరి

సర్వేషాం మానరక్షార్థం వస్త్రం కర్తుం తథా పురా
నిర్గుణో నిరహంకారో నిర్వికల్పో హ్యహం శివే
గుణత్రయేణ సంయుక్తో హ్యాభవం దేహసంయుతః
తతో దేవాంగ నామ్నాహం ప్రసిద్ధి మభజం పురా
సత్వాంశేన మయా సృష్టా మద్వంశీయా మహాయశాః
తదా ప్రభృతి దేవాంగ బ్రాహ్మణా ఇతి భూతలే
ప్రతీతిం ప్రాప్య వర్తంతే వస్త్రసూత్ర ప్రహేతవః
అప్రాకృత ద్విజా ఏతే సర్వలోక ప్రపూజితాః.

టీక.—మహాప్రాజ్ఞి = విజ్ఞానసంపన్నవును, సచ్చిదానంద రూపిణి = శక్తిజ్ఞానానంద స్వరూపవును నగు, దేవిదేవి = ఓ మహాదేవీ ! తవవాక్యేన = నీమాటచేత, ప్రీతః అస్మి = ప్రీతిగలవాఁడ నగుచున్నాను. అధునా= ఇపుడు, త్వయా = నీచేత, సాధుపృష్టం = చక్కఁగా నడుగఁబడెను. మహేశ్వరి= ఓజగదీశ్వరీ, భూవతా=భూమియందు, ప్రాకృతవిప్రాణాం=(ఉప నయనాది సంస్కారములచేతఁ బరిశుద్ధు లగు) ప్రాకృతబ్రాహ్మణులకును, క్షత్రియాణాం=క్షత్రియులకును, తథా=అట్లే, విశాం=వైశ్యులకును నగు, తేషాం= వారలకు, తత్కర్మసిద్ధ్యర్థం=వారివారియొక్క సత్కర్మములు సిద్ధి యగుటకు, సూత్రం కర్తుం=యజ్ఞోపవీతనిర్మాణముకొఱకును, తథా=అట్లే, సర్వేషాం మానరక్షార్థం=అందఱియొక్క మానము గాపాడుటకు, వస్త్రంకర్తుం = వస్త్రనిర్మాణముకొఱకును, అహం = నేను, పురా=ఆదియందు, నిర్గుణోపి=గుణరహితుఁడ నయ్యును, నిర

హంకారోపి=అహంకారవియుక్తుండ నయ్యును, నిర్వికల్పోపి= వికల్పశూన్యుండ నయ్యును, పురా=పూర్వము, గుణత్రయేణ సంయుక్తః=రజస్సత్త్వతమంబులనెడు త్రిగుణములతోఁగూడిన వాఁడనుగను, దేహసంయుతః = శరీరముతోఁగూడినవాఁడను గను, అభవం=అయితిని. తతః=పిమ్మట, అహం=నేను, దేవాంగనామ్నా = దేవాంగుఁడనెడు నామంబుతోడ, ప్రసిద్ధిం అభజం= ప్రసిద్ధినొందితిని. శివే = ఓ మంగళస్వరూపిణీ, మయా= నాచేత, సత్త్వాంశేనసృష్టాః=సత్త్వగుణాంశమునందుఁ బుట్టింపఁ బడినవారును, మహాయశాః = మహాయశస్కులగు, మద్వంశీయాః=నావంశస్థులు, తదాప్రభృతి=అట్లు సత్త్వాంశయందుఁ బుట్టింపఁబడినవారలగుట మొదలు, భూతలే = భూమియందు, దేవాంగబ్రాహ్మణాః ఇతి= దేవాంగబ్రాహ్మణులు అని, ప్రతీతిం ప్రాప్య=ప్రసిద్ధినొంది,వస్త్రసూత్రప్రహేతవః=వస్త్రసూత్రములకుఁ గారణభూతు లగుచు, వర్తంతే= ప్రవర్తించుచున్నారు. ఏతే = వీరలే, అప్రాకృతద్విజాః= (కర్మయుక్తం బగు ప్రాకృతంబునంటక స్వాభావికంబుగనే బ్రాహ్మణ్యముగల)అప్రాకృత బ్రాహ్మణులును, సర్వలోకప్రపూజితాః = సమస్తలోకంబులచేతఁ బూజింపఁబడువారును నగుచున్నారు.

తా.__మహా ప్రజ్ఞానసంపన్నవును శక్తిజ్ఞానానందస్వరూపవు నయిన యో మహాదేవీ ! యుక్తియుక్తంబుగ నీ వడిగిన మాటలకు నేను బరమప్రీతుండ నయితిని. ప్రపంచోత్పత్తికిఁ బూర్వము నేను నిర్గుణుండను నిర్వికల్పుండను నిరహంకారుం

డను నై యుండియు, లోకసృష్టి జరిగిన పిమ్మట భూమియందలి ప్రాకృతబ్రాహ్మణులకును క్షత్రియులకును వైశ్యులకును నియమితంబు లయిన వైదికకర్మలయందు నధికారసిద్ధి గలిగింపఁ జాలిన యజ్ఞోపవీతంబు నిర్మించుటకొఱకును, నందఱియొక్క మానములను గాపాడఁజాలిన వస్త్రంబుల నిర్మించుట కొఱకును, నేనురజస్సత్త్వతమోగుణయుతంబుగ శరీరధారినైతిఁ. అట్టి దేహంబుతోడ "దేవాంగుఁ" డనెడు నామంబుచేఁ బ్రసిద్ధి గాంచితిని. ఓ మంగళాంగీ! అట్టి నేను, సత్త్వగుణాంశముచేత మహాయశోసంపన్నులగు నాయొక్క వంశస్థులను బుట్టించితిని. అట్లువారు మదీయసత్త్వాంశయందుఁబుట్టినది మొదలు ప్రపంచమున "దేవాంగబ్రాహ్మణులు" అని ప్రసిద్ధిఁజెంది సూత్రవస్త్రంబులకు గారణభూతు లగుచు వర్తించుచున్నారు. వీరు కర్మయుక్తంబయిన ప్రాకృతంబునంటక పుట్టుకతోడనే బ్రాహ్మణ్యాధికారముగలవారు. కాఁబట్టి య ప్రాకృతబ్రాహ్మణు లనఁ బ్రసిద్ధులగుచు, సర్వలోకపూజితులై వర్తించుచుందురు.

ఇందునకు యజుర్వేదమువలని ప్రమాణము.—

జట.—అప్రాకృతా నేతా నైవ వస్త్రసూత్రకర్తౄ౯
బ్రాహ్మణా౯ నమస్కుర్వంతి యేతే సర్వపాప్మాన మవ
ధూన్వం తీతి యజుర్వేదప్రదర్శనాత్.

టీక.— ఏతా౯ = ఈ ప్రసిద్ధులయిన, వస్త్రసూత్రకర్తౄ౯ = వస్త్రసూత్రనిర్మాత లగు, అప్రాకృతా౯ బ్రాహ్మణా౯ = అప్రాకృతబ్రాహ్మణులను, యే నమస్కుర్వంతి=

ఎవ్వరు నమస్కరించుచున్నారో, తే = వారు, సర్వపాప్మానం= సమస్త పాతకంబులను, అవధూన్వంతి = పోఁగొట్టుకొను చున్నారు. ఇతి యజుర్వేదప్రదర్శనాత్ = అని యజుర్వేద ప్రమాణంబువలనఁ దెలియుచున్నది.

తా.—వస్త్రసూత్రనిర్మాత లగుచుఁ బ్రసిద్ధిఁ గాంచిన యీ యప్రాకృత బ్రాహ్మణులకు నెవ్వరు నమస్కరింతురో వారు సమస్తపాతకంబులను బోఁగొట్టుకొందు రని యజుర్వేద ప్రమాణమువలనఁ దెలియుచున్నది.

శ్లో.—శేషాః ప్రాకృతవిప్రాస్స్యు స్సర్వే మునికులోద్భవాః
అప్రాకృతద్విజాతీనాం దేవాంగకులసంభవాం
బ్రాహ్మణ్యం తు స్వతస్సిద్ధ మేత చ్ఛ్రుతి మతం శృణు
తథా ప్రాకృతవిప్రాణాం సంధ్యా యాగాదికర్మభిః
బ్రాహ్మణ్యం వర్తతే తస్మా దన్యథా పతితో భవత్.

టీక.—శేషాః=తక్కినవారలగు, సర్వేమునికులోద్భవాః= మునికులంబునఁ బుట్టినవార లందఱును, ప్రాకృతవిప్రాఃస్యుః= ప్రాకృతబ్రాహ్మణు లగుచున్నారు. దేవాంగకులసంభవాం = దేవాంగకులమునఁ బుట్టినవార లగు, అప్రాకృతద్విజాతీనాం = అప్రాకృతబ్రాహ్మణులకు, బ్రాహ్మణ్యం స్వతస్సిద్ధంతు = బ్రాహ్మ ణ్యము స్వాభావికంబుగఁ గలిగినదియే యగును. ఏతత్ = ఈ విషయము, శ్రుతి మతం = వేదసమ్మతమే, శృణు = వినుము. ప్రాకృతవిప్రాణాం=ప్రాకృతబ్రాహ్మణులకు, సంధ్యాయాగాది కర్మభిః=సంధ్యావందన యాగాచరణాది వైదికకార్యములచేత,

తథా=అట్లు, బ్రాహ్మణ్యాంనర్తతే=బ్రాహ్మణ్యము కలుగుచున్నది తస్మాత్ = ఆకారణముచేత, అన్యథా=అట్లు సంధ్యాయాగాదికములు చేయ కుండుటవలన, పతితః అభవత్ = అపరిశుద్ధుడగుచున్నాఁడు.

తా.— తక్కిన మునికులంబునఁ బుట్టినవా రందఱును ప్రాకృతబ్రాహ్మణు లనంబఱగుదురు. అప్రాకృతబ్రాహ్మణులయిన దేవాంగకుల సంభవులకు స్వాభావికంబుగనే బ్రాహ్మణ్యము గలదనుట వేదసమ్మతమే యనిమెఱుంగుము. మునికులసంభవులయిన ప్రాకృతబ్రాహ్మణులకు సంధ్యావందన వైశ్వదేవాదికంబు లగు వైదికకర్మలచేత నట్టి బ్రాహ్మణ్యము గలుగును. ప్రాకృతులయందు నెవ్వఁడేనియు నిట్టి వైదికకర్మల నాచరింపకుండిన నట్టివాఁడు బ్రాహ్మణపదవినుండి చెడినవాఁడే యగును.

శ్లో.—ఇతి జ్ఞాత్వా భువం గత్వా దేవి త్వం తత్ర వాసినాం
అప్రాకృతద్విజానాంచ తథా ప్రాకృతసంజ్ఞికాం
ద్విజానాం కంఠదేశేతు వసనూత్రాత్మనా శివే
ఇతీరితం వచశ్శ్రుత్వా దేవాంగేన మహాత్మనా
తతో హృష్టమనా దేవీ తం ప్రణమ్య ముహుర్ముహుః
దేవేశ జగదాధార బ్రహ్మేంద్రోపేంద్ర వందిత
సురాసురేంద్ర సంపూజ్య చరణారుణవారిజ
ధన్యాహంకృతకృత్యాహంత్వత్పాదాంబుజ దర్శనాత్
బ్రాహ్మణ్యస్యస్వరూపంతు శ్రుతం త్వత్తోమయాధునా
బ్రాహ్మణ్యవిషయే పూర్వం మచ్చిత్తో ద్భూతసంశయః

న నాశ భగవన్నద్య త్వద్వాక్య శ్రవణా ద్గురో
భవదాజ్ఞా ప్రకారేణ గచ్ఛామి భువనం ప్రతి
ఇత్యుక్త్వా సా మహాదేవీ జగామ స్వేచ్ఛయా తతః.

టీక.—దేవి=ఓగాయత్రీదేవీ! శివే = మంగళస్వరూపిణీ! ఇతి జ్ఞాత్వా = ఈప్రకారము నెఱింగి, త్వం = నీవు, భువం గత్వా=భూలోకమును బొంది, తత్రవాసినాం=అచ్చట వసించువార లగు, అప్రాకృతద్విజానాం = అప్రాకృత బ్రాహ్మణులయొక్కయు, తథా = అట్లే, ప్రాకృతసంజ్ఞికాం ద్విజానాంచ = ప్రాకృతు లనెడు సంజ్ఞతోఁ గూడిన బ్రాహ్మణులయొక్కయు, కంఠదేశేతు = కంఠప్రదేశమునందు, సూత్రాత్మనా = యజ్ఞోపవీతరూపిణి వగుచు, వస=వసింపుము. ఇతి= ఈవిధముగ, మహాత్మనాదేవాంగేన=మహానుభావుండగుదేవాంగునిచేత, ఈరితంవచః=చెప్పఁబడినవాక్యమును, శ్రుత్వా=విని, తతః=పిమ్మట, దేవీ=ఆగాయత్రీదేవి, హృష్టమనా=సంతుష్టాంతరంగయగుచు, ముహుర్ముహుః=పలుమాఱును, తంప్రణమ్య= ఆదేవాంగునకు నమస్కరించి, దేవేశ=దేవతలకుఁ బ్రభుండవగువాఁడా! జగత్ ఆధార=లోకములకు నాధారుండ వగువాఁడా! బ్రహ్మ ఇంద్ర ఉపేంద్ర వందిత= బ్రహ్మదేవునిచేతను దేవేంద్రునిచేతను విష్ణువుచేతనుస్తోత్రముచేయఁబడెడువాఁడా!సురఅసురేంద్ర సంపూజ్యచరణ అరుణవారిజ = దేవతలచేతను నసురాధిపులచేతను బూజింపఁదగిన కెందామరలవంటి పాదములు గలవాఁడా! త్వత్ పాద అంబుజ దర్శనాత్ =నీయొక్క పాదార

విందములను సేవించుటవలన, అహం ధన్యా=నేను ధన్యురాల నైతిని. అహంకృతకృత్యా=నేను కృతార్థురాలనైతిని. బ్రాహ్మ ణ్యస్య స్వరూపంతు = బ్రాహ్మణ్యముయొక్క స్వరూపమో, అధునా=ఇపుడు, త్వత్తః=నీవలన, మయా=నాచేత, శ్రుతం= వినఁబడెను. భగవన్ = ఓ భగవంతుఁడా! బ్రాహ్మణ్యవిషయే= బ్రాహ్మణ్యవిషయమునందు, పూర్వం=మునుపు, మత్ చిత్తఉ ద్భూతసంశయః=నాయొక్కమనస్సునందుఁబుట్టినసందేహము, అద్య = ఇప్పుడు, త్వత్ వాక్య శ్రవణాత్ = నీవాక్యము వినుట వలన, ననాశ = నశించినది. గురో = ఓ జగద్గురూ ! భవత్ ఆజ్ఞాప్రకారేణ = నీయొక్కఆజ్ఞాను సారంబుగ, భువనంప్రతి= భూలోకంబును గూర్చి, గచ్ఛామి = పోవుచున్నాను. ఇతి ఉక్త్వా = అని చెప్పి, సా మహాదేవీ=మహాదేవి యయిన యా గాయత్రీదేవి, తతః = పిమ్మట, స్వేచ్ఛయా జగామ = తన యిచ్ఛానుగుణంబుగఁ బోయెను.

తా.—"మంగళస్వరూపిణి వైన యో గాయత్రీదేవీ! ఈ చెప్పఁబడిన లక్షణంబులనెఱింగి నీవు భూలోకంబునకుఁ బోయి యచ్చటి యప్రాకృతబ్రాహ్మణులయొక్కయుఁ బ్రాకృతబ్రాహ్మ ణులయొక్కయుఁ గంఠప్రదేశంబున యజ్ఞోపవీతరూపిణి వై వెలుంగుచుండుము" అని మహానుభావుం డగు దేవలబ్రహ్మ చెప్పఁగా విని యా గాయత్రీదేవి సంతుష్టాంతరంగ యగుచు నాతనికిఁ బలుమాఱును నమస్కరించుచు, "ఓ దేవేశ్వరా! ఓ జగదాధారా ! బ్రహ్మేంద్రా మరవందితపాదాంబుజా ! మీ

పాదారవింద దర్శనమువలన నేను ధన్యనైతిని. కృతార్థనైతిని. బ్రాహ్మణ్యస్వరూపలక్షణము పూర్ణంబుగ విశద మయ్యెను. ఓ భగవంతుఁడా! బ్రాహ్మణ్య విషయమున నిదివఱలో నాకు గలిగియుండిన సందేహమంతయు నిపుడు మీ వాక్యశ్రవణము వలన బొత్తిగా నశించినది. ఓజగద్గురూ! మీయాజ్ఞానుసారం బుగ భూలోకంబునకుఁ బోవుచున్నాను”—అని చెప్పి యామహా దేవి తన యిచ్ఛానుసారంబుగఁ బోయెను.

ఈశ్వరః—యస్మాత్ షణ్ముఖ గాయత్రీ త్రిపదాభూత్తత శ్శృణు
యజ్ఞోపవీతమపిచ త్రిసూత్రేణయుతం హ్యభూత్
ఇత్థం బ్రహ్మస్వరూపోఽయం దేవాంగో జగదీశ్వరః
చకార త్రిపదాం దేవీం ఉపవీతం త్రిసూత్రకం
అయ మేవ పరబ్రహ్మ అయ మేవ జగద్గురుః
దేవాంగేన వినా లోకే న కించి దపి విద్యతే
ఇతీరితం వచ శ్శృత్వా దేవదేవస్య ధీమతః
షణ్ముఖో హృష్ట చిత్తస్సన్ న నామ పరమేశ్వరమ్.

టీక.—షణ్ముఖ = ఓషడాననా! శృణు = వినుము. యస్మాత్ = ఏకారణముచేత, గాయత్రీ = గాయత్రీదేవి, త్రిపదా అభూత్ = మూఁడుపాదములు గలదిగా నయ్యెనో, తతః = ఆకారణముచేత, యజ్ఞోపవీతంఅపిచ = యజ్ఞోపవీత మున్ను, త్రిసూత్రేణయుతం అభూత్ = మూఁడుసూత్ర ములతోఁ గూడినదిగా నయ్యెను. ఇత్థం = ఈప్రకారముగ, బ్రహ్మస్వరూపః జగదీశ్వరః = పరబ్రహ్మ స్వరూపుఁడును

జగదీశ్వరుండును నగు, అయం దేవాంగః = ఈ దేవాంగుఁడు, దేవీం త్రిపదాం = గాయత్రీ దేవిని మూఁడుపాదంబులు గలదిగను, ఉపవీతం త్రిసూత్రకం = యజ్ఞోపవీతము మూఁడు సూత్రములు గలదిగను, చకార = చేసెను. అయం ఏవ పర బ్రహ్మ = ఈతఁడే పరబ్రహ్మము. అయం ఏవ జగద్గురుః = ఈతఁడే సర్వలోకాచార్యుండు. లోకే = ప్రపంచంబున, దేవాంగేన వినా=దేవాంగునిఁ దప్ప, కించిత్ అపి నవిద్యతే = లేశమాత్రంబును లేదు. ఇతి ఈరితం = ఈవిధముగఁ జెప్పఁబడిన, దేవదేవస్యవచః = దేవేశ్వరుం డగు శంకరునియొక్క వచనంబును, శ్రుత్వా=విని, ధీమతః షణ్ముఖః = బుద్ధిమంతుం డగు షణ్ముఖుండు, హృష్టచిత్తస్సః = సంతోషిత చిత్తుం డగుచు, పరమేశ్వరం = పరమేశ్వరునిఁ గూర్చి, ననామ = నమస్కరించెను.

తా —"ఓ షణ్ముఖా! వినుము. గాయత్రీ యజ్ఞోపవీతంబులు పరస్పరము భేదము లేనిరీతిగఁ ద్రిపాద త్రిసూత్రములు గలవి యగుచుండును. పరబ్రహ్మస్వరూపుఁడును జగదీశ్వరుండును నగు దేవాంగబ్రహ్మ యీవిధంబుగ గాయత్రీదేవిని మూఁడుపాదంబులు గలదిగను, యజ్ఞోపవీతంబును మూఁడు సూత్రములు గలదిగను నిర్మించెను. ఈ దేవలబ్రహ్మయే పరమాత్ముఁడును సర్వలోకాచార్యుండును. సర్వప్రపంచంబులును దేవాంగమయమే. లోకంబున దేవాంగునిఁ దప్ప మఱియేదియును లేశమాత్రంబును గలుగదు." అని పరమేశ్వ

రుండు చెప్పఁగా విని ధీవరేణ్యుం డయిన యా షణ్ముఖుండు సంతోషితచిత్తుం డగుచు నా మహాదేవునకు నమస్కరించెను.

ఇతి శ్రీ సిద్ధాగమే చతుర్థపటలే శివషణ్ముఖసంవాదే
దేవాంగ బ్రహ్మస్వరూప ప్రతిపాదక
వేదోక్త మూల స్తంభనమ్.

ఇట్లు సిద్ధాగమమున నాలుగవపటలమునందు శివషణ్ముఖ
సంవాదరూపం బయిన దేవాంగబ్రహ్మస్వరూప
ప్రతిపాదకం బగు వేదోక్తమూల స్తంభనము
సంపూర్ణము.

## దేవలోపనిషత్తు.

(ఇది సామవేదమున మున్నూట పదునేడవ శాఖతోఁ జేరినది)

### ప్రథమఖండః.

జట.—అథాస్యాదౌ నిర్గుణో నిరామయో నిరంజనో నిష్క్రియో నిర్ద్వంద్వో నిర్మమో నిత్యశ్శుద్ధశ్శాశ్వత స్సత్తామాత్రో అఖండైకరసో నిరాలంబో నిఖిల జగదుపాదానభూతో నిరాకుల స్సచ్చిదానంద నిత్యపరిపూర్ణా ఽఖండ పరబ్రహ్మస్వరూపో దేవల ఏ వాసీత్ నాన్య త్కించ న మిషత్.

టీక.—అథ=పిమ్మట, అస్యఆదౌ=ఈసమస్తలోకోత్పత్తికిఁ బూర్వము, నిర్గుణః= సత్త్వాదిగుణములు లేనివాఁడును, నిరామయః = మాయలేనివాఁడును, నిరంజనః= అంతటను నిండినవాఁడును, నిష్క్రియః=కార్యకారణశూన్యుఁడును, నిర్ద్వంద్వః=రాగద్వేషాదికంబు లగు ద్వంద్వంబులు లేనివాఁడును, నిర్మమః = మమకారము లేనివాఁడును, నిత్యః=చలనము లేనివాఁడును, శుద్ధః = పరిశుద్ధుండును, శాశ్వతః = స్థిరుఁడును, సత్తామాత్రః=సర్వశక్తియుక్తుండును, అఖండైకరసః= భిన్నంబు గామియే రూపం బగువాఁడును,నిరాలంబః=ఆధారములేనివాఁడును, నిఖిలజగత్ ఉపాదానభూతః = సకలజగంబులకుఁ గారణభూతుండును, నిరాకులః = వ్యాకులము లేనివాఁడును, సచ్చిదానంద నిత్య పరిపూర్ణాఖండ పరబ్రహ్మస్వరూపః= శక్తి జ్ఞానానందములచేత శాశ్వతపరిపూర్ణుఁడగుచు నఖండతేజంబున వెలింగెడు పరబ్రహ్మస్వరూపుఁడును, నగు, దేవలఏవ = దేవలుండే, ఆసీత్ = ఉండెను. అన్యత్ = ఇతరం బగునది. కించనమిషత్ =కొంచెమేనియు లేదు.

తా.—సమస్తలోకోత్పత్తికిఁ బూర్వము నిర్గుణ నిరామయ నిరంజన నిష్క్రియాత్మకుఁడై రాగద్వేషాదికంబు లగు ద్వంద్వంబుల నంటక మమకారాహంకార వర్జితుఁడును, నిత్యశుద్ధ శాశ్వత సత్తామాత్రాదిక లక్షణ ప్రపూర్ణుండును, నిరాలంబాఖండైకరస యుక్తుండు నగుచు సకలజగదుత్పత్తిస్థితిలయంబులకుఁగారణభూతుండయ్యును నిరాకులుండై సచ్చిదా

నంద నిత్య పరిపూర్ణాఖండ పరబ్రహ్మస్వరూపంబున దేవల బ్రహ్మ యొక్కఁడుండే వెలుంగుచుండును. దేవలాతిరిక్తంబగునది గించిత్తేనియుఁ గలుగదు.

జట.—సోఽకామయతబహుస్యామితి, దేవలాత్సదాశివోఽ జాయత, దేవలాద్రుద్రోఽజాయత, దేవలాన్నారా యణోఽజాయత, దేవలాద్బ్రహ్మ ఽజాయత, దేవలా త్ప్రాణా అజాయంత, ఖం వాయు ర్జ్యోతి రాపః పృథ్వీ విశ్వా అజాయంత, మనస్సర్వేంద్రియాణిచ, దేవలా ద్ద్వాదశాదిత్యా రుద్రా వసవ స్సర్వాణిఛందాంసి, దేవ లా దేవ సర్వాణి జగంతి సముత్పద్యంతే, దేవలా దేవ ప్రవర్తంతే, దేవలేప్రలీయంతే, ఏవం సర్వాణి ఛం దాంసి వదంతి.

టీక.—సః = నిత్య పరిపూర్ణాఖండ పరబ్రహ్మ స్వరూపుఁ డయిన యీదేవలబ్రహ్మ, బహుస్యా మితి=అనేక రూపంబుల నొందవలయునని, అకామయత=అపేక్షించెను. దేవలాత్ సదాశివః అజాయత = దేవలునివలన సదాశివుండు పుట్టెను. దేవలాత్ రుద్రో అజాయత=దేవలునివలన రుద్రుండు జన్మిం చెను. దేవలాత్ నారాయణః అజాయత=దేవలునివలన నారా యణుండు జనించెను. దేవలాత్ బ్రహ్మఅజాయత = దేవలుని వలన బ్రహ్మ యుత్పన్నుఁ డయ్యెను. దేవలాత్ ప్రాణాః అజా యంత=దేవలునివలనఁ బ్రాణాపాన సమానోదాన వ్యానంబు లనెడు పంచమహాప్రాణంబులు గలిగెను. ఖం వాయుః జ్యోతిః

ఆపః పృథ్వీవిశ్వాః అజాయంత=ఆకాశము వాయువు అగ్ని జలము భూమి సమస్తలోకంబులును జనించినవి. మనః సర్వేంద్రియాణిచ అజాయంత= మనోబుద్ధి చిత్తాహంకారంబు లనెడు నంతఃకరణంబులును త్వక్చక్షు శ్శ్రోత్ర జిహ్వా ఘ్రాణంబు లగు జ్ఞానేంద్రియంబులును వాక్పాణి పాద పాయూపస్థ లనెడు కర్మేంద్రియంబులును బుట్టినవి. దేవలాత్ = దేవలునివలన, ద్వాదశ ఆదిత్యాః = (ఇంద్రుఁడు ధాత పర్జన్యుఁడు త్వష్ట పూషుఁడు అర్యముఁడు భగుఁడు వివస్వంతుఁడు విష్ణువు అంశుమంతుఁడు వరుణుఁడు మిత్రుఁడు అనెడు) పన్నిద్దరు ఆదిత్యులును, రుద్రాః = (అజుఁడు ఏకపాదుఁడు అహిర్బుధ్న్యుఁడు త్వష్ట రుద్రుఁడు హరుఁడు శంభుఁడు త్ర్యంబకుఁడు అపరాజితుఁడు ఈశానుఁడు త్రిభువనుఁడుననెడు నామంబులు గల) ఏకాదశ రుద్రులును, వసవః=(ఆపుఁడు ధ్రువుఁడు సోముఁడు అధ్వరుఁడు అనిలుఁడు ప్రత్యూషుఁడు అనలుఁడు ప్రభాసుఁడు ననెడు పేరులు గల) అష్టవసువులును, సర్వాణి ఛందాంసి = ఋగ్యజుస్సామాథర్వణాదు లగు సమస్తవేదంబులును గలిగినవి. దేవలాత్ ఏవ= దేవలునివలననే, సర్వాణి జగంతి సముత్పద్యంతే = సమస్తంబు లగు జగంబులును నుత్పన్నము లగుచున్నవి. దేవలాత్ ఏవ ప్రవర్తంతే = (ఉత్పన్నము లయిన జగంబు లన్నియు) ఆదేవలునివలననే వర్తించుచున్నవి. దేవలే ప్రలీయంతే = దేవలునియందే లయమొందుచున్నవి. ఏవం సర్వాణి ఛందాంసి వదంతి=ఇట్లని సమస్తంబు లగు వేదంబులును జెప్పుచున్నవి.

తా.— అట్లు దేవలబ్రహ్మ పరిపూర్ణాఖండ పరబ్రహ్మ స్వరూపుఁడయ్యును ననేకరూపంబులతోడ ఖండాత్మకుఁడై విలసిల్లవలయు నని సంకల్పించెను. ఆ దేవలునివలననే సదాశివుం డుద్భవిల్లెను. బ్రహ్మ విష్ణు మహేశ్వరు లగు త్రిమూర్తు లుద్భవించిరి. ప్రాణోపానాది పంచమహాప్రాణంబులును బృథివ్యాది పంచమహాభూతంబులును భూతసంయుతంబు లగు సమస్తలోకంబులును దేవలునివలననే గలిగినవి. మానసాదికంబు లగు నంతఃకరణంబులును త్వగాదిజ్ఞానేంద్రియంబులును వాగాదికర్మేంద్రియంబులును దేవలునివలననే యేర్పడినవి. ఇంద్రాది ద్వాదశాదిత్యులును నజాదు లగు నేకాదశ రుద్రులును నాపాదు లయిన యష్టవసువులును దేవలునిచేతనే యుత్పన్నులయిరి. సమస్తవేదంబులును దేవలునిచేతనే గలిగినవి. జంగమస్థావరాత్మకంబు లయిన సర్వలోకంబులును దేవలునివలననే యుత్పన్నంబులగుచు దేవలునివలననే వర్తిల్లుచు దుదకు నా దేవలునియందే లీనంబు లగుచుండును.— ఇట్లని సర్వవేదంబు లుద్ఘోషించు చున్నవి.

జట.— అథ నిత్యో దేవలః శివో దేవలః. రుద్రశ్చ దేవలః. విష్ణుశ్చ దేవలః. శక్రశ్చ దేవలః. కాలశ్చ దేవలః. దిశశ్చ దేవలః. విదిశశ్చ దేవలః. ఊర్ధ్వంచ దేవలః. అధశ్చ దేవలః. అంతర్బహిశ్చ దేవలః. దేవల ఏ వేదగ్ం సర్వం. య ఏవం వేద సరుద్రోభవతి. స విష్ణుర్భవతి. స బ్రహ్మా భవతి. స పూజ్యో భవతి. స సచ్చిదానందాద్వితీయ బ్రహ్మ భవతి. స సర్వంభవతీతి ప్రథమః ఖండః.

టీక.—అథ = ఇంకను, నిత్యోదేవలః = నిత్యుండు దేవలుండు, శివోదేవలః = సదాశివుండును దేవలుండే, రుద్రశ్చ దేవలః=రుద్రుండును దేవలుండే, విష్ణుశ్చదేవలః = విష్ణువును దేవలుండే, శక్రశ్చదేవలః=ఇంద్రుండును దేవలుఁడే, కాలశ్చ దేవలః=కాలమునకు నుపాధికం బగు స్వరూపము గలవాఁడు దేవలుఁడే, దిశశ్చదేవలః = దిక్కులును దేవలుఁడే, విదిశశ్చ దేవలః = ఉపదిక్కులును దేవలుండే, ఊర్ధ్వంచదేవలః = మీఁదిభాగంబును దేవలుఁడే, అధశ్చదేవలః = క్రిందిభాగంబును దేవలుఁడే, అంతర్బహిశ్చ దేవలః = లోను వెలుపలను దేవలుండే, ఇదం సర్వం దేవలఏవ = ఈ సమస్తంబును దేవలుండే, ఏవం యః వేద = ఈ విధంబుగ నెవ్వఁ డెఱుఁగునో, సః రుద్రో భవతి=అతండు రుద్రుఁ డగుచున్నాఁడు. సః విష్ణుః భవతి = అతఁడు విష్ణు వగుచున్నాఁడు. సః బ్రహ్మా భవతి = ఆతఁడు బ్రహ్మ యగుచున్నాఁడు. సః పూజ్యో భవతి= ఆతఁడు పూజనీయుఁ డగుచున్నాఁడు. సః సచ్చిదానంద అద్వితీయ బ్రహ్మ భవతి = అతండు శక్తిజ్ఞానానందములచేత సామ్యంబు లేని పరబ్రహ్మమే యగుచున్నాఁడు. సః సర్వం భవతి = ఆతఁడే సర్వంబు నగుచున్నాఁడు. ఇతి ప్రథమః ఖండః=ఇట్లని దేవలోపనిషత్తునందలి మొదటిభాగము.

తా.—ఆ దేవలుండే నిత్యుండు. సదాశివుండును దేవలుండే. బ్రహ్మ విష్ణు మహేశ్వరాత్మకుఁడును దేవలుండే. ఇంద్రాది దిక్పాలురును దిక్కులును విదిక్కులును దేవలుండే.

కాలోపాధిక స్వరూపుఁడును దేవలుఁడే. అధోర్ధ్వభాగ బాహ్యాంత రాభ్యంతరంబులును దేవలుఁడే. ఈ సమస్తంబును దేవలాత్మకమే. ఈ నిశ్చయార్థంబు నెవ్వఁ డెఱుంగునో యాతఁడే రుద్రుండును నాతఁడే విష్ణువును నాతఁడే బ్రహ్మదేవుండును నగును. సర్వలోకైక పూజితుఁడును నాతఁడే. అట్టివాఁడే సచ్చిదానంద పరిపూర్ణాద్వితీయ పరబ్రహ్మంబుగఁ దేజరిల్లును. సమస్తంబును నాతఁడేయగుచున్నాఁడు. ఇట్లు దేవలోపనిషత్తునందలి ప్రథమభాగము.

ద్వితీయఖండః—స ఖలు జగత్స్రిష్టుకామస్స్వమాయయా రజస్సత్త్వతమోగుణైః క్రమాద్బ్రహ్మ విష్ణు రుద్రాన్ అసృజత్. అనంతరం త్రిమూర్త్యధిష్ఠానభూతం సకల జగత్కారణం సదాశివ మసృజత్. స్వస్య సర్వం తేజశ్శివే ప్రతిష్ఠాప్య సోఽద్వితీయానందస్వరూపో దేవలశ్శివసహస్రారకమలం ప్రావిశత్. అథ సూత్రవస్త్రహీనై ర్బ్రహ్మాదిభి స్సంప్రార్థిత శ్శివః స్వసహస్రారమధ్యగతం జ్యోతిస్స్వరూపం దేవలం ప్రార్థయామాస. తదా దేవలో ఽవిద్యాధిష్ఠిత స్సన్ మూర్తి మాశ్రిత్య బ్రహ్మాదీనాం సూత్రవస్త్రా దత్వా శివసహస్రారం ప్రావిశత్.

టీక.—సః=ఆదేవలబ్రహ్మ, జగత్ స్రష్టుకామః= జగంబుల సృజింపఁ గోరినవాఁడై, స్వమాయయా = తన మాయవలన, రజస్సత్త్వతమోగుణైః = రజోగుణ సత్త్వగుణ తమోగుణంబులచేత, క్రమాత్ = క్రమంబుగ, బ్రహ్మవిష్ణురుద్రాన్ = బ్రహ్మ విష్ణు మహేశ్వరులను, అసృజత్ ఖలు = సృజించెను

సుమా! అనంతరం = పిమ్మట, త్రిమూర్తి అధిష్ఠానభూతం= త్రిమూర్తులకు నాశ్రయభూతుండును, సకలజగత్కారణం= సమస్తలోకంబులకుఁ గారణుండును నగు, సదాశివం = సదాశివుని, అసృజత్ =సృజించెను. సః దేవలః=ఆదేలుండు, స్వస్య సర్వం తేజః= తనయొక్క తేజస్సునంతయును, శివే ప్రతిష్ఠాప్య= సదాశివునియందుఁ బ్రతిష్ఠించి, అద్వితీయానందస్వరూపః = అఖండపరిపూర్ణానందస్వరూపుఁ డగుచు, శివసహస్రారకమలం ప్రావిశత్ = సదాశివుని సహస్రారకమలంబునఁ బ్రవేశించెను. అథ = పిమ్మట, శివః = సదాశివుండు, సూత్రవస్త్రహీనైః బ్రహ్మాదిభిః = సూత్ర వస్త్రములు లేనివారగు బ్రహ్మాదులచేత, సంప్రార్థితః = మిక్కిలియుఁ బ్రార్థింపఁబడినవాఁ డగుచు, స్వసహస్రార మధ్యగతం = తన సహస్రార కమలముయొక్క మధ్యమున నుండువాఁడును, జ్యోతిస్స్వరూపం = జ్యోతిస్వరూపుఁడును నగు, దేవలం = దేవలబ్రహ్మను, ప్రార్థయామాస = ప్రార్థించెను. తదా = అపుడు, దేవలః = దేవలుండు, అవిద్యా అధిష్ఠితస్సన్ = తనయొక్క యోగమాయతోఁ గూడినవాఁడగుచు,మూర్తిం ఆశ్రిత్య=శరీరంబును బొంది, బ్రహ్మాదీనాం సూత్రవస్త్రం దత్వా=బ్రహ్మవిష్ణుమహేశ్వరసదాశివులకు సూత్రవస్త్రంబుల నొసంగి, శివసహస్రారం ప్రావిశత్ =సదాశివుని సహస్రారకమలంబునఁ బ్రవేశించెను.

తా.—అట్టి సచ్చిదానందాఽద్వితీయజ్యోతిర్మయుం డగు దేవలుండు నిజమాయచేత రజోగుణంబునఁ జతుర్ముఖుని, సత్త్వ

గుణంబున విష్ణువును, దమోగుణంబున మహేశ్వరుని సృజించెను. పిమ్మట నట్టి త్రిమూర్తులకు నధిష్ఠానభూతుం డగునట్లును సమస్తలోక కారణుండగునట్లును సదాశివుని సృజించెను. అనంతరము తన తేజస్సునంతయు సదాశివునియందుఁ బ్రతిష్ఠించి యా పరమేశ్వరుని సహస్రారపద్మాంతరాళంబుననే యద్వితీయానంద స్వరూపంబుతోడఁ బ్రవేశించెను. తదనంతరము బ్రహ్మాదులు, తమకు వస్త్రసూత్రములు గావలసి సదాశివునిఁ బ్రార్థించఁగా, నాపరమేశ్వరుండు తనయొక్క సహస్రారపద్మాంతరాళంబున జ్యోతిర్మయుండై వెలుంగుచుండెడు దేవలుని ధ్యానించెను. అపుడు దేవలుండు యోగమాయాసమన్వితుండగుచుఁ గరచరణాదికం బగు శరీరంబును దాల్చి యా బ్రహ్మవిష్ణు మహేశ్వర సదాశివులకు సూత్రవస్త్రంబుల నొసంగి యథారీతిని సదాశివ సహస్రార పద్మాంతరాళంబుననే చిజ్జ్యోతిరూపంబుతోడఁ బ్రవేశించెను.

జట.—అథ కదాచి త్సూత్రవస్త్రాభావా ల్లజ్జాహతమానసై ర్దేవై స్సంప్రార్థిత స్సదాశివ స్స్వ సహస్రారమధ్యంగతం జ్యోతిస్స్వరూపం దేవలం దధ్యౌ. సో ఽపి సదేహో బహిరాగత్యకిమర్థం మత్ప్రార్థనాపరోభవే రితివదంతం జగదధిష్ఠానభూతం దేవలం ప్రతి పరమేశ్వ రోత్యంత భక్తిపూర్వకంప్రాహ. దేవ త్వంసకలజగత్కారణభూతః త్వచ్ఛక్త్యా బ్రహ్మాదయో వయముత్పన్నాః. పురైవ భవ తాస్మాకం సూత్రవస్త్రాదికం దత్తం. ఇదానీం బ్రహ్మణా

త్వదాజ్ఞా ప్రకారేణ సృష్ట జగదంతర్గత దేవ మను యక్ష గంధర్వ కిన్నర కింపురుష గుహ్యక సిద్ధ సాధ్య విద్యాధరాది స్వర్గలోకవాసినః భూలోకవాసినో మనుష్యాశ్చ సూత్రాభావాత్ కర్మణ్యానధికారిణో వస్త్రాభావా ల్లజ్జా సహితాశ్చ భవంతి. సూత్రవస్త్రనిర్మాణే బ్రహ్మా ప్యశక్తోహి. తస్మాత్సూత్రవస్త్రకర్తారం నిర్మాయ. సర్వదా ఏకం స్వర్గాదిలోకేషు అన్యాక భూలోకే సంస్థాపయేతి-ద్వితీయఖండః.

టీక.—అథ=పిమ్మట, కదాచిత్=ఒకానొకప్పుడు, సూత్ర వస్త్రఅభావాత్=సూత్రములును వస్త్రములును లేకుండుట చేత, లజ్జాహతమానసైః=సిగ్గుచేతఁ గొట్టఁబడిన మానసములు గలవార లగు, దేవైః=దేవతలచేత, సంప్రార్థితః సదాశివః = ప్రార్థింపఁబడినవాఁ డగు సదాశివుండు, స్వ సహస్రారమధ్యం గతం = తన సహస్రారకమలమధ్యమును బొందినవాఁడును, జ్యోతిస్స్వరూపం= జ్యోతిర్మయుండును, ,నగు, దేవలం=దేవలుని, దధ్యౌ=ధ్యానించెను. సః అపి=ఆతండును, సదేహః=శరీరయుక్తుం డగుచు, బహిః ఆగత్య=వెలుపలికి వచ్చి, కిం అర్థం= ఎందుకొఱకు, మత్ ప్రార్థనాపరః భవేః=నన్నుఁ బ్రార్థించినవాఁడ వగుచున్నావు? ఇతి వదంతం=అని యడుగుచున్నవాఁడును, జగత్ అధిష్ఠానభూతం= లోకంబులకు నాధారభూతుండును, నగు, దేవలం ప్రతి=దేవలునిఁ గూర్చి, పరమేశ్వరః= సదాశివుండు, అత్యంతభక్తిపూర్వకం=పరమభక్తి పురస్సరం

బుగ, దేవ=ఓ మహాత్మా! త్వం సకలజగత్కారణభూతః=నీవు సకల లోకంబులకుఁ గారణభూతుండవు. త్వత్ శక్త్యా=నీ యొక్క శక్తిచేత, బ్రహ్మాదయః వయం ఉత్పన్నాః=బ్రహ్మాదుల మగు మేముపుట్టినవారము. పురైవ=మునుపే, అస్మాకం=మాకు, సూత్రవస్త్రాదికం=సూత్రవస్త్రాదులు, భవతా దత్తం=మీచేత నియ్యఁబడెను. ఇదానీం=ఇపుడు, త్వత్ ఆజ్ఞాప్రకారేణ= నీ యొక్కయాజ్ఞాప్రకారము, బ్రహ్మణాసృష్ట=బ్రహ్మదేవునిచేత సృజింపఁబడిన,జగత్ అంతర్గత=లోకములయందుండెడు, దేవమను యక్షగంధర్వ కిన్నరకింపురుష గుహ్యక సిద్ధసాధ్యవిద్యాధరాది స్వర్గలోకవాసినః=దేవతలు మనువులు యక్షులు గంధర్వులు కిన్నరులు కింపురుషులు గుహ్యకులు సిద్ధులు సాధ్యులు విద్యాధరులు మొదలుగాఁగల స్వర్గలోకనివాసులకును, భూలోకవాసినో మనుష్యాశ్చ = భూలోకమున నివసించువారగు మనుష్యులకును, సూత్ర అభావాత్ = యజ్ఞసూత్రములు లేకుండుట వలన, కర్మణి అనధికారిణః = వైదికకర్మాచరణంబున నధికారము లేనివారలుగను, వస్త్ర అభావాత్ = వస్త్రములు లేకుండుటవలన, లజ్జాసహితాశ్చ = సిగ్గుతోఁ గూడినవారలుగను, భవంతి = అగుచున్నారు. సూత్రవస్త్రనిర్మాణే = యజ్ఞోపవీతంబులును వస్త్రంబులును నిర్మించుటయందు, బ్రహ్మాపి అశక్తోహి=బ్రహ్మసయితము శక్తిలేనివాఁడే గదా. తస్మాత్= ఆ కారణముచేత, సూత్రవస్త్రకర్తౄన్ నిర్మాయ = సూత్రవస్త్రకర్తలను నిర్మించి, సర్వదా=ఎల్లప్పుడును, ఏకం స్వర్గాది లోకేషు = ఒక్కరుని స్వర్గాదిలోకంబులయందును, అన్యాన్

భూలోకే = తక్కినవారిని భూలోకమునందును, సంస్థాపయ= నిలుపుము. ఇతిప్రాహ = అని చెప్పెను.

తా.—పిమ్మటఁ గొంతకాలంబునకు దేవతలు, తమకు సూత్రవస్త్రములు లేకుండుటచేత లజ్జాహతమనస్కు లగుచు సదా శివునిఁ బ్రార్థించిరి. అప్పు డా మహేశ్వరుండు, తన సహస్రార పద్మాంతరాళంబున జ్యోతిర్మయుండై వెలుంగు చుండెడు దేవలుని ధ్యానించెను. ఆ దేవలుండును శరీర యుక్తుండగుచుఁ బ్రసన్నుండై తన్ను బ్రార్థించినందులకుఁ గారణం బడుగఁగా, సర్వలోకాధారభూతుం డయిన యా దేవలునిఁ గూర్చి యత్యంత భక్తిపూర్వకంబుగ నామహేశ్వరుండు, "ఓ మహాత్మా! నీవు సకలజగత్కారణభూతుండవు. నీయొక్క మాయాశక్తిచేత బ్రహ్మాదుల మయిన మేము జన్మించిన వారము. మునుపే మాకు సూత్రవస్త్రంబుల నొసంగితివి. ఇపుడు, నీయొక్క యాజ్ఞానుసారంబుగ బ్రహ్మచే నిర్మితంబు లయిన లోకంబులయందలి దేవ మను యక్ష గంధర్వ కిన్నర కింపురుష గుహ్యక సిద్ధ సాధ్య విద్యాధరాదులగు స్వర్గ లోకనివాసులును భూలోకవాసు లయిన మనుష్యులును యజ్ఞ సూత్రంబులు లేకుండుటచేతఁదమతమ వైదికకర్మాచరణంబుల యందు నధికారము లేనివారలై యున్నారు. మఱియును వస్త్రంబులు లేకుండుటచేత మిక్కిలియు సిగ్గు పొందుచున్నారు. బ్రహ్మదేవుం డన్ననో, సర్వలోక నిర్మాణంబున శక్తిగలవాఁడే యయ్యును సూత్రవస్త్ర నిర్మాణంబున శక్తిలేనివాఁడే గదా

కాఁబట్టి సూత్రవస్త్రకర్తలను గొందఱను నిర్మించి వారలలో నొక్కరుని స్థిరంబుగ స్వర్గాదియూర్ధ్వలోకంబులకును దక్కిన వారిని భూలోకంబునకును నిర్ణయము సేయుము" అని ప్రార్థించెను.—ఇట్లు దేవలోపనిషత్తునందలి ద్వితీయభాగము.

తృతీయఖండః.—అథ నిరంజనస్వరూపో దేవల ఉవాచ శివం. త్వ దిచ్ఛానుసారేణ మదంశసంయుత మేకం పురుషం సృజామి. సతు దేవతాకార్యం కరోతి. తద్వంశీయాః మనుష్యకార్యం కుర్వంతు. సతు దేవాంగ నామ్నా ప్రసిద్ధస్సన్ త్వ దాజ్ఞా ధారకోభూత్వా త్వ ద్భక్తి విశిష్టో వర్తత. ఇత్యంతర్ధాత్. తతో మహాదేవాంగాత్ కోటిసూర్యప్రభాభాసమాన ఏకః పురుషో ఒజాయత. దేవస్య అంగాత్సంజాతత్వా ద్దేవాంగ ఇతి, సర్వదేవ ప్రార్థనాం లాతీతి తస్య దేవల ఇతిచ నామద్వయ మభూత్. దేవాంగోపి శివం నత్వా ఆజ్ఞాకా భవతీ త్యప్రార్థయత్. శివోపి సర్వేషాం దేవానాం సూత్రవస్త్రాదికం నిర్మాయ, తత్తన్మంత్ర పూర్వకం దేహీ త్యాజ్ఞాపయామాస. శివా జ్ఞానుసారేణ దేవాంగోపి సూత్రవస్త్రా నిర్మాయ దేవేభ్యో దత్వా శివాజ్ఞయా దేవదత్తా ముద్వాహ్య తస్యాం త్రీన్ పుత్రాన్ ఉత్పాదయామాస. తద్వంశీ యైవ అప్రాకృతబ్రాహ్మణాః దేవాంగా ఇతి విశ్రుతాశ్చ భూలోకే తత్ర తత్ర వసంతో వస్త్రసూత్రాదీన్ నిర్మాయ ఉచితవిధానేన సర్వేభ్యో యచ్ఛంతి.

టీక.—అథ = పిమ్మట, నిరంజన స్వరూపో దేవలః = పరిశుద్ధాత్ముఁడగు దేవలుండు, శివం ఉవాచ = పరమేశ్వరునిఁ గూర్చి పలికెను. త్వత్ ఇచ్ఛానుసారేణ = నీయొక్క యిష్టానుసారముగ, మత్ అంశసంయుతం=నాయొక్క యంశముతోఁ గూడినవాఁడగు, ఏకంపురుషం = ఒక్కపురుషుని, సృజామి = సృజించుచున్నాను. సతు=ఆపురుషుఁడు, దేవతా కార్యంకరోతి = దేవతలకార్యమును జేయుచున్నాఁడు. తత్ వంశీయాః = ఆతనివంశస్థులు, మనుష్యకార్యం కుర్వంతు = మనుష్యులకార్యమును జేయుదురు. సతు=ఆ పురుషుఁ డన్ననో దేవాంగనామ్నా ప్రసిద్ధస్సన్ = దేవాంగుఁ డనెడు నామంబుతోడఁ బ్రసిద్ధి నొందినవాఁ డగుచు, త్వత్ ఆజ్ఞాధారకో భూత్వా = నీయాజ్ఞను ధరించినవాఁడై, త్వద్భక్తి విశిష్టో వర్తత=నీయందు భక్తిగలవాఁ డగుచుండును. ఇతిఅంతర్ధాత్ = అని చెప్పి యంతర్ధాన మొందెను. తతః=పిమ్మట, మహాదేవ అంగాత్ =పరమేశ్వరుని యంగమునుండి, కోటిసూర్యప్రభా భాసమానః = కోటిసూర్యుల ప్రకాశముతో వెలుంగువాఁ డగు, ఏకః పురుషః = ఒక్కపురుషుఁడు, అజాయత = పుట్టెను. దేవస్య అంగాత్ సంజాతత్వాత్ = దేవునియొక్క యంగంబు వలనఁ బుట్టుటంజేసి, దేవాంగః ఇతి = దేవాంగుఁ డనియును, సర్వదేవప్రార్థనాం లాతీతి = సమస్త దేవతల యొక్క ప్రార్థనల లాలించుటంజేసి, దేవలఇతిచ= దేవలుం డనియును, తస్య=అతనికి, నామద్వయంఅభూత్ = రెండు పేరులు గలిగెను. దేవాంగోపి=దేవాంగుఁడును, శివంనత్వా=పరశివునకు

నమస్కరించి, కా ఆజ్ఞాభవతి=ఏమి యుత్తరువగుచున్నది? ఇతి అప్రార్థయత్ =అని ప్రార్థించెను. శివోపి=పరశివుండును, సర్వే షాం దేవానాం = దేవతలకందఱకును, సూత్రవస్త్రాదికం నిర్మా య = సూత్రవస్త్రంబులను నిర్మించి, తత్తన్మంత్రపూర్వకం= ఆయామంత్రపూర్వకముగ, దేహి = ఇమ్ము. ఇతి ఆజ్ఞాపయా మాస = అని యాజ్ఞాపించెను. శివాజ్ఞానుసారేణ = పరశివుని యాజ్ఞానుసారంబుగ, దేవాంగోపి = దేవాంగుఁడును, సూత్ర వస్త్రాణినిర్మాయ = సూత్రములను వస్త్రములను నిర్మించి, దేవే భ్యోదత్వా = దేవతలకునొసంగి, శివాజ్ఞయా = పరమేశ్వరుని యాజ్ఞచేత, దేవదత్తాం ఉద్వాహ్య = దేవదత్తను బెండ్లాడి, తస్యాం = ఆమెయందు, త్రీన్ పుత్రాన్ ఉత్పాదయామాస= ముగ్వురుకుమారులనుగలిగించెను. తద్వంశీయైవ=ఆవంశస్థులే, అప్రాకృతబ్రాహ్మణాః = అప్రాకృతబ్రాహ్మణులును, దేవాంగా ఇతి విశ్రుతాశ్చ=దేవాంగులని ప్రసిద్ధికెక్కినవారును. భూలోకే తత్ర తత్రవసంతః = భూలోకంబున నచ్చటచ్చటను వాసము చేయువారలగుచు, వస్త్రసూత్రాదీన్ నిర్మాయ= వస్త్రసూత్రా దులను నిర్మించి, ఉచితవిధానేన = తగినవిధంబుగ, సర్వేభ్యో యచ్ఛంతి = అందఱకు నిచ్చుచున్నారు.

తా.—తదనంతరము నిరంజనాత్మకుఁడయిన యా దేవ లుండు పరమేశ్వరునిఁ గూర్చి, "నీయిష్టానుసారంబుగ నా యంశతోఁ గూడిన యొక్క మహాపూరుషుని సృజించె దను. ఆ పురుషుండు దేవతాకార్యంబు నొనర్చు చుండును.

ఆతని వంశస్థులు మనుష్యకార్యంబును గావించుచుందురు. ఆపురుషుండు "దేవాంగుఁడు" అనెడు నామంబుతోడఁ బ్రసిద్ధి వహించి నీయాజ్ఞను శిరసావహించి నీయందు భక్తి గలవాఁ డగుచు మెలంగుచుండును." అని చెప్పి యంతర్ధాన మొందెను. పిమ్మట నామహాదేవుని యంగంబునుండి కోటి సూర్యప్రకాశంబుతోఁ దేజరిల్లెడు నొక్క దివ్యపూరుషుం డుద్భవించెను. దేవునియొక్క యంగంబువలనఁ బుట్టుటచేత దేవాంగుఁడనియును, దేవతల ప్రార్థనలను లాలించుటచేత దేవలుం డనియును నాతనికి రెండునామంబులు గలిగెను. ఆ దేవాంగుఁడు పరమేశ్వరునకు నమస్కరించి "ఓ ప్రభూ! ఏమని నాకు నాజ్ఞాపించుచున్నారు."—అని ప్రార్థించెను. అప్పు డాపరమేశ్వరుం డాతనిఁ గూర్చి "నీవు సూత్రవస్త్రంబులను నిర్మించి యాయామంత్రపూర్వకంబుగ దేవతల కందఱకు నొసంగుము" అని యాజ్ఞాపించెను. పరమేశ్వరుని యాజ్ఞాను సారంబుగ నా దేవాంగుఁడును సూత్రవస్త్రముల నిర్మించి దేవతలకు నొసంగి, యా మహేశ్వరుని యుత్తరువుచేత దేవదత్తను వివాహము చేసికొని యామెయందు ముగ్గురు కుమారులను బడెసెను. వారి వంశస్థులే యప్రాకృతబ్రాహ్మణు లనియును దేవాంగు లనియును బ్రసిద్ధి కెక్కినవారలై భూలోకంబున నచ్చటచ్చటను వాసము చేయుచు వస్త్రసూత్రాదులను నిర్మించి యెవ్వ రెవ్వరికి నేదేది తగునో యావిధంబుగ నందఱకు నొసంగుచున్నారు.

జట.—స దేవలో నిత్య శ్శుద్ధో నిరంజనో నిరామయో నిరాకులో నిర్గుణో నిరుపాధిక స్సచ్చిదానందస్వరూపో ఽద్వితీయపరబ్రహ్మస్వరూప ఇతి మంతవ్యః. దేవలోపనిషదం యో ఽధీతే సదేవపూజ్యో భవతి. సురాపానా త్పూతో భవతి. స్వర్ణస్తేయా త్పూతో భవతి. బ్రహ్మహత్యా త్పూతో భవతి. కృత్యాకృత్యా త్పూతో భవతి. అగమ్య గమనా త్పూతో భవతి. స సర్వాన్ వేదా నధీతో భవతి. సశుద్ధో భవతి. న స పున రావర్తతే. న స పునరావర్తతే. న స పున రావర్తతే. ఇత్యుపనిషత్.

టీక.—సః దేవలః = ఆ దేవలుండు, నిత్యః = శాశ్వతుఁడు, శుద్ధః=నిర్మలుఁడు, నిరంజనః=దోషరహితుఁడు, నిరామయః= మాయ లేనివాఁడు, నిరాకులః = వికల్పము లేనివాఁడు, నిర్గుణః = గుణరహితుఁడు, నిరుపాధికః = కృత్రిమలోభాదికంబులు లేనివాఁడు, సచ్చిదానందస్వరూపః = శక్తి జ్ఞానానంద స్వరూపుఁడు. అద్వితీయః = తనకంటెను నన్యము లేనివాఁడు. పరబ్రహ్మస్వరూపః = పరమాత్మస్వరూపుఁడు. ఇతి మంతవ్యః= అని యెఱుంగఁ దగినవాఁడు. యః=ఎవ్వాఁడు దేవలోపనిషదం అధీతే=దేవలోపనిషత్తును జదువుచున్నాఁడో, సః=అతఁడు, దేవపూజ్యోభవతి=దేవతలచేతఁ బూజింపఁబడినవాఁ డగుచున్నాఁడు. సురాపానాత్ పూతోభవతి = కల్లు ద్రాగుటవలని పాతకమునుండి పరిశుద్ధుం డగుచున్నాఁడు, స్వర్ణ

స్తేయాత్ పూతోభవతి = బంగారము దొంగిలించుట వలని పాతకము నుండి పావనుం డగుచున్నాఁడు. బ్రహ్మహత్యాత్ పూతోభవతి=బ్రహ్మహత్యవలని పాతకమునుండి పవిత్రుఁ డగుచున్నాఁడు. కృత్య అకృత్యాత్ పూతో భవతి= చేయవలసిన సత్కర్మంబుల నాచరింపమిచేఁ గలుగు పాతకంబులనుండి పావనుం డగుచున్నాఁడు. అగమ్యగమనాత్ పూతోభవతి= పొందఁ గూడని దానిం బొందుట వలనఁ గలుగు దోషము నుండి పరిశుద్ధుం డగుచున్నాఁడు. సః సర్వాన్ వేదాన్ అధీతః భవతి=ఆతఁడే సమస్తవేదంబుల నధ్యయనము చేసినవాఁ డగుచున్నాఁడు. సః శుద్ధోభవతి = ఆతఁడే పరిశుద్ధుఁ డగుచున్నాఁడు. సః నపునః ఆవర్తత—సః నపునరావర్తతే—సః నపునరావర్తతి=అట్టివాఁడు లోకంబున నెన్నటికిని జనన మరణాదికంబుల నెంతమాత్రమును దగులువడఁడు—ముమ్మాటికిని జిక్కులఁ దగులువడనే జాలఁడు. ఇతిఉపనిషత్=అని దేవలోపనిషత్తు ఘోషించుచున్నది.

తా.—ఆ దేవలుండు నిత్యనిరంజననిర్వికల్ప నిర్గుణ నిరామయాదిక లక్షణ లక్షితుండగుచు శక్తిజ్ఞానానందస్వరూపంబుతోడ నఖండాద్వితీయ పరబ్రహ్మంబై వెలుంగువాఁ డని యెఱుంగఁ దగినవాఁడు. ఈ దేవలోపనిషత్తును సమాహితచిత్తంబుతోడ నధ్యయనము సేయువాఁడు దేవపూజ్యుండై విలసిల్లును. స్వర్ణస్తేయ సురాపాన బ్రహ్మహత్యాది మహాపాతకములనుండి విముక్తుండై పరిశుద్ధుం డగును. కృత్యాకృత్యాం

బుల వలనను నగమ్యాగమనాదుల వలనను గలుగు పాతకంబుల నుండి విమోచనుం డగును. మఱియు నాతండు నిత్యనిర్మలుండై సమస్త వేదంబుల నధ్యయనము చేసినంతటివాఁ డగును. అట్టి వాఁడు లోకంబున నెన్నటికి జననమరణాదికంబు లగు సంకులంబులఁ దగులుపడఁజాలఁ డని ముమ్మాటికి దేవలోపనిషత్తు బాహాటంబుగ నుద్ఘోషించు చున్నది.

దేవలోపనిషత్తు తృతీయభాగము సర్వంబును సంపూర్ణము.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

---

## శ్రీ దేవాంగ సప్తావతార కాల నిరూపిత బ్రహ్మాండపురాణోక్తమ్.

---

శ్లో.—నభస్త్రయంచ వసవో నేత్రర్షి శశినో గతాః
శ్వేతవారాహ కల్పాద్య సంధౌ కృతయుగాబ్దకాః
చత్వారి సురవర్త్మాని తర్కాంక నయనేందవః
మహాయుగ త్రయస్యే మే దీక్షా స్సంవత్సరా గతాః
తథా కృతయుగాబ్దాశ్చ చతుర్థాతు మహాయుగే
త్రిశ్శూన్యం వసవో నేత్ర సాగర శ్శశినో గతాః
త్రేతాది మార్థే త్రిశ్శూన్యం వసు వేదర్తవో గతాః
శూన్యత్రయం వేదతర్క శూన్య సప్తేందవ స్సమాః
సర్జనాత్ ప్రాక్ జగత్సృష్టు స్తపతో వత్సరా ఇమే
కల్పాబ్ద పిండాత్తే త్యాజ్యాః శేషా స్సృష్ట్యాదివత్సరాః

తతో పరార్థే త్రేతాయాః సర్జనారంభ ఉచ్యతే
గ్రహర్క్షదేవదైత్యాది ప్రకృతో ఽస్య చరాచరం
కల్పకల్పాంతరే ష్వేవం ప్రపంచేతు ప్రకాశితాః
సదా సాయుజ్య పీఠాఢ్యో సహస్రారాంతర స్థితః
దేవాంగః ప్రథమా సృష్టిః శంకరస్య మహాత్మనః
విద్యాధరో ద్వాపరాదౌ మధ్యే ఽభూత్పుష్పదంతకః
అంతే ఽవతీరో బేతాళః కలౌ వరరుచి స్తథా
చిత్రయోగీ దేవశాలీ దేవదాసో ఽభవం స్తతః
జాతే శుక్లే పూర్ణిమాయాం మూర్జే విద్యాధ రోద్భవః
పుష్పదంతోద్భవ శ్చైవ పంచమ్యా మశ్వయుక్ సితే
పూర్ణిమాయాం సితే రాధే బేతాళస్య సముద్భవః
మార్గే శుక్ల దశమ్యాంతు జాతో వరరుచి స్తథా
దశమ్యా శుక్లనభసీ చిత్రయోగి సముద్భవః
మాఘే శుక్లే హారితిథౌ దేవశాలి సముద్భవః
దేవదా సోద్భవ శ్శుక్ల పంచమ్యాం మధుమాసకే
సప్తావతారా ఏతే వై దేవాంగ బ్రహ్మణ స్మృతాః.

టీక.— శ్వేతవారాహకల్పాద్యసంధౌ = శ్వేతవారాహకల్పముయొక్క మొదటిసంధియందు, కృతయుగ అబ్దకాః = కృతయుగముతోఁజేరిన సంవత్సరములు, నభత్రయంచ వసవో నేత్రఋషిశశినః = మూఁడుసున్నలును నెనిమిదియు రెండును నేడును నొక్కటియు నగు పదునేడులక్షల యిరువదియెనిమిది వేలు, గతాః = చెల్లినవి. మహాయుగత్రయస్య = మూఁడుమహా

యుగములకు, చత్వారి సురవర్త్మానితర్క అంకనయనఇందవః = నాలుగుసున్నలునునాలును దొమ్మిదియు రెండును నొక్కటియు నగు కోటియు నిరువదితొమ్మిదిలక్షుల యెనుబది వేలు గల, ఇమే దీర్ఘాః సంవత్సరాః = ఈ దీర్ఘము లగు సంవత్సరములు, గతాః = గతించినవి. తథాచ = అట్టులే, చతుర్థంతు మహాయుగే = నాలుగవమహాయుగంబున, కృతయుగాబ్దాః = కృతయుగసంవత్సరములు, త్రిశూన్యాన్యం వసవో నేత్రసాగరశ్శశినః = మూఁడుసున్నలును నెనిమిదియు రెండును నేడును నొక్కటియు నగు పదునేడులక్షుల యిరువది యెనిమిది వేలు, గతాః = కడచినవి. త్రేతా ఆదిమఅర్ధే = త్రేతాయుగము యొక్క మొదటి సగమునందు, త్రిశూన్యాన్యం వసు వేదబుతవః = మూఁడుసున్నలును నెనిమిదియు నాలుగును నాఱును నగు నాఱులక్షుల నలువది యెనిమిది వేల సంవత్సరములు, గతాః = గతించినవి. శూన్యత్రయం వేదతర్క శూన్యసప్త ఇందవః సమాః = (మొత్తమునకు) మూఁడుసున్నలును నాలుగును నాఱును నొక్కసున్నయును నేడును నొక్కటియు నగు కోటియు డెబ్బదిలక్షుల యరువదినాలుగు వేల సంవత్సరములు. ఇమే = ఈ సంవత్సరములు, జగత్ స్రష్టుః = లోకసృష్టికర్తయగు బ్రహ్మదేవుఁడు, సర్జనాత్ ప్రాక్ = సృష్టికిఁ బూర్వము, తపతః వత్సరాః = ఆలోచనమునం దుండిన సంవత్సరములు. కల్పాబ్దపిండాత్ తే త్యాజ్యాః = ఇవి కల్పాబ్దపిండమునుండి తీయఁబడినవియై, శేషాః = మిగిలినవి, సృష్టి ఆదివత్సరాః = సృష్టికి నారంభ మగు సంవత్సరంబులు. తతః = ఆ కారణము

చేత, త్రేతాయాః పరార్ధే = త్రేతాయుగముయొక్క వెనుకటి యర్ధభాగమున, సర్జన ఆరంభః ఉచ్యతే = సృష్టికి నారంభము చెప్పఁబడు చున్నది. అస్య చరాచరం = ఈ జంగమస్థావరములతోఁ గూడిన ప్రపంచము, గ్రహ ఋక్ష దేవ దైత్య ఆది ప్రక్షతః = గ్రహములు నక్షత్రములు దేవతలు రాక్షసులు మొదలగునదిగా సృజింపఁబడెను. ఏవం=ఈ విధముగనే, ప్రపంచేతు= సర్వప్రపంచములును, కల్పకల్పాంతరేషు = ప్రతికల్పకల్పాంతరములందును, ప్రకాశితాః=వెలుంగఁబడును. సదా సాయుజ్య పీఠాధ్యః = సాయుజ్యపీఠంబునకు నిత్యాధినాథుండును, సహస్రార అంతరస్థితః = సహస్రార పద్మాంతరమున నుండువాఁడును, మహాత్మనః = ప్రభావ సంపన్నుండును నగు, దేవాంగః = దేవాంగుఁడు, శంకరస్య ప్రథమాసృష్టిః = పరశివునియొక్క ప్రథమసృష్టి యగువాఁడు. ద్వాపరఆదౌ విద్యాధరః = ద్వాపరయుగ ప్రారంభమున విద్యాధరుం డవతరించెను. మధ్యే పుష్పదంతకః ఆభూత్ = ద్వాపరయుగ మధ్యకాలంబునఁ బుష్పదంతుం డవతరించెను. అంతే బేతాళః అవతీరః = ద్వాపరయుగముయొక్క యంత్యమున బేతాళుం డవతరించెను. కలౌ = కలియుగంబున, వరరుచిః = వరరుచియును, తథా=అట్టులే, తతః =పిమ్మట, చిత్రయోగీ దేవశాలీ దేవదాసః = చిత్రయోగియును దేవశాలియును దేవదాసుఁడును ననువారు, అభవం=అవతరించిరి. ఊర్జే శుక్లే పూర్ణిమాయాం = కార్తికమాసంబున శుద్ధపూర్ణిమయందు,

విద్యాధరః ఉద్భవః జాతే = విద్యాధరుని యవతారము కలిగెను. అశ్వయుక్ సితేపంచమ్యాం = ఆశ్వయుజమాసంబున శుద్ధపంచమియందు, పుష్పదంతశ్చ ఉద్భవః = పుష్పదంతునియొక్క యుద్భవము గలిగెను. రాధే సితే పూర్ణిమాయాం = వైశాఖమాసంబున శుద్ధపూర్ణిమయందు, బేతాళస్యసముద్భవః=బేతాళునియొక్క యవతారము.తథా= అట్లులే, మార్గేశుక్లదశమ్యాంతు = మార్గశిరమాసంబున శుద్ధదశమియందు, వరరుచిః జాతః = వరరుచి జన్మించెను. నభసీ శుక్లదశమ్యాం=శ్రావణశుద్ధదశమియందు, చిత్రయోగి సముద్భవః = చిత్రయోగి జననమందెను. మాఘేశుక్లే హారితిథౌ = మాఘమాసంబున శుద్ధఏకాదశియందు, దేవశాలిసముద్భవః = దేవశాలి జన్మించెను. మధుమాసకే శుక్లపంచమ్యాం=చైత్రమాసంబున శుద్ధపంచమియందు, దేవదాసోద్భవః = దేవదాసునియొక్క జననము. దేవాంగబ్రహ్మణః= దేవాంగబ్రహ్మయొక్క,ఏతేవైసప్తావతారాః =ఈవిధంబు లగు సప్తావతారంబులు, స్మృతాః = తెలుపఁబడినవి.

తా._శ్వేతవారాహ కల్పాది సంధియందు గత మయిన కృతయుగ సంవత్సరములు పదునేడులక్షల యిరువదియెనిమిది వేలును, మూఁడు మహాయుగములకును గడచిన సంవత్సరంబులు కోటియు నిరువది తొమ్మిదిలక్షల యిరువదివేలును, నాలుగవ మహాయుగంబునఁ జెల్లిన కృతయుగసంవత్సరములు పదునేడులక్షల యిరువది యెనిమిదివేలును, త్రేతాయుగంబు

నందుఁ బూర్వార్థమునఁ జెల్లుబడియైన సంవత్సరంబు లాఱు లక్షల నలువది యెనిమిది వేలును, గల మొత్తము, కోటియు డెబ్బదిలక్షల యిరువదినాలుగు వేల సంవత్సరంబుల కాలము సృష్టికర్త యగు పితామహుండు లోకసృష్టికొఱకు నాళో చనము సేయు చుండినకాలము. ఇదియే పితామహుని తపః కాల మనఁబడును. ఈ మొత్తమును కల్పాబ్దపిండసంఖ్యనుండి తీసివేయఁగా శేషించినవియే సృష్ట్యాదిగతసంవత్సరములగును. అట్టి నిరూపణంబువలన త్రేతాయుగముయొక్క యుత్తరార్ధ ప్రారంభముననే లోకసృష్టి యారంభింపఁబడినట్లు నిర్ణయం బగుచున్నది. అనాదిగను ప్రాచీనంబుగను సమస్త జంగమస్థావ రాత్మకముగను నుండి, మహాప్రళయాంతములయందు లీన మయ్యెడు సర్వలోక సముదాయము, మఱల గ్రహనక్షత్ర దేవదానవాదిక సమూహములతోడఁ గల్పితం బగుచుండును. ఈ విధముగనే సమస్త ప్రపంచములు సర్వ కల్ప కల్పాంతర ములయందు నేర్పడుచుండును. అట్లు సృష్టిప్రారంభమయిన త్రేతాయుగోత్తరార్ధకాలమునందే సాక్షాత్ పరశివుండు, తన సహస్రార పద్మాంతరాళంబున సాయుజ్యపీఠాధ్యుండై జ్యోతి రూపంబునఁ దేజరిల్లెడు దేవాంగబ్రహ్మమును సూత్రవస్త్ర నిర్మాణంబునకై సాకారబ్రహ్మంబుఁ గావించెను. ఆ దేవాంగ బ్రహ్మయే లోకోపకారార్థము భూలోకంబున ద్వాపరయుగా రంభమునందు విద్యాధరుండుగను, ద్వాపరయుగమధ్యకాలం బునఁ బుష్పదంతుఁడుగను, ద్వాపరాంతమున బేతాళుండు

గను నవతరించెను. మఱియు నా లోకారాధ్యుండు కలి యుగంబున వరరుచి చిత్రయోగి దేవశాలి దేవదాస నామం బుల నవతరించెను. అట్టి సప్తావతారక్రమంబునఁ గార్తిక మాస శుద్ధపూర్ణిమయందు విద్యాధరుండును, నాశ్వయుజ శుద్ధపంచమియందుఁ బుష్పదంతుఁడును, వైశాఖశుద్ధపూర్ణి మయందు బేతాళుండును, మార్గశిర శుద్ధదశమియందు వర రుచియును, శ్రావణశుద్ధదశమియందుఁ జిత్రయోగియును, మాఘశుక్ల ఏకాదశియందు దేవశాలియుఁ జైత్రశుద్ధపంచమి యందు దేవదాసుండును నుద్భవించిరి. ఇట్లు శ్రీదేవాంగబ్రహ్మ యొక్క సప్తావతారకాలనిర్ణయంబు ప్రపంచంబునఁ బ్రకీర్తి తం బగుచుండును.—అని బ్రహ్మాండపురాణంబున శ్రీదేవాంగ సప్తావతార కాల నిర్ణ యోపాఖ్యాన నిరూపితము.

సప్తావతారనిర్ణయ వేదసారోపనిషత్ ప్రమాణము.

జట.—నిరతిశయ గుణగరిష్ఠ శ్శాండిల్యో నిఖిల జగన్నిర్మాణ కారణం చతురాననం పరి స మేత్యోవాచ. అధీహి భగవన్ దేవాంగ సప్తావతారస్వరూపం యద్య దవ తారే యద్య త్కృతం త త్సర్వం సమగ్రేణేతి. సహో వాచ పితామహశ్చ. ఈశాన స్సర్వవిద్యానా మితి శివోహి సకల విద్యాధీశ్వరత్వేన విద్యమానత్వాత్, భూలోకే విద్యా ప్రాచుర్యార్థం దేవాంగం సప్తావ తారం భూమౌ జన్మ ప్రాప్నుహీతి ఆజ్ఞాం దత్తవాన్. త జ్జన్మకారణ వృత్తాంతస్తు సామవేదాంతర్గత చతురధి

కాశీతిశతతమశాఖీయ ధర్మతత్త్వోపనిషదిస్పష్టం తదా దేవాంగో విద్యాధరాది సప్తస్వరూపైః భూమా వవతీర్య సకలముని పూజితస్సన్ కాంశ్చిత్ గ్రంథాన్ చకార.

టీక.—నిరతిశయ గుణగరిష్ఠః శాండిల్యః = అనుపమానం బగు సద్గుణములచేత నధికుం డగు శాండిల్యుండు, నిఖిల జగత్ నిర్మాణకారణం చతురాననం = సకల జగంబులకు నుత్పత్తికారణుం డయిన బ్రహ్మదేవుని, పరిసమేత్య = సమీపించి, భగవన్ = ఓస్వామీ! దేవాంగసప్తావతార స్వరూపం= దేవాంగుఁ డవతరించిన యే డవతారంబులయొక్క లక్షణంబును, యత్ యత్ అవతారే = ఏయే యవతారమునందు, యత్ యత్ కృతం = ఏదేది చేయఁబడుటయున్న, తత్ సర్వం = దానినంతయును, సమగ్రేణఅధీహి = సంపూర్ణముగఁ జెప్పుము, ఇతి ఉవాచ = అని పలికెను. సః పితామహశ్చ = ఆ బ్రహ్మయును, ఉవాచ = చెప్పెను. ఈశానః సర్వవిద్యానాం ఇతి = "ఈశ్వరుండు సకలవిద్యాధినాథుఁడు" అనెడు ప్రమాణమువలన, శివోహి = శంకరుఁడే, సకలవిద్యాధీశ్వరత్వేన = సకలవిద్యలకు నధినాయకుం డగుటతోడ, విద్యమానత్వాత్ = ఉండుటచేత, భూలోకే విద్యా ప్రాచుర్యార్థం = భూలోకంబున విద్య వ్యాపించుటకొఱకు, దేవాంగం = దేవాంగునిఁ గూర్చి, భూవమా = భూమియందు, సప్తావతారం = ఏడవతారములచేత, జన్మప్రాప్నుహి = జన

నము నొందుము, ఇతి ఆజ్ఞాం దత్తవాన్ = అని యాజ్ఞయొసంగెను. తత్ జన్మకారణవృత్తాంతస్తు= అట్టి జన్మములకుఁ గారణమైన వృత్తాంతము, సామవేద అంతర్గత=సామవేదమునందలి, చతురధికఅశీతిశతతమశాఖీయ = నూటయెనుబదినాలుగవ శాఖతోఁ జేరిన, ధర్మతత్త్వోపనిషది = ధర్మతత్త్వోపనిషత్తునందు, స్పష్టం = వెల్లడియై యున్నది. తదా = అపుడు, దేవాంగః = దేవాంగుఁడు, విద్యాధరాది సప్తస్వరూపైః= విద్యాధరుఁడు మొదలుగాఁ గల యేడురూపంబులతోడ, భూమౌ అవతీర్య = భూమియందు నవతరించి, సకల ముని పూజితస్సన్=సకల మునులచేతఁ బూజింపఁ బడినవాఁడగుచు, కాంశ్చిత్ గ్రంథాన్ చకార=కొన్నిగ్రంథములను రచించెను.

తా.— పూర్వము, నిరుపమాన సద్గుణవరిష్ఠుం డయిన శాండిల్యమునీంద్రుండు, సకలలోకనిర్మాణకారణుండగు పరమేష్ఠిని సమీపించి, "ఓ స్వామీ! దేవాంగునియొక్క సప్తావతార స్వరూపంబును దెలియఁ గోరినాఁడను. ఆతఁడు ఏయే యవతారంబున నేయే కార్యములఁ జేసెనో దానినంతయు సమగ్రంబుగ నాకు నెఱింగింపుఁడు"— అని ప్రార్థించెను. అపుడు పితామహుండు శాండిల్యున కిట్లనియె. "ఓ మునీంద్రా! "ఈశాన స్సర్వ విద్యానామ్"— అనెడు ప్రమాణంబును బట్టి సాక్షాత్ మహేశ్వరుండే సకలవిద్యలకు నధీశ్వరుండని తెలియుచున్నది గదా! అట్టి పరమేశ్వరుండు సమస్తవిద్యలను భూలోకంబున వ్యాపింపఁజేయు తలంపుఁ గొని, యా కార్యము నెఱ

వేర్పుటకై దేవాంగునకు సప్తావతారంబులచేత భూలోకంబున
జన్మించునట్లుగ నుత్తరు వొసంగెను. ఈ దేవాంగ జన్మకారణ
వృత్తాంతముసామవేదమున నూటయెనుబదినాలుగవశాఖలోఁ
జేరిన ధర్మతత్త్వోపనిషత్తునందు స్పష్టముగాఁ దెలియవచ్చు
చున్నది. అట్లు పరమేశ్వరుని యాజ్ఞానుసారంబుగ దేవాం
గుండు, భూలోకంబున విద్యాధర పుష్పదంత బేతాళ వరరుచి
చిత్రయోగి దేవశాలి దేవదాస నామంబులతోడ సప్తావ
తారంబులు వహించి సకలమునిగణపూజితుండగుచు నాయా
యవతారానుగుణంబుగఁ గొన్ని కొన్ని గ్రంథంబులు రచి
యించెను. ఆ గ్రంథవివరణముఁ దెలియఁ జేసెద వినుము."

శ్లో.—ఋగ్భాష్యం మనుసూత్రం సంధ్యాసూత్రంమనుస్మృతిం
దేవలోపనిధిం దేవరాజఛంద స్తథైవచ
వాదం దేవలజైమిన్యోః వర్ణాశ్రమమహోదధిం
బ్రహ్మసూత్రనిఘంటుంచ మనుజ్ఞానశిఖామణిం
చకార దశ చైతాని విద్యాధర మహామునిః.

తా.— దేవాంగమనువు విద్యాధ రావతారంబునందు,
ఋగ్వేదభాష్యము మానవధర్మసూత్రము సంధ్యాసూత్రము
మనుస్మృతి దేవలోపనిధి దేవరాజఛందస్సు దేవలజైమినిసంవా
దము వర్ణాశ్రమ మహోదధి బ్రహ్మసూత్రనిఘంటువు మను
జ్ఞానశిఖామణి యనెడు పదిగ్రంథములను రచించెను.

శ్లో.—దేవీభాగవతం చైవ దేవరత్నాకర స్తథా
తథా మేరుచరిత్రంచ వేదాంతాంకుశ మేవచ

బ్రహ్మోపదేశసిద్ధాంతం దేవరాజసుశేఖరం
సుజ్ఞానదీపికా చాపి మహిమ్నస్తోత్ర మేవచ
తథైవోత్తరమీమాంసా మగ్నిసూక్త మిమే దశ
పుష్పదంతావతారేతు దేవాంగేన వినిర్మితాః.

తా.—దేవాంగుని పుష్పదంతావతారమునందు, దేవీభాగవతము దేవరత్నాకరము మేరుచరిత్రము వేదాంతాంకుశము బ్రహ్మోపదేశసిద్ధాంతము దేవరాజసుశేఖరము సుజ్ఞానదీపికా మహిమ్నస్తోత్రము ఉత్తరమీమాంసా అగ్నిసూక్తము ననెడు ఈ పదిగ్రంథములు విరచితంబు లయ్యెను.

శ్లో.—చతుష్షష్టి కళాసూత్రం ధనుశ్శాస్త్రం తథైవచ
బేతాళపంచతంత్రంచ బేతాళాఖ్యాన మేవచ
భూసూక్తం స్మరశాస్త్రంచ మల్లసాధననిర్ణయం
మహాభైరవసూక్తంచ మంత్రశాస్త్రం తథైవచ
తథా మంత్రనిఘంటుశ్చ బేతాళేన వినిర్మితమ్.

తా.—బేతాళావతారంబునందు, చతుష్షష్టికళాసూత్రము ధనుశ్శాస్త్రము బేతాళపంచతంత్రము బేతాళాఖ్యానము భూసూక్తము స్మరశాస్త్రము మల్లసాధననిర్ణయము మహాభైరవసూక్తము మంత్రశాస్త్రము మంత్రనిఘంటువు ననెడు దశగ్రంథంబులు నిర్మితంబు లయ్యెను.

శ్లో.—సూత్రతత్త్వనిఘంటుశ్చ తథా గణితశాస్త్రకం
తథాచ చంద్రసిద్ధాన్తం సూర్యసిద్ధాన్త మేవచ

త్రిలింగం దత్తమీమాంసాం శ్రుతి షట్సూత్ర నిర్ణయం
కౌముదీ శబ్దశాస్త్రంచ వస్త్వాయు ర్నిర్ణయం తథా
భాగశాస్త్రం యోనితంత్రం పిండోత్పత్తి శ్రుతం తథా
ఛందోజ్ఞం సంధిసూత్రంచ కాణాద న్యాయబోధినీం
నరపింగళి శాస్త్రంచ తథా లక్షణ దర్శనం
స్వరశాస్త్రంచ వేదాంగ మాలాయుర్వేద మేవచ
యేత ద్వింశతి శాస్త్రాణి దేవాంగేనా మితౌజసా
వరరు చ్యవతారేషు నిర్మితాని మహీతలే.

తా.—మహా తేజస్వి యగు దేవాంగమనువుచేత, వరరుచ్యవతారంబున సూత్రతత్త్వనిఘంటువు గణితశాస్త్రము చంద్రసిద్ధాంతము సూర్యసిద్ధాంతము త్రిలింగశాస్త్రము దత్తమీమాంసా శ్రుతిషట్సూత్ర నిర్ణయము కౌముది యనెడు శబ్దశాస్త్రము వస్త్వాయుర్నిర్ణయశాస్త్రము భాగశాస్త్రము యోనితంత్రము పిండోత్పత్తిశాస్త్రము ఛందోజ్ఞము సంధిసూత్రము కాణాదన్యాయబోధిని యను తర్కశాస్త్రము నరపింగళిశాస్త్రము లక్షణదర్శనము స్వరశాస్త్రము వేదాంగమాలా ఆయుర్వేదము ననెడు నిరువది శాస్త్రంబులు నిర్మితంబు లైనవి.

శ్లో.—మనుకల్పం మంత్రశాస్త్రం నిగమాంత మహోదధిం
శ్రీదేవల జయస్తంభం మనుశిల్పం తథైవచ
సద్వేదాంతకుఠారంచ దేవలాఖ్యాన మేవచ
తథా శంభు శిఖాసూత్రం గాయత్రీభాష్య మేవచ

దేవస్మృతిర్యోంకారసూక్తే పంచయజ్ఞవినిర్ణయం
యజ్ఞోపవీతసూక్తంచ సంధ్యాభాష్యం తథైవచ
దేవీమాహాత్మ్యకం చైవ రుద్రభారత మేవచ
గిరిజోద్వాహ మిత్యేతే నిర్మితా శ్చిత్రయోగినామ్.

తా.— దేవాంగమనువు చిత్రయోగినామంబున నవతరించి, మనుకల్పము మంత్రశాస్త్రము నిగమాంత మహోదధి శ్రీదేవలజయస్తంభము మనుశిల్పము సద్వేదాంతకుఠారము దేవలాఖ్యానము శంభుశిఖాసూత్రము గాయత్రీభాష్యము దేవస్మృతి ప్రణవసూక్తము పంచయజ్ఞనిర్ణయము యజ్ఞోపవీతసూక్తము సంధ్యాభాష్యము దేవీమాహాత్మ్యము రుద్రభారతము గిరిజోద్వాహము ననెడు గ్రంథంబులు రచియించెను.

శ్లో.— ప్రామాణ్యవాద స్సుజ్ఞానదీపికా జ్ఞానమంజరీ
సుజ్ఞానరత్నమాలాచ సద్వాదజ్ఞానమంజరీ
పంచశిఖానిర్ణయశ్చ దేవకల్పాత్మదర్పణం
పూర్వాపరప్రయోగశ్చ తథా దేవరహస్యకం
ఏతద్ధి శాస్త్రదశకం సత్కర్మజ్ఞానబోధకం
దేవశాల్యవతారేతు దేవాంగేన వినిర్మితమ్.

తా.— దేవాంగబ్రహ్మ దేవశాలీనామంబున నవతరించి, ప్రామాణ్యవాదము సుజ్ఞానదీపిక జ్ఞానమంజరి సుజ్ఞానరత్నమాల సద్వాదజ్ఞానమంజరి పంచశిఖానిర్ణయము దేవకల్పాత్మదర్పణము పూర్వాపరప్రయోగము దేవరహస్యకము సత్కర్మజ్ఞానబోధకము ననెడు శాస్త్రంబులఁ బదింటిని విరచించెను.

శ్లో.—అంబాస్తుతిం గురుస్తోత్రం తథా శృంగారనిర్ణయం
తంతుసూత్రం తథా శ్రావణాంకుశం కాలవేదనాం
ఏకవింశతిసద్దీక్షా విధి ర్లక్షణనిర్ణయః
పండితారాధ్యచరితం శైవసిద్ధాంత మేవచ
తథాప్రభుశిఖారత్నం మూలస్తంభనభాష్యకం
తథా వీరాగమవ్యాఖ్యాం టీకాం శైవాగమస్యచ
ఏత చ్చతుర్దశగ్రంథాన్ తత్త్వజ్ఞానప్రబోధకాన్
దేవదాసావతారేతు దేవాంగః కృతవా నభూత్.

తా.—దేవలబ్రహ్మ దేవదాస నామంబుతో నవతరించి, అంబాస్తుతి గురుస్తోత్రము శృంగారనిర్ణయము తంతుసూత్రము శ్రవణాంకుశము కాలజ్ఞానము ఏకవింశతి దీక్షావిధి లక్షణనిర్ణయము పండితారాధ్యచరిత్రము శైవసిద్ధాంతము ప్రభుశిఖారత్నము మూలస్తంభనభాష్యము వీరాగమవ్యాఖ్యానము శైవాగమటీక యనెడు తత్త్వార్థబోధకంబు లగు పదునాలుగు గ్రంథంబులను రచించెను.

దేవాంగసప్తావతార నిర్ణయము సంపూర్ణము

స్వస్త్యస్తు.

---

## శ్రీమత్ బ్రహ్మాండ పురాణాంతర్గత
## శ్రీచౌడేశ్వరీ సంభవమ్.

శ్లో.—ఆషాఢాఽమాఽర్ధరాత్రాంతే దైత్యైస్సంపీడితో భృశం
పునర్జాతవదాసీస్త్వం యస్మాన్మాం స్మృతవానసి
మమ జన్మదినం మత్వా నియమే పరమే స్థితః
మత్పూజాం కృతవాన్ భూయాఃకృతకృత్యో భవిష్యసి
రిపుక్షయో భవేద్వత్స వంశవృద్ధిః ప్రజాయతే
త్వద్వంశసంభవా యేచ తేఽతిభక్తి సమన్వితాః
వయనాది విహాయాఽత్ర నియమే పరమే స్థితాః
మత్కథాశ్రవణం కృత్వా స్తుత్వా నత్వార్చనాదిభిః
తోషయిత్వా భజేయుశ్చేత్తేషాం వృద్ధిందదామ్యహం
ప్రమాదాద్యది లుప్యేత తేషాం దుఃఖం పదేపదే
ఇత్యుక్త్వా సా మహాదేవీ తత్రైవాంతర ధీయత.

ఇతి శ్రీబ్రహ్మాండపురాణే దేవాంగచరితే శ్రీచౌడేశ్వరీ వరప్రసాద రాక్షసోపాఖ్యానం నామ ద్వితీయోఽధ్యాయః.

టీక.—వత్స = ఓపుత్రా! ఆషాఢ అమా అర్ధరాత్రాంతే= ఆషాఢ మాసముతోఁ జేరిన యమావాస్యతిథియొక్క యర్ధ రాత్రాంతమునందు, దైత్యైః = రాక్షసులచేత, భృశం = మిక్కిలియు, సంపీడితః = పీడింపఁ బడిన వాఁడవగుచు, యస్మాత్ = ఏకారణము చేత (రక్షణాభిప్రాయము చేత), మాం = నన్ను, స్మృతవాన్ అసి = దలంచినవాఁడ వగు

చున్నావో, (తస్మాత్ =ఆ కారణముచేత), త్వం=నీవు, పునఃజాత వత్ =మఱలఁ బుట్టినవానివలె, ఆసీః=అగుచున్నాఁడవు. పరమే నియమే స్థితః = శ్రేష్ఠమగు నియమమున నుండువాఁడ వగుచు, మమ జన్మదినం మత్వా=నాయొక్క జన్మదినంబును భావించి, మత్పూజాం= నాయొక్కపూజను, కృతవాన్ భూయాః=చేయు వాఁడవుగ నుండుదువుగాక! కృతకృత్యః భవిష్యసి=కృతార్థుండవు కాఁగలవు. రిపుక్షయః భవేత్ =శత్రునాశంబు కలుగును. వంశ వృద్ధిః ప్రజాయతే = వంశవృద్ధి కలుగునుగాక! యేచ త్వత్ వంశ సంభవాః = ఎవ్వరు నీయొక్క వంశమునందుఁ బుట్టిన వారలో, తే=వారు, అత్ర=ఈదినంబున,అతిభక్తి సమన్వితాః= మిక్కిలియు భక్తితోఁ గూడిన వారలై, వయనాది విహాయ= నేఁతలు మొదలగువానిని వదలి, పరమే నియమే స్థితాః = పరి శుద్ధమగు ననుష్ఠానము గలవార లగుచు, మత్కథా శ్రవణం కృత్వా=నాయొక్క చరిత్రంబుల విని, స్తుత్వా=స్తోత్రముచేసి, నత్వా=నమస్కరించి, అర్చనాదిభిః తోషయిత్వా = పూజలు మొదలగువానిచేత నానందము గలిగించి, భజేయుశ్చేత్ = సేవించిరేని, తేషాం=వారలకు, అహం=నేను, వృద్ధిం దదామి= అభివృద్ధి నొసఁగుచున్నాను. ప్రమాదాత్ = పొరపాటుచేత, లుప్యేతయది=లోపించునేని, తేషాం=వారికి, పదేపదే=మాటికి మాటికిని, దుఃఖం (భవేత్)=దుఃఖము కలుగును. ఇతి ఉక్త్వా= అనిచెప్పి, సా మహాదేవీ = పరమేశ్వరియైన యా చౌడేశ్వరీ దేవి, తత్రైవ అంతరధీయత= అచ్చటనే యంతర్హితయ్యెను.

తా.—శ్రీదేవాంగబ్రహ్మ, సూత్రవస్త్ర నిర్మాణంబునకై తంతు సంపాదనార్థ మేగుచుండఁగ రాక్షసు లడ్డగించి యర్థ రాత్రంబున మిక్కిలియు బాధింపఁ గడంగిరి. అప్పు డాతఁడు భక్తపరాధీనయగు జగదీశ్వరినిఁ బ్రార్థింపఁగఁ గారుణ్యాంతరంగ యగుచు నామహాదేవి, తన కిరీటకాంతులు రాక్షసులకు మిఱుమిట్లుగొలుపఁ జూడేశ్వరియై యావిర్భవించి రాక్షసనిర్మూలనంబు గావించి, పుత్రునకుఁ బ్రసన్నయై, "వత్సా ! ఈ యర్థరాత్రంబున రాక్షసులచేతఁ జిక్కుబడి రక్షణార్థము నన్ను ధ్యానించితివి. నాయొక్క కారుణ్యంబుచేత నీకుఁ బునర్జన్మంబు గలిగి నట్టులయ్యె. నిన్ను రక్షించుటకొఱకై యీ యాషాఢ మాస అమావాస్య దివసంబునఁ జౌడేశ్వరీ రూపంబుననావిర్భవించితిని. ఇది మొదలుగ నీవు నాయొక్క జన్మదివసంబున సమాహితచిత్తుండవై పరమ నియమంబున నన్నుఁ బూజించువాఁడవగుచు శత్రువిజయంబు వహించి వంశాభివృద్ధితోడఁ గృతార్థుండ వగుచు నుందువుగాక ! నీయొక్క వంశంబునఁ బుట్టిన వారు నయతము పరమభక్తిసమన్వితులై యీ దినంబున నేఁతలునేయుట మొదలగు లౌకికవృత్తులను విడిచి పరిశుద్ధానుష్ఠాన పూర్వకంబుగ నా చరిత్రంబులను వినుచు నన్ను స్తోత్రములు సేయుచు నమస్కార అర్చనాదులచేత నాకు నానందంబు గొలుపుచు నన్ను సేవించిరేని, యట్టివారికి నిరంతరాభ్యుదయంబులు గలిగించు చుందును గాక ! ఈ పర్వ దివసంబునఁ బొరపాటుచేత నేనియు మదీయ ధ్యానాది

కములు లేనివారు నిర్నిమిత్తంబులగు దుఃఖపరంపరలకు లోనగుచుందురు." అనిచెప్పి భక్తపరాధీనమైన యా చౌడేశ్వరీదేవి యంతర్ధానమొందెను.

ఇట్లు, శ్రీ బ్రహ్మాండ పురాణాంతర్గతంబగు దేవాంగచారిత్రమునందు శ్రీ చౌడేశ్వరీ వరప్రసాదరూపకం బయిన రాక్షసోపాఖ్యానం బనెడు రెండవ యధ్యాయమున నిరూపితము.

మంగళమ్.

అమెరికన్ డైమెండు ముద్రాక్షరశాల, చెన్నపురి. 1925.